# శ్రీ తిరుమల రామచంద్ర

# జీవితం - సాహిత్యం

అక్కిరాజు రమాపతిరావు

సద్గురు శ్రీ కందుకూరి శివానందమూర్తి గారి

ఆశీస్సులతో

సుపథ ప్రచురణలు

2003

SRI TIRUMALA RAMACHANDRA

A Literary biography - By **AKKIRAJU RAMAPATI RAO**

**శ్రీ తిరుమల రామచంద్ర - జీవితం : సాహిత్యం**

**అక్కిరాజు రమాపతిరావు**


**ప్రథమ ప్రచురణ : 2003, ఏప్రిల్**

**(స్వభాను సం. ఉగాది)**

**ప్రతులు: 1000; పుటలు 164**

**మూల్యం 80 రూ/-లు. ; U S A : $ 8**

**ముఖపత్రాలంకరణ :** శ్రీ జి.వి. అమరేశ్వరరావు

**డి.టి.పి. :**శ్రీ రామా గ్రాఫిక్స్

**ముద్రణ :**కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్

విద్యానగర్, హైదరాబాదు-44

ఫోన్‌లు: 27618261,27653348

**ప్రతులకు :** అక్కిరాజు రమాపతిరావు,

2 -2-18/47, బి -20, ఫ్లాట్ నెం.104,

శ్రీ సాయికృపా రెసిడెన్సీ, డి.డి. కాలనీ,

హైదరాబాదు - 500 013.

ఫోన్: 27423352

**ఇంకా పుస్తకాల షాపులలోనూ.**

# నాకు తెలియని మా నాన్నగారు!

డా. తిరుమల నీరజ

నాన్న! తలచుకుంటేనే దుఃఖం పొంగి వస్తుంది.

ఎటువంటి మనీషి ఆ నిరాడంబరుడు! జీవితాంతం ఖద్దరు బట్టలే కట్టిన గాంధీయవాది. ఇద్దరు ముగ్గురు బహూకరించినా కనీసం చివరిదాకా గడియారం కూడా కట్టని యోగి. చదువులూ, రాతలే తన జీవితధ్యేయంగా, వాటికోసమే చివరి క్షణం వరకూ పరిశ్రమించిన మేరు నగధీర మనస్కుడు. వంట చేయడం సమయాన్ని వ్యర్థం చేయడమేనని కొంతకాలం అపక్వాహారం తీసుకుని కాలం గడిపిన నిత్యసంతోషి!

అలాంటి మా నాన్నగారిని గురించి రాయవలసి వస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు. జీవితులై వున్నంత కాలమూ తనలోని కోణాలను ఏ మాత్రం ఎవరికీ ప్రదర్శించకుండా గడపగలిగిన మనోదార్ఢ్యం గలవారాయన. నేను పుట్టకముందు– అంటే నేను మా తల్లిదండ్రుల వివాహం తరువాత పదిహేనేళ్ళకు జన్మించాను– మా అమ్మగారి జపతపాల పుణ్యఫలంగా అని ఆమె అంటుంటారు. ఆమె పేరు అనంతలక్ష్మి. మా తాతగారు శ్రీమాన్ శేషాచార్యులవారు "అంతమ్మ నీళ్లు పోసుకుందా?" అని తరచూ అడుగుతుండేవారట. ఆయన ఆశ ఆయనది. తన ఇంటికి వారసులు పుట్టకుండానే తాను కన్ను మూస్తానేమోనని ఆయన బాధ. అలాగే జరిగింది. ఆయన మరణించిన ఏడాదికి 1954లో నేను పుట్టాను. పళ్లు వస్తున్న సమయంలో కిందపడి మూతికి దెబ్బలు తగిలించుకుంటే పళ్లు వంకరగా వస్తాయని నేనసలు కింద పడకుండా చూసుకునేవారట నాన్నగారు. అంత అపురూపంగా పెరిగాను.

నాకు ఐదారేళ్లున్నప్పుడనుకుంటాను, ఆయన 'నుడి–నానుడి' రాస్తుండేవారు. నాకు పేరు పెట్టడంలో కూడా చర్చలే. నాది విశాఖ నక్షత్రం కావటం వల్ల 'విరజ' అని పెడదామనుకున్నారట. కానీ అది పెడర్థాలకు దారితీస్తుందేమోనని 'జలజ' అని పెట్టారట. కానీ మా ఇంటికి మా చుట్టమూ, నాన్నగారు ఎంతో గౌరవించే శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణమాచార్యులుగారు వచ్చినప్పుడు, ఆయన నా పేరును 'నీరజ'గా మార్చారట. రోజుకు ఓ పాతిక–ముప్ఫైకప్పుల కాఫీ తాగే

అలవాటుండేది నాన్నగారికి. రాత్రంతా మేలుకుని వుండి రాసుకుంటూ, ఆలోచనలూ, ఐడియాలూ రాకపోతే అటూ ఇటూ పచార్లు చేస్తూ వుండేవారు నాన్నగారు. నిద్ర పట్టని రాత్రులలో నేనాయనను చాలాసార్లు గమనిస్తుండేదాన్ని. నేను ఏ కాస్త కదిలినా సరే, చటుక్కున రాస్తున్న దాన్ని అక్కడికి వదిలేసి, నా దగ్గరికి వచ్చి కూర్చునేవారు. "ఏం తల్లీ? నిద్ర పట్టడం లేదా? ఎందుకని? రాత్రి కడుపు నిండా అన్నం తినలేదా?" అని ఆప్యాయంగా అడుగుతూ, తల నిమురుతుండేవారు. నాకేదో సామ్రాజ్యం లభించినట్లయ్యేది ఆయన మాటలతో. ఏవేవో కబుర్లు చెబుతుండేవారు. కథలు చెబుతుండేవారు. అవి అర్థమయ్యాయో, లేదో తెలుసుకోవటానికి ప్రశ్నలు వేసేవారు. నాకు అలా చిన్ననాడే రకరకాల పుస్తకాలు చదవటం అలవాటు చేసింది నాన్నగారే!

నాన్నగారిని అంతా 'ఆచార్లుగారు' అనేవారు. ఆయన అసలు పేరు అందరూ పూర్తిగా మరిచారేమో అనుకునేదాన్ని. 'నుడి-నానుడి' రాస్తున్న కాలంలో రకరకాల పదాలను నా చేత అనిపించేవారు. నా ఉచ్చారణపద్ధతి గమనిస్తూ చాలా రాసుకునేవారు. అదేదీ అప్పుడు నాకు అర్థమయ్యేది కాదు. సాయంకాలం వేళల్లో ఇంటికొచ్చే ప్రముఖులలో విద్వాన్ విశ్వంగారు, బి.ఎస్.ఆర్.కృష్ణగారు, సెట్టి ఈశ్వరరావుగారు, బుద్ధవరపు కామరాజుగారు.... ఇలా కొందరే నాకు గుర్తున్నారు. వాళ్లంతా గంటలతరబడి మాట్లాడుకునేవారు. గట్టిగా నవ్వుకునేవారు. నేను చిన్నదాన్ని కాబట్టి అక్కడే కూర్చుని వారిని గమనించినా, ఏదీ తెలిసేది కాదు. ఇవాళ తెలుసుకుందామన్నా నాకా అవకాశం లేదు. ఆ నాటి సంగతులు ఈనాడు గుర్తులేకపోగా, కృష్ణగారు తప్ప తక్కినవారు లేరు మరి! అలా ఎందరెందరో రావటం, వారి గోష్ఠులు అక్కడ జరగడం చూసి నాన్నగారేదో చాలా గొప్పవారే, లేకపోతే అంతమంది ఆయనతో మాట్లాడటానికి ఎందుకొస్తారని అనుకునేదాన్నంతే. పద్యాలూ, పాటలూ, నవ్వులూ అంతా సందడిగా వుండేది. మా అమ్మగారు వచ్చినవారందరికీ చిరునవ్వుతో కాఫీలూ, టిఫిన్లు అందిస్తుండేవారు. అక్కడే కూర్చుని నేనూ తింటూ వాళ్లను చూస్తుండేదాన్ని.

క్షేమేంద్రుని 'బృహత్కథామంజరి'ని తెలుగులోకి అనువదించారు నాన్నగారు.

అప్పుడు ఆయన ఆంధ్రపత్రికలో పని చేస్తుండేవారు. వారపత్రికలో ధారావాహికంగా ప్రచురిస్తుండేవారు. ప్రతివారమూ చదువుతుండేదాన్ని చాలా కుతూహలంతో అందులో ఓసారి ఓ కథ పేరు 'ఎవరు భర్త' అనే ఆ హెడ్డింగు కిందే 'తిరుమల రామచంద్ర' అని నాన్నగారి పేరూ ప్రచురించారు. ఇక నా తమ్ముడు ఒకటే అల్లరి చేశాడు-"'ఎవరు భర్త? తిరుమల రామచంద్ర'' అంటూ. అది తలుచుకున్నప్పుడల్లా నవ్వేవారు ఆయన, "పిల్లలకు తోచినవి మా పత్రికలవాళ్లకు తోచలేదే!" అంటూ. తమ్ముడి విషయంలో ఆయన విశ్వప్రయత్నించారు అతన్ని ఓ జర్నలిస్టును చేసి తన వారసత్వం నిలుపుకుందామని. అతను మాత్రం తనకు ఉపాధ్యాయవృత్తే బాగుందనుకున్నాడు. అలా తీరని తన కోరికను నాన్నగారు నన్ను 'ఆంధ్రప్రభ' సచిత్రవారపత్రికలో ఉద్యోగినిని చేసి తీర్చుకున్నారు. ఆయన వలె- 'వలె' అనటం కూడా దుస్సాహసమే! అంత కాకపోయినా కనీసం జర్నలిస్టును అయినందుకు నాకూ కాస్త సంతోషమే.

చిన్నప్పటి నుంచే దానికి నాలో పునాదులు వేశారు. మాటలు వచ్చీరాని వయసులోనే "నీ పేరేమిటి?" అని ఇంటికి వచ్చినవాళ్లెవరైనా నన్ను అడిగితే "టి. నీలజ, బి.ఏ." అనేదాన్నట. నాకు పిల్లలు పుట్టిన తరువాత కూడా ఆ సంగతి చెప్పి నవ్వేవారు. నా పేరు సరిగ్గా ఉచ్చరించటం రానిదాన్ని, అప్పటినుంచే తెలుగు బి.ఏ. చదివేందుకు మానసికంగా తయారుచేశారు. అలా నేను తెలుగు బి.ఏ అయ్యాను. నా డిగ్రీ చూసి ఎంతానందించారో చిన్నపిల్లవాడిలాగా! ఇంటికొచ్చిన అందరికీ "మా అమ్మాయి, డాక్టరేటు" అని చెప్పి మరీమరీ సంతోషించేవారు. "నా పేరు నిలబెట్టాలమ్మా!తెలిసిందా?" అనేవారు. అదేమిటో తెలియలేదు అప్పుడు నాకు. ఇవాళ దాన్ని గురించి చెప్పే మా నాన్నగారు లేరు. ఆయన మా హీరో! ఆయన మాకు అందని దూరాలకూ, తీరాలకూ పోయి మమ్మల్ని జీరోలను చేసేశారు.

డాక్టరేటుకు థీసిస్ తయారుచేస్తున్న కాలంలో ఆయన సలహాలిచ్చేవారు కాదు. "స్వయంకృషితో రాయాలి. నువ్వు రాశాక చూస్తాను. కానీ కావలసిన మాటరంతా రాసి పెడతాను" అంటూ నా కోసం లైబ్రరీలు తిరిగి ఎంతో విషయం సేకరణ

చేశారు. ఆ కాయితాలు ఇప్పటికీ నా దగ్గరున్నాయి. సంస్కృత విక్రమార్కచరిత్ర చూసి (నా సబ్జెక్టు జక్కన విక్రమార్కచరిత్రము-విమర్శనాత్మకపరిశీలనము) పద్యతాత్పర్యాలు రాసిపెట్టారు. ఏదైనా రాయాలంటే చిన్నపిల్లవాడిలాగా సరదా పడేవారు. వేయికి పైగానే వ్యాసాలు రాసినా ఎప్పటికప్పుడు, అప్పుడే కొత్తగా రాస్తున్నవారిలాగా శ్రమించేవారు. ఒక నిరంతరవిద్యార్థి ఆయనలో కనిపిస్తుండేవాడు. "బాగుందా చూడమ్మా! చదివి చెప్పు. నువ్వే ఈ రచనకు తొలిపాఠకురాలివి" అనేవారు. చివరిదాకా ముత్యాలకోవ లాంటి దస్తూరీ వుండేది ఆయనకు. నలభైఏళ్ల వయస్సులో వున్న నన్ను ప్రోత్సహించి జర్నలిజమ్‌లో పి.జి. డిప్లొమా చేయించారు. దానిక్కూడా ఆయనదే విషయసేకరణ అంతా. అంతా నాకు ఉపయోగపడకపోయినా, ఆయన ఉత్సాహానికి ఆశ్చర్యం కలిగేది. "ఎలా నాన్నా, ఇంత ఓపికగా విషయసేకరణ చేశావు?" అనడిగితే, ఏముందమ్మా, పరీక్షలు రాసేది నా కూతురు కనుక చేయగలిగానంతే! ఇలాంటి ఉత్సాహమే జీవితమంతా అన్ని విషయాల్లోనూ వుండాలి. అప్పుడే ఏ పనైనా సొంతంగా చేసుకోగల ధీమా కలుగుతుంది" అన్నారు.

ఎప్పుడైనా నేను డిప్రెషన్‌లో పడితే, ఎంతగానో ఓదార్చేవారు. "కష్టాలనేవి మనిషికే కలుగుతాయి. ధైర్యంతో ముందుకు పోవాలి. అందరమూ ఒంటరిగా వచ్చాము. ఒంటరిగానే పోవాల్సివుంది. చివరిదాకా నీకెవరూ తోడుండరు. కనుక ధైర్యే సాహసే నీరజా" అంటూ నవ్వించేవారు. జీవితం ఒక రైలు ప్రయాణం వంటిది. అందులో నీ గమ్యం దాకా నువ్వు ఒంటరిగానే వెళ్లాలి. కంపార్టుమెంటు ల్లోకి జనం స్టేషన్లలో ఎలా ఎక్కుతుంటారో జీవితంలోనూ అలాగే ఎన్నో రకాలైన వ్యక్తులు తారసపడుతుంటారు. వారిలో కొందరు నీకు మిత్రులు కావచ్చు. మరెవరైనా శత్రువులు కావచ్చు. నీమీద దుష్ప్రచారం జరిగితే ఆందోళన చెంది దుఃఖించకూడదు. ఎవరెటువంటి ప్రచారం చేసినా మనసుకు అంట నివ్వకూడదు. అన్నిటిలోనూ వుంటూనే అన్నిటికీ దూరంగా తామరాకు మీది నీటిబొట్టులా వుండేందుకే ప్రయత్నించాలి" అని చెబుతుండేవారు. జీవితంలో అనుభవాలను ఎదుర్కొనే సమయం వచ్చినప్పుడు ఆయన మాటల్లోని నిజాలు అర్థమవుతున్నాయి.

కానీ చెప్పుకునేందుకు నా మంచిమిత్రుడు, నా బెస్ట్ ఫ్రెండ్, నాకు ఆదర్శంగా నిలిచిన నాన్నగారు లేరు! ఎంతో అనుభవం మీదే పెద్దలేదైనా చెబుతారు. అజ్ఞానంతో అప్పుడు నవ్వుకున్నా జీవితానుభవం దాన్ని ఎదుర్కొనేలా చేసి కంటతడి పెట్టించి తీరుతుంది.

ఏ పనైనా చేసేందుకు "బోర్!నాన్నా!బోర్! ఇంకాసేపు ఆగే అవకాశం లేదా?" అని ఎప్పుడైనా అంటే, "జీవితంలో ఏదీ బోర్ కాదు. బోర్ నిన్ను కొడుతుందో, ఆ బోర్‌నే నువ్వు కొట్టి తరిమేస్తావో చూడు. ఎప్పుడూ బిజీగా వుండాలి తల్లీ! పని నుంచి పనికి మారటమే విశ్రాంతి అనేది కూడా తెలుసుకో. పైగా తప్పని పనులు చేయటానికి ఒక సూత్రం వుంది. ఏడుస్తూ, విసుక్కుంటూ, దిగులుతో ఆ పని చేస్తే అది ఎన్నటికీ త్వరగా పూర్తి కాదు. పైగా అసంతృప్తి మిగిలేవుంటుంది. అలా కాకుండా చేయకతప్పని పనులను సంతోషంగా చేసి చూడు. నీకే తెలుస్తుంది. అందులోని రహస్యం. సంతోషంగా చేయటం వల్ల ఆనందమూ కలుగుతుంది. ఆ పనీ త్వరగా పూర్తవుతుంది. అది చేసిన తృప్తీ దక్కుతుంది. నిరంతరం ఏదో పని చేస్తూనే వుండాలి. లేకపోతే జీవితం నిజంగానే మీరనే బోర్ కొడుతుంది. ఎప్పటికీ ఒక లక్ష్యాన్ని పెట్టుకుని దాని దిశగా సాగే గుణం అలవరచుకోవాలి. లక్ష్యరహితజీవితం నిజంగానే వ్యర్థం!" అంటుండేవారు. ఊరికే కూర్చుంటే తనకు బోర్ అనేవారు.

పరులకు ఉపకారం చేసిన బ్రతుకే బ్రతుకనేవారు. ఎవరికైనా సరే ఏ చిన్న సాయమైనా చేస్తే దానివల్ల కలిగే ఆనందాన్ని గురించి తరచూ చెబుతుండేవారు. అలా ఒకరికి ఇవ్వటం 'వన్ వే ట్రాఫిక్' కాదా? అని ప్రశ్నిస్తే, ఎన్నటికీ కాదనేవారు. ఆయన మాటల్లోనే, "ఒకరికి ఉపకారం చేయటం మంచిపని. మానసికసంతోషానికి దారి. కానీ ఎప్పుడూ కూడా ఎవరి నుంచీ ఏదీ ఆశించవద్దు. అలా ఆశించటంవల్లనే కదా నిరాశ కలిగేది? దానివల్లే కదా అసంతృప్తి పెరిగేది? అందువల్ల చేయటం నీ వంతు. ఫలితాన్ని ఆశించకు. దానికి ఫలితం నీకు ఇంకెక్కడో మరెవరి ద్వారానో కలుగుతుంది. కానీ అలా కలుగుతుందని కూడా ఆశించవద్దు. 'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' అనేది గుర్తుంచుకోవాలి.నిరాశ కలిగించుకునేది మనమే. దాన్ని కలుగనీయకుండా చేసుకునే నేర్పును సంపాదించాలి." ఇటువంటి

ఉదాత్తస్వభావం గల వ్యక్తి మా తండ్రిగారు కావడం మా అదృష్టం కాదా? ఎన్నో జన్మల సుకృతం కాదా?

ఆయన కోరికనో దాన్ని తీర్చిన ఘనత-తప్పకుండా నా మట్టుకు నాకు అది ఘనతే!-నాకే దక్కుతుంది. ఎవరింట్లోనో కలర్‌టీవీ చూసి చాలా ముచ్చటపడ్డారు. రిమోట్‌కంట్రోల్‌తో దాన్ని ఆ ఇంటివారు ఆపరేట్ చేయటం ఆయనకు సంతోషం కలిగించింది. ఇంటికొచ్చి "అమ్మా! నాకు కదలకుండా కూర్చున్నచోటి నుంచే పెట్టే టీవీ కావాలి. కొనిపెట్టు" అని అడిగారు. నాకు ఆశ్చర్యం కలిగింది. "అదేమిటి నాన్నా? అది చాలా ఖరీదైనది. అంత స్తోమత నాకు లేదు. అయినా ఎప్పుడూ ఏదీ కోరనివాడివి ఇలాంటి కోరికా కలిగింది నీకు?" అన్నాను. "నాకేం తెలీదమ్మా! నాకది కావాలంతే! నేను కొంత డబ్బిస్తాను. తక్కినది నీవు సర్దుకో" అని ఏడువేల రూపాయలు తెచ్చిఇచ్చారు. ఇక నా తంటాలేవో పడి ఆయన కోరిక తీర్చాను. 1996 అక్టోబరు 18న ఆయన కోరిన కలర్ టీవీ తెచ్చి పెట్టాను. ఆ ఏడాదంతా తెల్లవారు జామున రెండు-మూడుగంటల వరకూ మేలుకుని 'స్టార్ మూవీస్ ఛానెల్‌లో ఇంగ్లీషు సినిమాలు చూస్తుండేవారు. చేతులు కట్టుకుని దాని ముందు, ఉపాధ్యాయుని ముందు నిలబడిన విద్యార్థిలా నిలబడి, చూసేవారు. "నాన్నా! కుర్చీలున్నాయి. కూర్చుని చూడొచ్చు కదా!" అని నేనంటే, "అదేం కాదమ్మా! నాకిలా నిలబడి చూడటమే బాగుంటుంది" అనేవారు. పూర్తిగా ఏడాది కూడా చూడలేదు. 1997 అక్టోబరు 12న ఆయన మమ్మల్నందరినీ దుఃఖసాగరంలో ముంచేసి, మరో లోకానికి తరలిపోయారు.

ఇంటిపనులేవైనా చేయమని చెబితే, "నేను ఇంటలెక్చువల్‌ని తల్లీ! నన్ను అలా వాడుకోవాలి. అది మానేసి, కూరగాయలు తీసుకురా, నిమ్మకాయలు తరిగి పెట్టు-అంటే నేనేం చేయాలి చింతించక?" అనేవారు. ఆయన రక్తం నా ఒంట్లో పారుతున్నందువల్లనేమో, ఆయన చెప్పినవన్నీ ఆచరించాలనే తాపత్రయం వుంది. "ఫలానా ఆయన కూతురు, పరవాలేదు" అని ఒకరన్నా చాలు, నా జీవితం ధన్యమవుతుంది! ఆయన ఆశీస్సులందిస్తూనే వుంటారు ఎక్కడున్నా. అదే నా నమ్మకం, మూడేళ్లు గడిచినా, ఆయన నా వెంట వుండి నడిపించబట్టే నా జీవితం

సాగుతూందని నాకు ప్రగాఢ విశ్వాసం. ఇప్పటికీ ఇంట్లో తిరుగుతూ వున్నట్లే, "తల్లీ! నీరజా" అని ఏదో కావాలని పిలిచినట్లే వుంటుంది నాకు. ఎంత రాస్తే ఆయన లేని లోటు పూడేను! ఎంతదుఃఖిస్తే మా మనస్సులకు ప్రశాంతత చిక్కేను!

ఆయన దగ్గర పెద్దకుమార్తెగా నాకున్న చనువు మా ఇంట్లో మరెవరికీ లేదు. అందుకే ఆయనను ఏకవచనంతో సంబోధించేదాన్ని. మా స్నేహితురాళ్లూ, క్లాస్‌మేట్లూ చాలా ఆశ్చర్యపడేవారు. వారి ఇళ్లలో తండ్రి రాగానే అక్కడెవరూ వుండకుండా వెళ్లిపోతారట. వారి వారి తల్లులు కూడా ఏ మాత్రం చప్పుడు చేయొద్దని పిల్లలను హెచ్చరిస్తారట. తండ్రి పేరు వినగానే గజగజ వణికిపోతారట. మా తండ్రీపిల్లల అనురాగం, అనుబంధం చూసి వాళ్లు చాలా అసూయ పడేవారు కూడా. మా ముగ్గురు పిల్లలనూ ఆయన స్నేహితుల్లా చూసేవారు. అందుకే ఆయన లేని వెలితి ఈ జీవితాంతం మాకు తీరేది కాదు! మాకు అత్యంత ఆత్మీయుడూ, పరమమిత్రుడూ, ఫిలాసఫర్, గైడ్, ది గ్రేట్ హీరో, అభిమానరచయితా ఆయనే! ఆయన చెప్పిన సూత్రాలను మననం చేసుకుంటూ, జీవితంలో ఎదురయ్యే ఒడిదుడుకులను తట్టుకునేందుకు ఆయనే మా వెంట వున్నారనుకుంటూ ముందుకు సాగుతున్నాం. నేటికీ సంతోషం కానీ, దుఃఖం కానీ కలిగితే ఆయన ఛాయాచిత్రం ముందు నిలబడి కన్నీరూ, ఆనందబాష్పాలూ కురిపించడం నాకు అలవాటైపోయింది. ఏం జరిగినా అలా చేయటమే నాకు తెలిసింది. మనుషులను పోగొట్టుకున్న తరువాతే వారి విలువ తెలుస్తుందన్నది నూటికి నూరుపాళ్లూ నిజమైంది!

ఇంతకూ ఈ వ్యాసశీర్షిక 'నాకు తెలియని మా నాన్నగారు' అని పెట్టి తెలిసిన సంగతులన్నీ రాసేశాను. ఆయన ఏమిటో, ఏం చేసేవారో, మా కెవరికీ ఎప్పుడూ చెప్పలేదు. రాసిన పుస్తకాల వివరాలు కూడా మాకేమీ తెలియవు. బయోడేటా తయారుచేయించారు చివరి రోజుల్లో. అది చూసి మా గుండెలు పగిలిపోయాయి. ఇంత గొప్పవారా మా నాన్నగారు! అయినా జీవితకాలం కొంతమాత్రమే తెలియజెప్పి మరి చిరునామా కూడా ఇవ్వకుండా వెళ్లిపోయారు కదా! అదృష్టం కొద్దీ ఆయన రాసిన పుస్తకాలు మాకు తరగని పెన్నిధులుగా మిగిలాయి. అదే మహద్భాగ్యం! అందుకే ఆయన ఎప్పటికీ మాకు తెలియని నాన్నగారు! 

# శ్రీ తిరుమల రామచంద్ర

## (1913 - 1997)

శ్రీ తిరుమల రామచంద్రగారి జీవితం చాలా విలక్షణమైనది. విశిష్టమైనది. వైవిధ్యానుభవ భరితమైనది. బహుశః నూటికి తొంభైతొమ్మిదిమందికన్నా ప్రత్యేకమైనది. సామాన్య అసామాన్యమో, సాధారణ అసాధారణమో అని చెప్పాలి ఆయన జీవితాన్ని గూర్చి. ఆయన చాలా ఉత్తముడు. ఉదాత్తుడు. ఆత్మగుణ సంపన్నుడు. నిగర్వి. లోకసామాన్యమైన ప్రలోభాలకు, బలహీనతలకు అతీతుడనే చెప్పాలి. అతీతుడవునోకాదో కాని వాటిని ఎంతగానో అదుపులో ఉంచుకున్నా డాయన. ఆయన ఎనిమిదిన్నర దశాబ్దాల జీవిత కాలంలో, పోనీ పసి వయస్సు నాలుగేళ్ళు ప్రస్తావనలోకి తీసుకుకోకపోయినా ఎనిమిది దశాబ్దాలు, ఒక చారిత్రక వ్యక్తిలాగానే ఆయన జీవితం గడిచింది. అపురూపమూ, అద్భుతమూ అయిన జీవిత సంఘటనలను, గొప్ప వ్యక్తులను, మానవ ప్రాతిపదిక ప్రవృత్తుల లోతులను, ఎత్తులను, మామూలు జీవితాలలో సాధారణంగా తారసిల్లని సన్నివేశాలను ఆయన ఆకళించుకున్నారు. అలాటి ప్రకృతి, వికృతులకు శ్రీరామచంద్ర సాక్షిభూతులైనారు.

ఒకానొక వ్యక్తిని సమాజం ఎందుకు గౌరవిస్తుంది? తన వాడను కుంటుంది? ఆయన గూర్చి ఎందుకు చెప్పుకుంటుంది? ఆర్ద్ర మనస్కతతో ఆ వ్యక్తిని గూర్చి ప్రస్తావిస్తుంది? ప్రశంసిస్తుంది? అంటే ఆ వ్యక్తి ఒక ఆదర్శ లక్ష్యంతో, విశిష్ట గుణాలతో తన జీవితం గడుపుకోవటం వల్లనే. ఆ వ్యక్తి తన జీవితకాలంలో ఆయా మనుగడ సన్నివేశాలలో చూపిన ప్రవర్తన వల్లనే. ఒకవేళ తనలోఏవైనా లోపాలుంటే ఆ లోపాలు ఇతరుల జీవితాలను ప్రభావితం చేయకుండా నియంత్రించుకోవడం ఆ వ్యక్తి సౌజన్యానికి, సౌశీల్యానికి నిదర్శనం. అసలటువంటి లోపాలేవీ శ్రీరామచంద్రగారిలో లేవు. ఈ విషయం ఆయన స్వీయచరిత్ర వ్యక్తీకరిస్తుంది. బహుశః 20వ శతాబ్దంలో తెలుగులో వచ్చిన మంచి పుస్తకాలలో, గొప్ప పుస్తకాలలో ఏ పది పదిహేను పుస్తకాలు పరిగణించాలన్నా ఈ స్వీయ చరిత్ర లెక్కకు వస్తుంది. ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలో చెప్పుకోవలసిన ఇరవైమంది ప్రముఖులలో ఆయన నిస్సందేహంగా ఒకరు. ఆరు దశాబ్దాలపాటు తెలుగు పత్రికా రంగంలో ఆయన రాసింది పదివేల పుటలకుపైగానే ఉంటుంది. అంతేకాదు ఇంతటి వైవిధ్య విజ్ఞాన ప్రసారంచేసిన వారు కూడా ఇంకొకరు లేరు. ఇన్ని భాషలతో పరిచయం ఉన్నవారు కూడా ఏ ఒకరిద్దరుంటారో ఉందరో! కావచ్చు. గొప్ప పండితుడైనంతమాత్రం చేత సమాజానికి అటువంటి వారివల్ల సత్ప్రయోజనం ఏమిటనవచ్చు! గొప్ప పండితులై ఉండీ ప్రతిభావంతులై ఉండీ సమాజ సాంస్కృతిక ఆశయాలను నిలబెట్టేవారు ఆ సమాజానికి అంతరాత్మ ప్రబోధం, ప్రచోదనం చేస్తున్నవారవుతారు. ఆ సమాజపు ఆత్మిక శక్తులను నిలప గలిగిన వారవుతారు. అటువంటివారే ఋషులు, ప్రబోధకులు, మార్గదర్శకులు, మహనీయులు అనిపించుకుంటారు. మానవ జీవితపు పరమార్థాన్ని వారు చాటిచెపుతారు. పరమార్థ జీవితాన్ని వారు జీవిస్తారు.

లోకంలో సాధారణ జీవితాలకు మహనీయుల జీవితాలకూ ఉండే అంతరం ఏమిటో తెలుసుకుంటే ఆ ప్రతిభాశాలుర విలక్షణత ఏమిటో తెలుస్తుంది. వాళ్ళను ఎందుకు గౌరవించాలో, అభిమానించాలో, వాళ్ళను గురించి పదే

పదే రాయాలో అర్థమవుతుంది. తెలుసుకోవాలో తెలుస్తుంది. వాళ్ళు భోగభాగ్యాలు, పరువు ప్రతిష్ఠలు, పదవులు హోదాలు, సమ్మానాలు, సత్కారాలు, బిరుదులు భుజకీర్తులూ ద్వారా లోకానికి ప్రచురంగా పరిచయమై ఉండకపోవచ్చు. కాని వాళ్ళు చేసిన పనివల్ల, చూపిన ప్రతిభవల్ల కొన్ని తరాలనైనా ప్రభావితం చేస్తారు. తమ జీవితకాలంతోనే వాళ్ళ ప్రతిభ, వాళ్ళ కృషి, వాళ్ళ ఆర్జవం, వాళ్ళు పాటించిన ప్రమాణాలు విస్మృతం కావు. సమాన ధర్ములను ఎంతగానో ఉత్తేజపరుస్తాయి ఆ తర్వాత కూడాను.

లోకంలో సాధారణంగా నూటికి తొంభైమంది గతానుగతికంగానే జీవిస్తారు. ఏదో పనిమీద సిటీబస్సుఎక్కి తాము దిగవలసిన చోట దిగిపోయినట్లుగానే సాధారణుల జీవితాలు సాగుతాయి. తాను దిగవలసిన నిర్దేశిత స్థలం వరకు ప్రయాణించడానికి కొంత ఏదో మూల్యం చెల్లించి అందుకు ఉద్దిష్టమైన టికెట్ తీసుకుంటాడు సామాన్యుడు. దిగిపోయిన తర్వాత ఆ టికెట్ ఎందుకూ పనికిరాదు. దాన్ని ఏవిధంగానూ ఉపయోగించుకోవటం కుదరదు. లక్షల, కోట్ల మానవాళి జీవనగమనం, గమ్యం ఈ విధంగానే ఉంటుంది. వాళ్ళ జీవితాలలో గొప్ప సంఘర్షణలు, సమస్యలు, ఉద్వేగాలు, పోరాటాలు, అసాధ్య సాధ్యాలు ఏవీ ఉండవు.

అట్లాకాక మహోద్యమాలు నడిపినవాళ్ళు, మహారాజ్యాలు ఏలినవాళ్ళు, యుద్ధాలు నిర్వహించినవాళ్ళు ఒక జాతిని, ఒక దేశాన్ని ప్రభావితంచేసిన మహా నేతలు, రాజకీయ నాయకులు, దేశభక్తులు, త్యాగవీరులు, గొప్ప రచయితలు, కవులు, కళాకారులు, చిత్రకారులు, సంగీత ప్రతిభావంతులు, తమ తమ జీవితాలలో ఉద్వేగ భరితమైన, ఉత్కంఠాకలితమైన క్షణాలను, సమయాలను, సన్నివేశాలను అధిగమిస్తారు. వాళ్ళలో ఆత్మశక్తి బలీయంగా ఆవిష్కృతమవుతుంది. మానవ జీవితానికి చవీసారమూ, రుచి శుచీ ఎప్పటిప్పుడు ఆత్మ శక్తి సంపన్నుల వల్లనే లోకానికి వెల్లడవుతాయి. అనేకమైన ప్రలోభాలను, వ్యక్తిత్వ ఘర్షణలను, అసాధారణ పరిస్థితులను విశిష్ట వ్యక్తిత్వంగలవారు ఎదుర్కొని కృతకృత్యులవుతారు. ఈవిధంగా శ్రీ తిరుమల రామచంద్ర జీవితంలో

ఎన్నో విలక్షణమైన, విశిష్టమైన సంఘటనలు, సన్నివేశాలు ఉన్నాయి. బహుశః ఇరవయ్యో శతాబ్ది తెలుగు రచయితల ఎవరి జీవితాలలోనూ ఇటువంటి ఉదంతాలు ఉండి ఉండవు. కారణం ఏమిటి? శ్రీ రామచంద్ర చూసినంత విశాలమైన, విస్తృతమైన మానవ జీవితాన్ని తక్కినవారు చూడకపోవడమే.

ఒక కోటీశ్వరుడున్నాడనుకుందాము. అతడు సీదాసాదాగా ఆ స్థితికి ఎదిగి ఉండే అవకాశం లేదు. ఎంతో స్వావలంబన ప్రజ్ఞ, ప్రతిభ, అననుకూల పరిస్థితులను అనుకూలంగా మార్చుకోగలగడం, మానవ సంబంధాలను గూర్చిన అవగాహన, నిరంతర జాగరూకత ఆ అసాధారణ సంపన్నుడి జీవితంలో కనపడతాయి. అట్లానే దేశంలో అత్యున్నత పదవి నధిష్ఠించిన వ్యక్తి, అది ఏ రంగంలోనైనా, అటువంటి వారి జీవితాలలో ఆశ్చార్యావహమైన పరిస్థితుల మేళనమో, సమ్మేళనమో కనపడతాయి. అయితే అక్రమంగా, అన్యాయంగా, కుతంత్రాలతో, కౌటిల్యంతో అల్పకాలికమైన లబ్ధిని సాధించినా అటువంటి విజయాలు సమాజాన్ని ఉత్తేజ పరచలేవు. పైగా సమాజంలోని విలువలను కలుషితం చేస్తాయి. అత్యాశను, అవినీతిని సమాజంలో పండించి మానవ సంబంధాల సంతులనాన్ని సంతాపింపచేస్తాయి.

సమాజానికి స్ఫూర్తిమంతాలైన జీవితాలనే లోకం ఆమోదిస్తుంది. లోకాన్ని అవే అలరిస్తాయి. అంతేకాని ఎంత ప్రతిభ ఉన్నా, అసాధారణమై మేధాశాలిత ఉన్నా, అన్ని అవకాశాలు కలిసివచ్చినా ఎందరో జీవితాలను అర్థాంతరంగా పాడు చేసుకోవడం కూడా కద్దు. అత్యంత సౌందర్యవంతులై, అమిత ఐశ్వర్యవంతురాండ్రైన సినిమాతారలు ఆత్మహత్యల పాలైనారు. కాని వాళ్ళపేర్లు ఎవరికీ గుర్తుండవు. మెరిలీన్ మన్రో అనే పరమ సుందర, అమెరికన్ సినిమాతార 30 సం.ల వయసుననే ఆత్మహత్య పాలైంది. కోటీశ్వరులు, అత్యున్నత రాజకీయ వ్యక్తులు ఆమెపట్ల ఉత్సుకులైనారు. ఇంతకూ చెప్పవచ్చిందేమంటే అసాధారణ జీవితాలలో అసాధారణ ఉద్వేగాలు, ఉద్రిక్తతలు ఉంటాయి. వీటిని అధిగమించాలి. హెలెన్‌కెల్లర్ పుట్టంధురాలు. నూరేళ్ళు బ్రతికింది. పట్టుదలతో, ఆత్మశక్తి సంపన్నతతో గొప్ప విద్వాం

సురాలిగా, సామాజిక వికాస ప్రేరక సంస్థానిర్ణేతగా పేరుకెక్కింది. ఎప్పటికీ ఆమె జీవితం స్ఫూర్తిదాయకమే. ఆమె స్వీయచరిత్ర రాసుకుంది.

శ్రీ తిరుమల రామచంద్ర కూడా తమ ఇరవైమూడు, ఇరవైనాలుగేళ్ళ వయసున ఆత్మహత్య చేసుకుందామని ప్రయత్నించారు. అయినా దైవరక్ష ఆయనకు లభించింది. దేశ స్వాతంత్ర్యంకోసం ఆయన కారాగారవాసం చేశాడు. యౌవనోద్వేగంవల్ల రహస్య విప్లవ సాహసకార్య కలాపాలలో పాలు పంచుకొన్నారు. ఆత్మస్ఫూర్తిగా హింసాచర్యలు, రహస్య జీవితం ఆయనకు ఇష్టం లేకపోయినా పరిస్థితులు అట్లా ప్రేరేపించాయి వారిని. గాంధీజీ అహింసా సిద్ధాంతమే తనకు ఉపాదేయమని స్పష్టంగా ఆయన రాసుకున్నారు. రాజకీయాలలోనే ఉంటే ఆయన రాణించగలిగి ఉండేవారు కాదు. పాతిక సంవత్సరాల వయసుననే ఎన్నికలలో పోటీ చేయగల అవకాశం వారికి తటస్థించింది. అప్పట్లో కాంగ్రెసు పార్టీకి దేశంలో అత్యంత ఆరాధన ఉండేది. వారు పోటీచేసి ఉంటే తప్పక గెలిచి ఉండేవారు. కాని ప్రత్యక్ష రాజకీయాలలోకి ప్రవేశించడానికి వారి తాత, తండ్రులు సమ్మతించలేదు. రాజకీయాలలోనే కొనసాగి ఉంటే శ్రీరామచంద్ర ఎప్పుడైనా, ఏ కొంచెం కాలమో అయినా ఏదైనా అధికార పదవిని, హోదాను పొందగలిగి ఉండేవారేమో! సౌకర్యవంతమైన జీవితాన్ని గడపగలిగిఉండేవారేమో! కాని ఆయన జీవన ప్రవృత్తి దృష్ట్యా ఘోరంగా విఫలమై ఉండేవారు రాజకీయ రంగంలో. 'త్యాగేనైకేన అమృతత్వమానశుః' అనేది ఆయన జీవితానికి కూడా వర్తిస్తుంది.

శ్రీ తిరుమల రామచంద్ర నిత్యనిరంతర గవేషణశీలి. జ్ఞానపథికుడు. యదృచ్ఛాలాభ సంతుష్టుడు. ద్వంద్వ సహిష్ణుడు. ఆయన ఎంత గొప్ప రచయితో అంతకన్న గొప్పవ్యక్తి. వారు చాలా గ్రంథాలు రాశారనీ, సహస్రాధికంగా వ్యాసాలు రాశారనీ, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారనీ, విలువల విషయంలో రాజీపడలేదనీ, మౌలికమైన ప్రతిభను, ఉపజ్ఞను ఆయన రచనలన్నింటా కనపరచారని ఆయన రచనలు చదివిన వారందరికీ ఇప్పటికే తెలుసు. **1935** నుంచి **1997** వరకు తెలుగు పత్రికలలో, విశిష్ట వ్యక్తుల అభినందన

సంచికలలో వారి రచనలు కనపడతాయి. ఒంటిచేతిమీద ఇన్ని రచనలు చేసిన వారు తెలుగు రచయితలలో వేళ్ళమీదనైనా లెక్కకు వస్తారో రారో! అదిన్నీ ఎన్నో వైవిధ్య విషయాలలో ఆయన రచనలు చేశారు. మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు, నుడి - నానుడి, సాహితీ సుగతుని స్వగతం, తెలుగు పత్రికల సాహిత్యసేవ, లలితవిస్తరం, అవదాన కల్పలత, బృహత్కథామంజరి, నాగలాపురం - దాని పరిసరాలు, వంటి ఉత్తమ రచనలు వారివి. ఇటీవల వారి వ్యాస సంపుటాలు మూడు వెలువడ్డాయి. మనవి మాటలు, అహంభో అభివాదయే, బృహదారణ్యకం అనేవి ఆ మూడు వ్యాస సంపుటులు. సంస్కృత ప్రాకృతాలలో వారు గొప్ప పండితులు. హాలుడి గాథాసప్తశతిని గూర్చి ప్రామాణికమైన రచన లెన్నోవారు చేశారు.

సుప్రసిద్ధ విద్యావేత్త, గొప్ప ఇంగ్లీషు రచయిత అయిన ప్రొఫెసర్ కె. శ్రీనివాసయ్యంగారిని వారి అభిమాని, ఉత్తమ రచనా ప్రమాణ జిజ్ఞాసువు ఒకరు, "What he considered the hall mark of any writing" అని అడగ్గా శ్రీ అయ్యంగారిట్లా అన్నారుట. "What matters in writing is how much soul force is seen in the works. If there is no soul touch, literature is mere Junk". ఈ సమాధానం విని ఆ జిజ్ఞాసువు (కె. వెంకటసుబ్రహ్మణ్యన్) "This reply is the key to his remarkable personality" అని వ్యాఖ్యానించారు. శ్రీ తిరుమల రామచంద్ర గారి రచనలన్నీ ఆత్మదఘ్న నివిష్టమైనవే కదా!

- అక్కిరాజు రమాపతిరావు

# కృతజ్ఞతలు

శ్రీ తిరుమల రామచంద్ర గారితో ఒక పాతిక సంవత్సరాలు నాకు అత్యంత గాఢ సాన్నిహిత్యం ఉండేది. 1972లో వారు హైదరాబాదు వచ్చేసిన తర్వాత 1997లో వారు పరమపదించేవరకు ఆ మహానుభావుడు నన్నెంతో ప్రేమాభిమాన పూర్వకమైన ఆదరంతో గౌరవించేవారు. తమ సాహితీ వ్యాసంగంలో ఏదో ప్రసక్తాను ప్రసక్తమైన విషయం తీసుకొనివచ్చి నేనేదో పెద్దవేత్తనైనట్లు సంప్రదిస్తూ ఉండేవారు. ఆఖరుకు రేడియో ప్రసంగ విషయ సేకరణలోకాని, ప్రత్యేక సంచికలకు రచన చేయాల్సి వచ్చినప్పుడుకాని మా ఇంటికి వచ్చి ఆయా విషయాలు ప్రస్తావించేవారు. అపురూపమైన సౌమనస్యం మూర్తీభవించినవారు శ్రీరామచంద్ర. తమకు కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు వస్తే బాగుండునని ఎంతగానో అనుకునేవారు. ఆ ప్రయత్నం ఎలా చేయాలో వారికి తెలిసిందికాదు. ఏమైతేనేం! వారు పరమపదించిన ఐదు సంవత్సరాలకు కాని వారి కోరిక తీరలేదు.

'హంపీ నుంచి హరప్పా దాక' ప్రచురణ విషయం కూడా వారెంతో ఉత్కంఠతో వారిని వీరిని అర్థించారు. సంప్రదించారు. నా ఆమోదం, అనుమోదం లేకుండా దానిని ఎవరికీ ప్రచురణకివ్వను అని చెప్పేవారు. వారు వైకుంఠవాసులైన తర్వాత 5 సం.లలో మూడు ముద్రణలు 'హంపీ నుంచి హరప్పా దాక' వెలువడింది. ఇందులో శ్రీమన్నారాయణుని అనుగ్రహంతో నా ప్రమేయంకూడా ఏ కొంచెమో ఉంది. శ్రీ రామచంద్ర దివ్యాత్మకు నా ప్రణతులు.' హంపీ నుంచి హరప్పా'లోనే ఒక ప్రస్తావనలో త్రికరణశుద్ధభక్తిప్రపత్తిగల శ్రీ వైష్ణవుడికి మోక్షమే కాని పునర్జన్మ ప్రసక్తి ఉండనే ఉండదంటారు రామచంద్ర. అయ్యో! శ్రీరామచంద్రకు పునర్జన్మ లేకపోతే తెలుగు వారికి ఎంతో నష్టం. శ్రీ రామచంద్ర తెలుగు భాషా సాహిత్యాలను, సంస్కృతిని ఆత్మదఘ్నంగా ప్రేమించారు కాబట్టి ఆయన మళ్లీ జన్మించాలనే తెలుగువారు కోరుకుంటారు.

ఈ రచన నేను కేంద్ర సాహిత్య అకాడమికి ఉద్దేశించి చేశాను. అయితే వారు నిర్దేశించిన పరిధిని మించడంవల్ల వారికి మళ్లీ వేరే వ్రాశాను. అయినా దీన్నికూడ ప్రచురిస్తున్నాను. ఈ గ్రంథం చదివినవాళ్లంతా సంతోషపడతారు. తృప్తి చెందుతారు. బాగుందంటారు.

తమ తండ్రిగారి గూర్చి ఈ గ్రంథానికి పరిచయ వాక్యాలు రాసిన డా. నీరజకు శుభాకాంక్షాపూర్వకమైన నా కృతజ్ఞతలు. ఈ పుస్తకం ఎంతో శ్రద్ధగా, అందంగా, డి. టి. పి. కూర్పు నిర్వహించి, ముఖపత్ర సంరచనం చేసిన చి. జి. వి. అమరేశ్వరరావుకు నా శుభాకాంక్షలు.

నేను తీసుకొని వస్తున్న ప్రచురణలన్నిటిని ఆశీర్వదిస్తూ, అనుగ్రహిస్తున్న సద్గురు శ్రీ కందుకూరి శివానందమూర్తి మహోదయులకు సభక్తిక ప్రణామాలు.

నాకెంతో ఆప్తులు, ఆత్మీయులు, పుస్తక ప్రచురణలో ఎంతగానో సాయ పడుతున్నవారు శ్రీ పి. వి. యమ్. కృష్ణారావుగారు సంతోషపూర్వకంగా నేను సమర్పిస్తున్న ఈ కానుకను స్వీకరించినందుకు నేను వారికి కృతజ్ఞుణ్ణి.

ఇక యీ పుస్తకం అచ్చు వేయడానికి సహాయపడిన మిత్రులందరిపట్ల నేను మరీ మరీ కృతజ్ఞుణ్ణి.

**హైదరాబాదు,**

**02.04.2003**

**(స్వభాను సం. ఉగాది)**

ఇ॥

అక్కిరాజు రమాపతిరావు

# విషయసూచిక



శ్రీః

ఉత్తమ సంస్కారి,

సాహితీప్రియులు,

సమాజహిత చింతన ఆలోచనామతి,

మత సాంస్కృతిక ఆధ్యాత్మిక పురాచరిత్ర నాగరికతల

నిత్య నిరంతర గ్రంథపఠనాభిలాషి,

సౌజన్యం, సౌమనస్యం

సత్కార్యనిరతిమూర్తీభవించినవారు,

నా ప్రియమిత్రులు **శ్రీ పి.వి.ఎమ్. కృష్ణారావు** గారికి

గౌరవాదర ప్రేమాభిమానపురస్కృతి

ఈ సత్కృతి

–అక్కిరాజు రమాపతిరావు



శ్రీ తిరుమల రామచంద్ర

# 1. ఇరవై శతాబ్ది మొదటి ఇరవై ఏళ్లు

**తి**రుమల రామచంద్ర 1913వ సంవత్సరం, జూన్ 17వ తేదీన జన్మించారు. ఆయన జన్మస్థలం అనంతపురం జిల్లాలోని తాడిపత్రి దగ్గరి రాగంపల్లి అనే అగ్రహార గ్రామం. ఆయన 84 సంవత్సరాలు పూర్ణాయుర్దాయం అనుభవించారనే అనుకోవాలి. అక్టోబరు 12, 1997 హైదరాబాద్‌లో ఆయన మృతి సంభవించింది.

కాబట్టి ఇరవైయ్యో శతాబ్ది భారతీయ సాహిత్య నిర్మాతలలో వారి స్థానం ఏమిటి? వారు తన సాహిత్యానికి చేసిన సేవ ఏమిటి? సమకాలీన సాహిత్యరంగంలో వారి ప్రజ్ఞ, ప్రతిభ, ఉపజ్ఞ ఎటువంటివి? అని బేరీజు వేయడానికి, అంచనా కట్టడానికి ఇరవయ్యో శతాబ్దం మొదలు కావడానికి ముందు భారతదేశంలో అందునా ముఖ్యంగా తెలుగుప్రాంతంలో సమాజ, సాంస్కృతిక, సాహిత్య చైతన్యం గురించి తెలుసుకోవడం అవసరం.

ఇరవయ్యో శతాబ్ది ప్రారంభమై ఒక దశాబ్దం గడచిన తర్వాత మూడేళ్ళకు పుట్టి ఆ శతాబ్ది చివరి దశకం ఇంకో మూడేళ్లలో ముగుస్తుందనగా ఆయన తనువు చాలించారు. తన ఎనభై నాలుగేళ్ల జీవనయానంలో తిరుమల రామచంద్ర సుమారు 60 సంవత్సరాలు అంటే ఆరు దశాబ్దాలు పత్రికారంగంలోనే జీవించారు. ఇతర ఉద్యోగాలు ఏవీ ఆయన్ను ఆకర్షించలేదనే చెప్పాలి. అటువంటి ప్రయత్నాలు కూడా వారు చేయలేదు. అరవై సంవత్సరాలు పాత్రికేయుడిగా జీవించిన వారి జీవితంలో విశాల ప్రపంచ అవగాహనకు వారికి గొప్పదైన అవకాశం లభించింది. తన వృత్తిలో రాణించడానికి ఆ అవగాహన ఆయనకు చాలా అగత్యమైంది.

స్వతహాగా రామచంద్ర సృజనశీలమైన భావుకత కలవారు. చురుకైన బుద్ధికుశలత, ఆర్ద్రత, జీవితం పట్ల, సమాజం పట్ల గాఢమైన ప్రేమానుబద్ధ నిబద్ధత, స్థిత ప్రజ్ఞత, ఉదార హృదయం, మానవ జీవిత పరమార్థ సాధనపరమైన తాత్త్విక ఉన్నతి, సమగ్ర వ్యక్తిత్వం, అత్యంత అభినివేశంతో కూడిన జ్ఞానపిపాస, ధైర్యం, అననుకూల పరిస్థితులలో కూడా నిబ్బరం, స్వావలంబన కాంక్ష, పుష్కలమైన సహృదయత, ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం, సహిష్ణుత, సౌశీల్యం, సౌజన్యం ఆయన జీవితంలో తనదైన వ్యక్తిత్వమంటూ ఏర్పడిన, ఏర్పడుతున్న ప్రభావశీలమైన వయసునుంచీ కనపడతాయి.

మరి ఇవన్నీ వారి వ్యక్తిత్వ పరిపూర్ణతకు కొలబద్దలు కావచ్చు కాని సాహిత్య నిర్మాతగా వారి మూర్తిమంతంలో ఏవిధంగా చోటుచేసుకున్నాయి అంటే సుమారు పదివేల పుటల పరిమాణభరితమైన వారి సర్వ రచనలు సమీక్షించాల్సి ఉంటుంది. కాని ఈ సంక్షిప్త, పరిచయగ్రంథం అందుకు ఉద్దేశించింది కాదు. ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యాన్ని రామచంద్ర ఏవిధంగా విశిష్టంగా ప్రభావితం చేశారు అని రేఖామాత్ర వివరణలతో అధ్యయనం చేయడమే ఈ గ్రంథ రచన పరిమితీ, ఉద్దేశ్యమూను.

తిరుమల రామచంద్రగారు ఆధునిక తెలుగు సాహిత్యంలో గొప్ప కావ్య నిర్మాత కాడు. గొప్ప కథా రచయిత కాడు. నాటకాలు, నాటికలు అసలే ఆయన రాయలేదు. కొన్ని తరాలను ప్రామాణికంగా ప్రభావితం చేయగల విమర్శ గ్రంథమూ ఆయన రాయలేదు. సాహిత్య చరిత్ర సంధానం చేయనూ లేదు. గొప్ప సృజనాత్మక రచయితలలో చేర్చవలసినవాడున్నూ కాడు. మరి ఆయన సాహిత్య నిర్మాత అనడం ఎట్లా? అంటే రామచంద్ర ఉత్తమ సాహిత్య నిర్ణేత. ఆయన ఒక జ్ఞానభాండారం. ఆయన నిజంగా వ్యాస సంతతివాడు. వాల్మీకి వారసుడు కాడు. అంటే అర్థం కావ్యరచన చేయలేదు కాని విజ్ఞానాన్ని విస్తరించాడు అని. తన కాలపు ఎందరో రచయితలను ప్రభావితం చేశాడు. ఎందరో రచయితలను తయారుచేశాడు, ఆ మహానుభావుడు.

తిరుమల రామచంద్రలో ఈ విజ్ఞాన్వేషణ, భారతీయాత్మ సాక్షాత్కార నిరంతర

నిత్యగవేషణల పరంగానే వేల సంవత్సరాల భారతీయ సంస్కృతి, మతం, వేదాంతం, కళాత్మక విజ్ఞానం, చరిత్ర, లౌకిక జీవన సంపన్నత, నాగరికత, సంపదుత్పత్తి, సామాజిక ఉత్థానపతనాలు, సంప్రదాయ సాతత్యం, సంఘ సంస్కరణ ఉద్యమశీలత, ఖండాంతర విజ్ఞాన వినిమయ సమన్వయం, విజాతీయ, విమతీయ ప్రభావ ఆదాన ప్రదానాలు, 'కని, కల్ల నిజము తెలిసి', తన వారికి తెలుపాలన్న తాపత్రయంతోనే ఆయన సారస్వత వ్యాసంగమంతా సాగింది. పరాధీన భారతదేశం మళ్ళీ తన ఇల్లు చక్కదిద్దుకోవాలని ఆయన తపన. వేదోపనిషద సంస్కృతి సమాదరణీయమూ, సమాశ్రయణీయమూ అని నిశ్చిత ప్రత్యయం వారిది.

ఈ ఆవేదన వారిలో ప్రాజ్ఞత బలపడుతున్న కాలం నుంచీ ఉద్బుద్ధమై విస్తరించడానికి ఆనాటి దేశ స్థితి సన్నికృష్ణ కారణం అయి ఉంటుంది. మానవ జీవితంలో సుప్తచేతనలాగానే సమాజ సాముదాయిక చేతనలోకూడా వ్యక్తం కావడానికి అదనుచూస్తున్న, వేచి ఉన్న ఒక ఆత్మ చేతన ఉంటుంది. అది ప్రబుద్ధమై, గొప్ప కళాకారులుగా, కవులుగా, తత్త్వవేత్తలుగా, ఉద్యమనాయకులుగా జాతి జీవితాన్ని ప్రభావితం చేస్తుంది. ఏదేశ చరిత్రలో చూసినా పరిణామ తాత్త్వికంగా దర్శనీయమవుతుంది, ఆయా ఘట్టాలలో ఈ యథార్థం. ఆయా దేశాల సాంస్కృతిక, సామాజిక ఉద్యమాలలో ఇది నిదర్శనీయమవుతుంది.

పందొమ్మిదో శతాబ్దిలో భారతీయ సామాజిక జీవితాన్ని చైతన్యవంతం చేసిన సన్నివేశాలను ఈ దృష్టితో చూసినపుడు అవి మరింత సుగమ మవుతాయి. పందొమ్మిదో శతాబ్ది భారతదేశాన్ని ప్రధానంగా నాలుగు మత సాంస్కృతిక సమాజ పరివర్తన ఉద్యమాలు ప్రభావితం చేశాయి. అవి బ్రహ్మ సమాజం, ఆర్యసమాజం, దివ్య జ్ఞాన సమాజం, శ్రీరామకృష్ణ వివేకానంద ప్రబోధోద్యమాలు.

ఇరవయ్యోశతాబ్ది ప్రారంభానికి ఇవన్నీ భారత స్వాతంత్ర్యోద్యమ చోదక శక్తులుగా, పూర్వ రంగంగా ఫలదీకరణం చెందాయి. ఒకవైపున ఇంగ్లీషు చదువులు కూడా ఇందుకు దోహదం చేశాయి. భారతీయ ఆత్మాన్వేషణ ప్రారంభమైంది. ముద్రణాలయాలు నెలకొనడం, వార్తా పత్రికల ప్రచురణ ప్రారంభం కావడంతో దేశంలో ఒక నూతనోత్తేజం కలిగింది. దేశ పరిస్థితులేమిటో సామాన్య అక్షరాస్యులు

కూడా తెలుసుకోవడానికి ఆస్కారం కలిగింది. ఇరవయ్యో శతాబ్ది ఆగమనానికి పదిహేనేళ్ళ ముందే దేశీయుల సమస్యా పరిష్కారానికి, ప్రభుత్వంతో సంప్రదింపులు జరపడానికీ, తీర్మానాల రూపంగా విన్నవించుకోవడానికీ, ప్రజాభిప్రాయం కూడగట్టడానికి, పరిపాలనాధికారులతో చర్చలు జరపడానికి, విజ్ఞప్తులు సమర్పించడానికి జాతీయ కాంగ్రెస్ అనే అఖిల భారత సంస్థ ప్రాదుర్భవించింది. ఈ సంస్థ అప్పటి నుంచీ ప్రతి సంవత్సరం దేశంలోని ముఖ్య నగరాలలో సమావేశాలు నిర్వహిస్తూ వచ్చింది. ఈ మహా సంస్థ ఆశయాలు, లక్ష్యాలు, ఉద్దేశాలు వ్యాప్తి చేయడానికి దేశంలో ఆయా ప్రాంతాలలో ప్రాతినిధ్య ప్రజాసంస్థలు కూడా పనిచేయసాగాయి. ఇరవయ్యో శతాబ్ది తొలి దశకంలోనే కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక వంటి వార్తా పత్రికలు తెలుగు ప్రజలకు దేశ పరిస్థితులను గూర్చి బోధించసాగాయి.

సమాజంలోని లోపాలేమిటో, పోగొట్టుకున్న హక్కులను రాబట్టుకోవడం ఎట్లాగో, ప్రజలలో చైతన్యోద్బోధం చేయడానికి జాతీయ భావాలు కల ఆంగ్ల విద్యాధికులు కూడా ప్రచారం చేయసాగారు. వార్తా పత్రికల వల్ల దేశంలో ఎక్కడ ఏ సంఘటన జరిగినా, దేశ హితానికి, ప్రజా జీవనానికి ఏ చేటు వాటిల్ల బోతున్నా తమ అనిష్టాన్ని, అసంతృప్తినీ వ్యక్తం చేయగల జాగృతి క్రమక్రమంగా ప్రజలలో కలుగుతూ వచ్చింది.

ఇంతలో 1906వ సంవత్సరంలో 'వందేమాతరం' ఉద్యమం ప్రారంభమై త్వరితగతిని దేశమంతటా స్వాతంత్ర్య సముపార్జనాసక్తిని ప్రబుద్ధం చేసింది. జాతీయ భావాలు విద్యాధిక వర్గంలోనే కాక సామాన్య ప్రజలలో కూడా సంచలన కారణమైనాయి. దేశంలో ప్రజాసామాన్యం స్థితిగతులు స్వయంగా పరిశీలించి అంచనా వేయడానికి 1915వ సంవత్సరంలో గాంధీజీ పర్యటించినపుడు గ్రామీణ రైతు ప్రముఖులు కూడా ఆయనను చూడటానికి వచ్చారు. ఇటువంటి ఛాయా చిత్రం ఒకటి నెల్లూరు వర్ధమాన సమాజ సమావేశ మందిరంలో కనపడుతుంది నేటికీ.

దేశభాషలలోనే ప్రభుత్వ పరిపాలన జరగాలనీ, జాతీయ విద్యకుప్రాముఖ్యం కలగాలనీ, జాతి సంపద విదేశాలకు తరలివెళ్ళడం అరికట్టాలని స్వావలంబనం, స్వభాష, స్వాభిమానం, స్వాతంత్ర్య సందేశానికి ఉద్దీపకాలనీ వీటినిప్రోది చేయడానికి

సాంఘిక సంఘటితోద్యమాలు దేశంలో మొదలైనాయి. 1906 నాటికే ప్రజలలో ఇటువంటి భావాలు ప్రచారం చేయడానికి కొమర్రాజు లక్ష్మణరావు వంటి మనీషులు విజ్ఞానచంద్రికామండలి వంటి ప్రచురణ సంస్థలు స్థాపించి దేశ చరిత్ర, మహాపురుష జీవితాలు, దేశభక్త్యుద్దీపకమైన కాల్పనిక సాహిత్యం ప్రచురించి,వీటి వ్యాప్తి కోసం ప్రోత్సాహక పరీక్షలు కూడా నిర్వహించసాగారు. 20వ శతాబ్దపు మొదటి దశాబ్దం నాటికే తెలుగు నాట విజ్ఞాన చంద్రికామండలి వారికి ఎనిమిది వేల మంది చందాదారులు సమకూడడం ఆ రోజుల్లో ఉద్భవిల్లిన చైతన్యానికి సంకేతం. 1910 నాటికే ఆంధ్రదేశంలో ప్రముఖ నగరాలలో జాతీయ పాఠశాలల స్థాపన ప్రయత్నాలు ఊపందుకున్నాయి. ప్రథమ దశకం ముగింపు నాటికే తెలుగు వారికి వారపత్రికలు, తర్వాత కొద్ది కాలానికి దినపత్రిక కూడా సమకూడాయి.గ్రంథాలయోద్యమం పల్లెపట్టులను కూడా ఎంతగానో ఆకర్షించింది.

ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. ఈ ప్రపంచ యుద్ధంలో భారతీయులు పర పరిపాలకులకు విధేయులుగా ఎంతసేవ చేసినా రౌలట్ చట్టం వంటి క్రూర నిరంకుశ నిర్బంధ విధానాలు పరాయిప్రభుత్వం నుంచి భారతీయులు బహుమతిగా రుచి చూడవలసి వచ్చింది. ఇందువల్ల ప్రజలలో దేశాభిమానం ఉద్యమ రూపం ధరించింది.

1915లోనే మరణించిన గురజాడ అప్పారావు తెలుగునాట దేశభక్తి గీతం ద్వారా స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తిని సమీకరించాడు. 20వ శతాబ్ది మొదటి రెండు దశాబ్దాలలో తెలుగు సాహిత్యంలో నాటక ప్రక్రియలోకాని, నవలా ప్రక్రియలో కాని పురాణైతిహాసిక చారిత్రక ఇతివృత్తాలే ప్రాధాన్యం వహించడం జాతీయ పునరుజ్జీవనోద్యమానికి ప్రబల సాక్ష్యంగా భావించాలి.

ఇరవయ్యో శతాబ్ది మొదటి రెండు దశకాలలో సంఘ సంస్కరణ సభలు, జాతీయ పాఠశాలలు, గ్రంథాలయోద్యమం ఎక్కువ ప్రాముఖ్యం పొందాయి. లోకమాన్య బాలగంగాధర తిలక్ మరణం, జలియన్ వాలాబాగ్ దురంతాలు, వంగదేశంలో, మహారాష్ట్రంలో భారతదేశ స్వాతంత్ర్య ప్రాప్తి కోసం సంఘటించిన విప్లవోద్యమాలు, విప్లవకారుల త్యాగ సంభరిత బలిదానాలు జాతిని ఉద్విగ్నపరచాయి. భారతదేశ స్వాతంత్ర్య సముపార్జన నిమిత్తం విదేశాలలో

విప్లవ సంఘాలు పనిచేయసాగాయి. 1911లోనే అమెరికాలో ప్రభవించిన గదర్ ఉద్యమం, ఇంగ్లండులో శ్యాంజీ కృష్ణవర్మ అనే గొప్ప దేశభక్తుడు సాగించిన రాజకీయ పోరాటం, ఖుదీరాంబోస్ ఆత్మ బలిదానం, ఆనాటి ఆంధ్ర దేశాన్ని ఎంతో ఉత్తేజపరిచినట్లు, ప్రభావితం చేసినట్లు తెలుగులో వెలువడ్డ వల్లూరి సూర్యనారాయణరావు, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం, దేశభక్త కొండ వెంకటప్పయ్య, దర్శి చెంచయ్య ప్రభృతుల స్వీయ చరిత్రల ద్వారా తెలుస్తుంది.

1923లో కాకినాడలో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సభల నాటికి తిరుమల రామచంద్ర వయసు పదేళ్లు. ఆ సభల కాయన తన పినతండ్రితో, హాజరైనాడు. 1920లోపే బళ్ళారి వచ్చిన గాంధీజీని తన తాతగారి వెంట వెళ్ళి దర్శించాడు. అప్పటికాయనకు ఎనిమిదో ఏడు. ఈ విధంగా రామచంద్ర బాల్యం స్వాతంత్ర్యోద్యమ సంరంభకాలంతో తాదాత్మ్యం పొందింది.





# 2. కుటుంబ నేపథ్యం

మహారాజ్యాలు ముక్కచెక్కలైనప్పుడు, చాప చిరిగి చదరైనట్లు గొప్ప సంస్థానాలు కుంచించుకునిపోయినపుడు, పరరాజుల దండయాత్రలతో స్వరాష్ట్రాలు చెల్లాచెదరైనప్పుడు, శ్రీమంతులు, పెద్ద ఉద్యోగులు, రాజకార్యనిర్వాహకులు వేరే వేరే ప్రాంతాలకు వలసపోవడం కద్దు. అట్లానే మత వ్యాపనం కోసం ఆచార్యులు, పండితులు, పీఠాధిపతులు తమ స్వస్థలాలు వదలి దూర ప్రాంతాలకు పోయి అక్కడ ప్రచారం సాగించడం, స్థిరపడడం కూడా జరుగుతుంది. చరిత్రలో ఇటువంటి సంఘటనలు కోకొల్లలుగా కనపడతాయి. తెలంగాణంలోని అనేక గ్రామ నామాలు ఇంటిపేరుగా గలవాళ్ళు ఉత్తరాంధ్రంలోబ్రాహ్మణులలో ఎన్నో కుటుంబాలు కనపడతాయి. గిడుగు, గురజాడ కుటుంబాలు కొన్ని తరాల కిందట కోస్తా ఉత్తరాంధ్ర ప్రాంతాలకు చెందినవారే.

వెయ్యేళ్ళ కిందట రాజరాజనరేంద్రుడు వేగిదేశాన్ని పరిపాలించే కాలంలో తమిళదేశం నుంచి కవి పండితులు, పురోహిత వర్గాలు ఎందరో తెలుగుదేశానికి వచ్చినట్లు కనపడుతుంది. వాళ్ళు ఒకే కాలంలో ఒకే ఘట్టంలో వచ్చి ఉండరు. క్రమంగా ఆయా శతాబ్దాలలో వచ్చి ఉంటారు. బ్రాహ్మణులలోద్రావిడులు అనే శాఖ వారంతా ఇట్లా వచ్చిన వారేనని వేత్తలు రాశారు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు, చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు, శ్రీశ్రీ మొదలైన వాళ్ళ పూర్వపూర్వ తరాల వాళ్ళు అరవవాళ్ళంటే ఆశ్చర్యమేస్తుంది. ఇట్లానే శ్రీకృష్ణ దేవరాయల వారి కాలంలో దక్షిణాదిన ఆయన సామంతులు పరిపాలించినపుడు తెలుగుదేశం నుంచి వందల కుటుంబాలు ఆ ప్రాంతాలకు పోయి స్థిరపడిపోయినట్లు చరిత్రకారులు రాశారు.

భగవద్రామానుజులు తెలుగునాట 72 ఆచార్య పీఠాలు నెలకొల్పి వైష్ణవం ప్రచారం చేసినట్లు ఉన్నవ లక్ష్మీనారాయణ గారు రాశారు. ఆయనెప్పటివాడు? వెయ్యేళ్ళ కిందటివాడు. తెలుగుదేశాన్ని తొలి చాళుక్యులు పరిపాలించినప్పటి కాలం వాడు. ఆ తర్వాత కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర సామ్రాజ్యాధిపతులు తెలుగుదేశాన్ని పరిపాలించారు. కాకతీయుల కాలంలో శైవమతం బాగా ఆదరణలో ఉన్నప్పుడు గుజరాత్ నుంచి గోళకీ సంప్రదాయంవారు వచ్చి తెలుగుదేశంలో శైవం వ్యాపింపచేశారు.

ఈ విధంగా తిరుమల ఇంటిపేరుతో ఉన్న ప్రసిద్ధ వైష్ణవ వంశం అరవదేశం నుంచి వచ్చి తెలుగునాట స్థిరపడినదే. భగవద్రామానుజుల కాలంలో ఈ కుటుంబాల వారు ఎక్కువగా ఆంధ్రదేశానికి వచ్చి ఉండవచ్చు. తెలుగుదేశానికి వచ్చిన తర్వాత ఇంటిపేరు విషయంలో వీళ్ళు తెలుగు వారి సంప్రదాయాన్నే స్వీకరించారు. ఏ మంటే అరవ వారికి సాధారణంగా ఇంటిపేరు ఉండదు. తిరుమల వారి కుటుంబానికి మూలపురుషుడు తిరుమల నంబి అని రామచంద్రగారే రాశారు. వీరి అసలు పేరు శ్రీశైల పూర్ణులట. వీరు భగవద్రామానుజులకు మేనమామ కూడానట. తిరుపతిలో ఉంటూ శ్రీ రామానుజులవారు మేనమామ దగ్గర విద్యనభ్యసించినట్లు రామచంద్ర రాశారు. అన్నమాచార్యుల వారి కీర్తనలలో కూడా తిరుమల నంబి ప్రసక్తి వస్తుంది. నంబి అంటే అర్చకుడని అర్థం. తిరుమలలో నెలకొన్న శ్రీ వెంకటేశుని ఆయన అర్చించాడు. కాబట్టి ఆయన తిరుమల నంబి అయినాడు. ఇదంతా వెయ్యేళ్ళ పూర్వపు వృత్తాంతం. "పన్నిద్దరాళ్వారులలో ఎంతో ప్రసిద్ధి కెక్కిన ఆళవందార్‌గా కీర్తితులైన యామునాచార్యులవారు కూడా మా వంశం వారే, మా గోత్రం వారే" నన్నారు రామచంద్ర.

శ్రీవైష్ణవం గొప్ప వ్యాప్తిలో ఉన్నప్పుడు ఆంధ్రదేశంలో అనేక వైష్ణవ దేవాలయాలు నిర్మితమైనాయి. ఆ దేవాలయాలలో అర్చకత్వం వహించడానికీ, పూజాదికాలు వైష్ణవభక్తితత్త్వసిద్ధాంతపరంగా నిర్వర్తించడానికీ తమిళదేశం నుంచి వైష్ణవ కుటుంబాల వాళ్ళు వచ్చేశారు. వారిని రాజులు, శ్రీమంతులు, వైష్ణవ సంప్రదాయపరులూ పిలిపించుకొనేవారు. వైష్ణవ దేవాలయాలలో పన్నిద్దరు

ఆళ్వారుల ఆరాధన తప్పనిసరి. ఆళ్వారులు రచించిన స్తోత్రాలను దివ్య ప్రబంధమంటారు. వైష్ణవులకు ఇవి వేదంతో సమానం. ఆలయాలలో దివ్య ప్రబంధాన్ని గానం చేస్తారు. ఇట్లా తమిళనాడు నుంచి వచ్చిన వారే రామచంద్ర మాతామహవంశంవారూ, అత్తగారి వంశం వాళ్ళు కూడాను. తమ వంశం తిరుమల నంబి ద్వారా వర్ధిల్లినట్లు కూడా వారే చెప్పుకున్నారు.

విజయనగర సామ్రాజ్యం గొప్ప వైభవదశలో ఉండగా తాతాచార్యుల వారనేవారు చాలా ప్రసిద్ధులు. వీరిని గూర్చి తెలుగు వారు ఎన్నో కథలు చెప్పుకుంటారు. వీరు తిరుమల నంబివంశం వారే. శ్రీకృష్ణ దేవరాయల వారికి వీరు గురువులని కూడా చెబుతారు. శ్రీకృష్ణదేవరాయల వారు విజయనగరం పరిపాలిస్తుండగా సర్వమత మహాసభ జరిపినట్లూ దానిలో శ్రీ వల్లభాచార్యుల వారు పాల్గొన్నట్లు చరిత్ర కారులు రాశారు. ఏడు వేల బంగారు నాణేలతో శ్రీ వల్లభులను రాయలవారు సత్కరించి ఆయనకు గొప్ప బిరుదు కూడా ఇచ్చినట్లు వల్లభాచార్యులవారి జీవిత వృత్తాంతం చెబుతుంది. తిరుమల వారి వంశంలో తాతాచార్యులవారు జగత్ప్రసిద్ధులు కాబట్టి అది ఆ కుటుంబం తర్వాత తరతరాల వారికి బిరుదుగా కూడా ప్రవర్తితమవుతూ వచ్చింది.

విజయనగర రాజ్యం విచ్ఛిన్నమైపోయిన తర్వాత ఈ ఆచార్య కుటుంబాన్ని తాడిమర్రి సంస్థానం వారు గురువులుగా స్వీకరించారు. అందువల్ల ఈ కుటుంబాల వారు తాడిమర్రు చేరారు. అనంతపురం జిల్లాలో ధర్మవరానికి సమీపంలో ఉన్నది ఈగ్రామం. ఈ సంస్థానం బోయవీరులు స్థాపించింది. విజయనగర రాజులకు సైన్యం సమకూర్చే సామంతరాజులు వీళ్ళు. ఈ బోయ రాజులలో ఒకరు తిరుమల వారి వియ్యపు కుటుంబం వారికి రాఘవమ్మ పల్లె అనే గ్రామం జాగీరుగా ఇచ్చారు. అందువల్ల ఆ అగ్రహార గ్రామాన్నే తమ నెలవు చేసుకున్నారు వారు.

1857వ సంవత్సరంలో బ్రిటిష్ రాజరికంపై సిపాయిలు తిరగబడడానికి ముందే తాడిమర్రి బోయవీరుల సంస్థానం బ్రిటిష్ పాలనను ఎదిరించి స్వాతంత్ర్యం ప్రకటించుకుంది. అయితే బ్రిటిష్ వారు ఈ తిరుగుబాటును అణచివేశారు. తాడిమర్రి సంస్థానం నశించింది. అప్పుడిక తిరుమల వారి వంశం హంపీ

విజయనగరం దగ్గరున్న కమలాపురం చేరింది. ఈ విధంగా తిరుమల వారి కుటుంబం బళ్ళారి జిల్లాలోని కమలాపురం చేరటానికి బలమైన కారణం ఉంది. అదేమంటే అప్పటివరకు తాడిమర్రి సంస్థానాధీశులైన బోయరాజుల గురువులైన తిరుమల రామస్వామి తాతాచార్యుల వారి అత్తగారి ఊరు కమలాపురం. ఆయనకు పిల్లనిచ్చిన వారి ఇంటి వారు ప్రబంధం వారు. ఈ ప్రబంధం కుటుంబం వారు తంజావూరు, కుంభకోణం ప్రాంతాల నుంచి విజయనగరానికి వలస వచ్చినట్లు రామచంద్రగారే స్వీయ చరిత్రలో చెప్పుకున్నారు. వీరు హంపీ విజయనగరంలోని కృష్ణస్వామి, కోదండరామస్వామి, పట్టాభిరామస్వామి మొదలైన విష్ణుదేవాలయాలలో దివ్య ప్రబంధ పారాయణం చేయడానికి వచ్చిన కుటుంబాల వారని రామచంద్రగారే చెప్పారు. అందువల్లనే వీరింటి పేరు ప్రబంధం వారైంది.

తాడిమర్రి సంస్థానం వినాశంతో ఆ రాజ గురువులు తమ అత్తగారి ఊరైన కమలాపురం చేరటం సహజమే. ఈ విధంగా తిరుమల రామస్వామి తాతాచార్యుల వారు కమలాపురం చేరటం జరిగింది. వీరు తిరుమల రామచంద్ర గారి ముత్తాతగారు. రామస్వామి ఆచార్యుల వారి కుమారులు నరసింహాచార్యుల వారు. అప్పటివరకూ వీరు తమ ఇంటిపేరు తిరుమల తాడిమర్రి అనే చెప్పుకునేవారు. వీరు రామచంద్ర గారి తాతగారు.

తాడిమర్రికి పది పన్నెండు మైళ్ళదూరంలో ఉన్న రాగంపల్లిలోనే ప్యారంగూరనే ఇంటిపేరుతో ప్రసిద్ధులైన వైష్ణవ కుటుంబం వారుండేవారు. వీరి వంశం వారికే తాడిమర్రి సంస్థానాధిపతులు ఆ పల్లెను అగ్రహారంగా ఇచ్చారు. ఈ రాగం పల్లెలో శ్రోత్రియందారులైన పేరంగూర్ వేంకట రాఘవాచార్యులుగారు కమలాపురంలో ఉంటున్న తిరుమల తాడిమర్రి నరసింహాచార్యులతో వియ్యమందారు. నరసింహాచార్యుల వారి కుమారుడు శేషాచార్యులవారు. ఈ శేషాచార్యులవారికే రాగంపల్లె శ్రోత్రియందారైన వేంకటరాఘవాచార్యులుగారు తమ బిడ్డనిచ్చారు. ఈ రాఘవాచార్యుల వారికి ఒకరే కుమారుడు, ఆరుగురు కూతుళ్లు, కూతుళ్ళలో మూడవ ఆమె అయిన జానకమ్మ గారే రామచంద్రగారి తల్లి. రాఘవాచార్యుల వారు తమ పెద్ద బిడ్డను ధర్మవరం కృష్ణమాచార్యుల వారి కుమారుడికిచ్చారు. ఈ విధంగా కృష్ణమాచార్యుల వారి కోడలు రామచంద్రగారికి పెద్దతల్లి అయింది. అందువల్ల

కమలాపురం నుంచి బళ్ళారికి తిరుమల వారి కుటుంబం తరచు రాకపోకలు జరిపేది.

రామచంద్రగారు పుట్టటానికి ఒక సంవత్సరం ముందే ధర్మవరం కృష్ణమాచార్యుల వారు (ఆంధ్ర నాటక పితామహుడు - సుప్రసిద్ధ తెలుగునాటక రచయిత) పరమ పదించినా ఆయన గూర్చిన కథలూ గాథలూ ఎన్నో తాము వింటూ ఉండేవాడిననీ, అవి తమను చాలా ఉత్తేజపరచేవనీ రామచంద్ర చాలా సందర్భాలలో ప్రస్తావించారు. ధర్మవరం కృష్ణమాచార్యుల వారు గొప్ప దేశభక్తుడు. 1907వ సంవత్సరంలో సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలకు హాజరైనారు. వీరి ఆహ్వానంపై బాలగంగాధర్ తిలక్ బళ్ళారి వచ్చారు. కృష్ణమాచార్యుల వారి నాటకాలలో జాతీయాభిమానం, సంఘ సంస్కరణ భావాలు బలంగా ప్రకటితమయ్యేవి. తన ఎనిమిది సంవత్సరాల వయసున తాతగారితో వెళ్ళి ధర్మవరం వారి విశాల భవన ప్రాంగణంలో జరిగిన మహాసభలోనే గాంధీ గారిని రామచంద్ర దగ్గరగా ఉండి చూశారు. ఆనాటి తన ఉత్తేజ కర స్మృతులనుకూడా ఆయన స్వీయ చరిత్రలో రాశారు. రామచంద్రగారి చిన్నతనంలో బళ్ళారిలో కోలాచలం వెంకటరావుగారనే గొప్ప ప్లీడరు ఉండేవారు. వీరికి కమలాపురంలో సేద్యపుభూములుండేవి. వీటి వ్యవహారాలు కమలాపురంలో ఉంటున్న తిరుమల తాడిమర్రి నరసింహాచార్యుల వారే చూస్తుండేవారు. అప్పట్లో దేశ స్వాతంత్ర్యోద్యమాన్ని గూర్చి వెంకటరావుగారు ఎన్నెన్నో విషయాలు పెద్దలతో చర్చిస్తూ ఉండగా తాను ఎంతో ఆసక్తిగా ఆకళింపు చేసుకోవటానికి ప్రయత్నించేవాడినని కూడా రామచంద్ర స్వీయచరిత్రలో ముచ్చటించారు.

తన తండ్రి తాతలు, పినతండ్రి స్వాతంత్ర్యోద్యమాభిమానులనీ, కాంగ్రెస్ సమావేశాలకు హాజరవుతూ ఉండేవారనీ, మొదట్లో బాలగంగాధర తిలక్ అనుయాయులనీ, తర్వాత తర్వాత గాంధీజీ ప్రభావానికి లోనైనారనీ రామచంద్ర స్వీయచరిత్రలో రాశారు. తన తాతగారూ, తండ్రిగారు విజయనగర మహాసామ్రాజ్యానికి చెందిన కథలు, గాథలు ఎప్పుడూ తనకు చెబుతూ ఉండేవారని, హంపీ విజయనగరం, కమలాపురం పరిసరాలలోని రాయీ రప్పా, పుట్టా గుట్టల పూర్వ చరిత్ర అంతా వారికి తెలుసుననీ విజయనగర సామ్రాజ్యేతిహాసాన్ని

సమయం సందర్భం వచ్చినప్పుడల్లా ఆసక్తికరంగా వినిపిస్తూ ఉండేవారని కూడా రామచంద్ర స్వీయ చరిత్రలో చెప్పారు. శ్రీకృష్ణదేవరాయలు కళింగదిగ్విజయ యాత్ర నుంచి విజయనగరం చేరిన తర్వాత పూరీ జగన్నాథక్షేత్రంలో వలెనే విజయనగరంలో రథయాత్రలు కనులపండువుగా ఏర్పాటు చేశారనీ, ఆ జగన్నాథక్షేత్ర దేవాలయ వాస్తు శిల్ప వైభవంతో హంపీ విజయనగరంలో దేవాలయాలు కట్టించారనీ ఈ మొదలైన విషయాలు పెద్దలవల్ల వింటూ ఉండేవాడిననీ రామచంద్ర రాశారు. తన పినతండ్రి క్రమం తప్పకుండా భారతి సాహిత్య మాసపత్రికను తెప్పించేవారనీ రాశారు.

తన మాతామహునికి ఆరుగురు కుమార్తెలు, ఒక కుమారుడు అనీ అంత పెద్ద కుటుంబంలో మొట్టమొదట కలిగిన మగసంతానం తానేననీ, అందువల్ల మాతామహుల ఇంట్లో అల్లారు ముద్దుగా శైశవం గడిచిందనీ ఆయన రాశారు. మూడేళ్లో, నాలుగేళ్ళో పూర్తి అయిందాకా తల్లి దగ్గరే ఆమె పుట్టింట్లోనే ఉన్నామనీ, ఐదో ఏడు వచ్చిం తర్వాత కమలాపురం వెళ్ళామనీ అక్కడ తనప్రాథమిక విద్యాభ్యాసం ప్రారంభమైందనీ ఆయన కథనం. లోకాన్ని వింతగా, ఆశ్చర్యకరంగా అర్థం చేసుకొనే పసివయసు నుంచీ రామచంద్ర గుళ్ళూ, గోపురాలు, రథోత్సవాలు, శిథిల శిల్పాలు, కోటకొమ్ములు, మహారాజ్యవైభవ స్మృతి శకల అవశేష దృశ్యాలు నిత్య పరిచితంగా తన శైశవాన్ని గడిపారు.

అందువల్ల చరిత్ర, సంస్కృతి, మతం, గతం అయన సుప్తశిశు చేతనావగతికంగా మొదటినుంచీ ఆయనను వెన్నంటి ఉన్నాయేమోనని చెప్పాలి. హంపీ విజయనగరంలో చైత్రపూర్ణిమకు జరిగే విరూపాక్ష స్వామి రథోత్సవాల సందర్భంగా శ్రీరామపట్టాభిషేకం, విష్ణుసహస్రనామ పారాయణం నిర్వహిస్తూ తన తాతగారు ఐదారు వేలమందికి షడ్రసోపేతంగా సంతర్పణ కార్యక్రమం నిర్వహించేవారనీ, తమ తండ్రి గొప్ప హనుమదుపాసకులనీ, జగదేకమల్లుడైన కోడి రామమూర్తి తన తండ్రిగారికి మిత్రులనీ, హృషీకేశం నుంచి హిమనగ దివ్యబదరీనాథ్ వరకు ఏడెనిమిది సార్లు తన తండ్రి హిమాలయ పుణ్యభూములను కాలినడకతో దర్శించారనీ రామచంద్ర స్వీయచరిత్రలో రాశారు. చారిత్రాత్మకమైన గొప్ప సంఘటనలు ఆయన పసిమనసులోనే ముద్రితమై ఉండేవి.



# 3. శైశవ బాల్యాలు

తిరుమల రామచంద్ర విషయంలో చాలా ఆశ్చర్యకరమైన విషయమేమంటే చాలా చిన్నప్పటి సంగతులుకూడా ఆయనకు నిన్ననో మొన్ననో జరిగిన వాటి లాగా గుర్తుండడం. ఆయన గ్రహణధారణ శక్తులు చాలా అపూర్వమైనవి. తన మూడేళ్ళ వయసు దగ్గర నుంచీ జరిగిన ముఖ్యమైన సంఘటనలన్నీ తనకు బాగా గుర్తున్నట్లు తన ఎనభై మూడేళ్ళ వయసున రాసిన స్వీయ చరిత్రలో ఆయన చెప్పారు.

అనంతపురం జిల్లాలోని రాఘువంపల్లె (రాగంపల్లెలో) ఆయన జన్మించారు. తాను పుట్టిన ఆర్నెల్లు గడవకుండానే మాతామహుడు మరణించడం ఆ కుటుంబంలో చాలా విషాదం కలగజేసింది. పూర్వకాలపు కుటుంబాలలో జ్యోతిషంపట్ల అంటే గ్రహగతులపట్ల, శిశు జనన సమయ నక్షత్ర ఫలితాలపట్ల ఎక్కువ నమ్మకం ఉండేది కాబట్టి ఆ ఫలితాలు తెలుసుననుకొనేవాళ్ళు రామచంద్ర జ్యేష్ఠ నక్షత్రంలో జన్మించడంవల్ల, అది మాతామహమరణ సూచకం కనుక, ఆయన తాతగారైన రాఘవాచారిగారు మరణించారని అంటుండేవారుట. రాఘవాచార్యుల వారికి ఆరుగురు కుమార్తెలు, ఒక కొడుకు, వారిది పెద్ద బలగం. కుటుంబంలో పుట్టిన మొదటి మగ పిల్లవాడు రామచంద్ర. అయితే ఆ సంతోషం ఆయన ఎక్కువ కాలం అనుభవించలేదు. జ్యేష్ఠమాసం, జ్యేష్ఠనక్షత్రం, తలిదండ్రులకు జ్యేష్ఠుడిగా రామచంద్ర జన్మించారు. ఇంతలోనే తాతగారు పోయినారు. వీడుపుట్టి తాత మరణానికి కారకుడైనాడని బంధువుల్లో ఎవరన్నా అన్నప్పుడు తన తల్లి

కన్నీరు పెట్టుకొని బాధపడేదని అంత పసి వయసు విషయం కూడా రామచంద్ర స్వీయచరిత్రలో గుర్తు చేసుకున్నారు.

రాఘువంపల్లెకు ఏడెనిమిది మైళ్ళదూరంలో ఉన్న ధర్మవరంలో ఒక నాటక ప్రదర్శనానికి వెళ్ళడం, రాత్రివేళ నాటకం చూసి స్వగ్రామం తిరిగి వస్తుండగా రెండెడ్ల బండి బోల్తాపడి కుటుంబ సభ్యులు గాయాలతో ఇల్లు చేరడం గుర్తుచేసుకున్నారు రామచంద్ర. అప్పుడాయన వయసు 3 సంవత్సరాలే. ఇంతేకాదు ధర్మవరం కృష్ణమాచార్యుల వారిదైన ఆ నాటకంలో 'తల్లీ తల్లడమందగనేలన్ తనయుడనేనుండన్' అనే కీర్తన పంక్తిని ఇంట్లో పాడుతూ అభినయించినప్పుడు బంధువులంతా మెచ్చుకోవడం, దాంతో మరింత ఉత్సాహంతో పాడడం, అప్పుడు తల్లి తనను దగ్గరకు తీసుకుంటూ నోరు మూయడం కూడా ఆయన స్మృతిపథం నుంచి తప్పుకోలేదు.

బహుశః తాతగారు మరణించడంతో జానకమ్మ తన పసివాడితో పుట్టింట తల్లిగారి ఓదార్పుగా రెండు మూడు సంవత్సరాలుండిపోయారేమో! తక్కిన అక్కచెల్లెండ్రు తమ సంసార బాధ్యతలలో అప్పుడప్పుడు మాత్రమే వస్తూపోతూ ఉండడంవల్ల, పసివాడితో అమ్మమ్మకు కొంత సాంత్వన కలుగుతుండడంవల్ల రామచంద్రకు మూడేళ్ళు వచ్చేదాకా తానూ తల్లీ రాఘువంపల్లెలో ఉండడం సంభవం. తండ్రిగారు అప్పుడప్పుడు రాఘువంపల్లె వస్తూపోతూ ఉండవచ్చు. అదీకాక రామచంద్ర తల్లిగారికి కూడా అది చిన్నవయసే. ఆమె పధ్నాలుగోఏటనే తాను జన్మించినట్లు రామచంద్ర స్వీయచరిత్రలో రాశారు. ఆయనకు మూడో ఏడే అక్షరాభ్యాసం చేయడం కూడా ఆశ్చర్యమే. మేనమామే అక్షరభ్యాసం చేసినట్లూ, చల్లా సుబ్బారాయుడనే వీధి బడిపంతులువద్ద అమరం, ఆంధ్ర నామసంగ్రహం విన్నట్లూ రామచంద్ర రాశారు. మరీ పసివయసు కాబట్టి వల్లించే ప్రయత్నం చేయలేదన్నారు. అంతచిన్న వయసుననే తల్లిగారి దగ్గర దైవస్తోత్రాలు చెప్పించుకొన్నట్లుగా కూడా ఆయన రాశారు.

మూడేళ్ళు నిండగానే కమలాపురం చేరారు రామచంద్ర. అక్కడ వీధిబడిలో ప్రవేశించడం, బడిపంతులు పిల్లలను హింసించడం చూసి భయపడటం, ఈయన బడిమానివేస్తాడేమోనని ఈశ్వరయ్య అనే ఆ వీధి బడిపంతులు పిల్లలను క్రూరంగా దండించడం మానుకోవడం రామచంద్ర స్వీయచరిత్రలో ప్రస్తావించారు.

చిన్నప్పటి విషయాలన్నీ తు.చ. తప్పకుండా పొల్లుబోకుండా రామచంద్రకు జ్ఞాపకం ఉండడం చాలా అరుదైన విశేషం. ఏవో ఆ సంఘటనలు విషయ ప్రధానంగా స్థూలంగా గుర్తుండటమేకాదు డెబ్భై ఎనభై ఏళ్ళ నాటి దృశ్యాలు, వ్యక్తులు, సంభాషణలు యథాతథంగా గుర్తుండటం గొప్ప సృజనాత్మక భావుకత ఉన్న ప్రతిభాశాలికి తప్ప సాధ్యం కాదు. మూలమంత్రంతో సంప్రదాయ సిద్ధంగా ఇంటిదగ్గర అక్షరాభ్యాసం నుంచీ ఆయన నేర్చుకున్నదంతా మనోభూమికలలో ఆయన పదిలపరచుకున్నారన్నమాట. కమలాపురంలో వీధి బడిలో చదువు, ఎలిమెంటరీ స్కూలు చదువు, పిల్లవాణ్ణి, ఇంగ్లీషు చదివించడమా, సంస్కృతం చదివించడమా అని పెద్దవాళ్ళ విచికిత్స, తాను ఎలిమెంటరీ స్కూల్లో చదివిన వాచక పుస్తకాలు అన్నీ రామచంద్రకు గుర్తున్నాయి. కాబట్టి శిశు వయస్సు నుంచీ, బాల్యదశనుంచీ ఆయనది విలక్షణమైన మేధాప్రతిభ అని నిస్సందేహంగా చెప్పవచ్చు. సాధారణంగా నూటికి తొంభై తొమ్మిది మందికి ఐదారేళ్ల శిశు వయసున తమ జీవితంలో తారసిల్లిన సంఘటనలేవీ జ్ఞాపకం ఉండవు. కానీ పేర్లూ, సన్నివేశాలు, పెద్దలవల్ల విన్నవీ, తాను చూసినవి, ఆయనకు గుర్తున్నాయి. ఆ ఉపాధ్యాయుల పేర్లు గుర్తున్నాయి. వాళ్ళు బోధించిన విషయాలు, పద్ధతులూ గుర్తున్నాయి. బహుశః ఈ మేధానైశిత్యమే ఆయన పెద్దవాడవుతూ చదివిన వివిధ శాస్త్రాలు, వందలకొద్దీ పుస్తకాలు, జీవితంలో తటస్థపడిన వింత అనుభవాలు, విలక్షణ వ్యక్తులు, సన్నివేశాలు ఆయన హృదయఫలకంలో నిక్షిప్తం కావడానికి దోహదం చేసి ఉంటుంది. ఇవాళ కంప్యూటర్ విజ్ఞానం ఎంతో వ్యాప్తిలోకి వచ్చింది. ప్రాచుర్యం చెందింది. పసిపిల్లలు కూడా కంప్యూటర్ విజ్ఞానం వినియోగించుకో గలుగుతున్నారు. బాల్యంనాటి సంగతులన్నీ ఆయనకు స్పష్టంగా విశదంగా డెబ్భై ఎనభైఏళ్ళ తర్వాత కూడా గుర్తున్నాయంటే కంప్యూటర్ మేధావిత్వం చిన్నప్పటినుంచీ ఆయనలో ఉండేదన్నమాట. ఐదారేళ్ళ వయసున ఎలిమెంటరీ స్కూలులో తరగతి చదువు ప్రారంభంలో ఆనాటి బ్రిటిష్ పరిపాలకుడి శ్రేయస్సుకై పాఠశాల బాలురుచేసే సంస్తుతి, తర్వాత దేవుడిని గురించి కన్నడంలో ప్రార్థన ఆయన స్వీయ చరిత్రలో ఉల్లేఖించారు. సుమారు మైలు దూరం నుంచి తుంగభద్ర నుంచి తమ తల్లిగారు మూడు బిందెలనీళ్ళు ఒకేసారిగా ఇంటికి తేవడం, ఆమె

వంటవార్పులూ, నిత్యకృత్యాలూ కళ్ళకు కట్టేట్లు వర్ణించారు. ఆమె తనకు చెప్పిన అమరం, ఆంధ్రనామసంగ్రహం, దేవతాస్తోత్రాలు గుర్తుంచుకున్నారు.

హంపీ విజయనగరం విశేషాలు తాము చిన్నప్పుడు చూసినవన్నీ ఎంతో ఆసక్తి కలిగించేలా స్వీయచరిత్రలో చెప్పారు. ఐదేళ్ళ వయసున తాము తాతగారితో వేరే ఊరుకు ఎడ్లబండిలో ప్రయాణం చేస్తున్నప్పుడు రాత్రివేళ దారిలో పులి ఎదుర్కోవడం, ఆత్మరక్షణకోసం ఎడ్లు ఆ పులితో తలపడడం, అర్ధవలయాకారంగా ఆ పెద్దపులితో అవి మోహరించడం, ఆ ప్రమాదం నుంచి బయటపడటం, అప్పుడు బండివాళ్ళు ఇదంతా చిన్నసామి అదృష్టం అని తనను పొగడటం కూడా ఆయనకు గుర్తుంది.

సర్కారు జిల్లాలనుంచి లక్ష్మణాచార్యులనే హరికథకుడు కమలాపురం వచ్చి నెలరోజులపైగా రామాయణం హరికథ చెప్పడం, రామరావణ యుద్ధంలో కుంభకర్ణుడిని నిద్రలేపే ఘట్టం ఒకరాత్రి రాత్రిఅంతా ఆ హరిదాసు వర్ణించడం తనకు గుర్తేనన్నారు. ధార్వాడ నుంచి ఇంద్రజాల ప్రదర్శకులు వచ్చి (వీళ్ళను మోడీవాళ్ళు అన్నారు రామచంద్ర) ప్రేక్షకులపై వేపాకులు చల్లి తేళ్ళు, మండ్రగబ్బలు వాళ్ళ శరీరాలపై పాకేట్లు బీభత్సం సృష్టించడం, కేకలు, అరుపులు, మళ్ళీ అంతలోనవ్వులు దృశ్యం వర్ణించారు. కనికట్టువాళ్ళు, గారడీవాళ్ళు, వింతలు వినోదాలు సృష్టించే వారని, వారి గూర్చీ, తమ చిన్ననాటి సంగతులూ చెప్పారు.

అన్నిటికన్నా అద్భుతమైన సంఘటన ఒకటి తమ అయిదేళ్ళ వయసునాటిది స్వీయచరిత్రలో రామచంద్ర ఉల్లేఖించారు. తమ తల్లిగారు తుంగభద్రకు నీరు తీసుకురావడానికి వెళ్ళారు. ఇంట్లో పెద్దవాళ్ళెవరూ లేరు. అది ఉదయకాలం. ఇంకా బాగా పొద్దెక్కలేదు. ఇంట్లో తాను, మూడేళ్ళ పసిది అయిన చెల్లి, ఏడాది పసివాడైన తమ్ముడు మాత్రమే ఉన్నారు. ఆ పసివాళ్లకు తాను కాపలా. నీళ్ళు తేవడానికి తుంగభద్ర కాలువకు వెళ్ళిన తల్లి ఇంటికి చేరటానికి సుమారు గంటైనా పడుతుంది. అమ్మ నీళ్ళకోసం వెళుతూ పొరపాటున వంటింటి తూమును మూసివేసే రాయిపెట్టడం మరచిపోయి వెళ్ళింది. పసిపిల్లవాడు, ఎడపిల్లా వంటింట్లో ఆడుకుంటున్నారు. ఐదేళ్ళ బాలుడైన రామచంద్ర ఇంటి ముంగిట వసారాలో ఉన్నాడు. అప్పుడు వంటింట్లోకి తూముగుండా ఒక పెద్ద పాము వచ్చింది.

పసివాడికది పామని తెలీదు కదా, వింతగా చూస్తున్నాడు. మూడేళ్ళ చెల్లికి కూడా అది భయంకరమైన సర్పమని తెలియదు. కాని ఇంట్లో అలవాటుగా తిరిగే పిల్లి ప్రమాదం పసికట్టి, స్వీయసంరక్షణ జాగ్రత్తతో కొంచెం ఎడంగానే పొంచి పామును అటకాయించింది. పరస్పరం దెబ్బతీసే ఉద్దేశ సన్నద్ధతతో పామూ, పిల్లీ అదనుకోసం చూస్తుండగా చెల్లివచ్చి బయట వాకిలి దగ్గరున్న అన్నతో 'అన్నా! వంటింట్లో రెండు పిల్లులు పోట్లాడుకుంటున్నాయి. తమ్ముడిమీదికి వస్తాయేమో' మరి అని చెప్పింది. అప్పుడు రామచంద్ర వంటింట్లోకి వెళ్ళి చూడగా ఈ భయంకర దృశ్యం కన్పించింది. అప్పుడాయన పంచాయుధ స్తోత్రంతో దైవరక్ష వేడుకున్నానని ఆ ఘట్టాన్ని స్వీయచరిత్రలో వర్ణించాడు. ఇంతలో తల్లిరావడం, బాబుని కాలుపట్టుకుని లాగి ఇవతలికి ఈడ్చి గుండెలకు హత్తుకోవడం, పాము పారిపోవడం, పిల్లి వచ్చి తల్లి పాదాలకు ఆనందంతో చుట్టుకోవడం వర్ణించాడు. ఎనభైఏళ్ళకిందట ఆ భయంకర విషమ ఘట్టంలో మూడేళ్ళ పసివయసుగల తన చెల్లి తనతో మాట్లాడిన తొక్కు పలుకుల భావప్రకటనం కూడా రామచంద్రకు గుర్తు ఉంది.

ఆ కాలంలో భారతదేశంలో ప్లేగు వ్యాధి ప్రబలంగా ఉండేది. అప్పుడు ఊరు విడిచి వ్యాధి సంరక్షక శిబిరాలలో గృహస్థులు కొంతకాలం గడపవలసి వచ్చేది. ఈ విషయం కూడా రామచంద్ర రాశారు. తన చిన్నతనంలో అంటే ఐదారేళ్ళ వయసులో ఆంధ్రపత్రిక దినపత్రిక తాను చూసేవాడిననీ, ఆ వార్తలు, విషయాలు తనకు అర్థం కాకపోయినా గాంధీజీపట్ల గొప్ప ఆకర్షణ ఏదో హృదయంలో స్థిరంగా పాదుకొన్నదనీ వారు స్వీయచరిత్రలో ఉటంకించారు.

పదేళ్ళలోపు వయస్సుననే భవిష్యజ్జీవితాన్ని కూడా బాగా ప్రభావితం చేసిన సంఘటన ఒకటి స్వీయచత్రలో వర్ణించారు రామచంద్ర. కమలాపురంలో తమ వీథిలోనే తమ ఇంటికెదురుగా ఉండే బసివి నాగమ్మ వృత్తాంతమది. ఆ కాలంలో ఇంకా భూస్వామ్య సామాజిక దురన్యాయ అవశేషంగా ఒకరకమైన దేవదాసీ పద్ధతి 'బసివి' సంప్రదాయం పేరిట కొనసాగుతూ ఉండేది. చిన్నప్పుడు ఏదైనా జబ్బుచేసి ప్రాణం అటో ఇటో అనుకున్న సన్నివేశాలలో ఈ శిశువు బతికితే దైవార్పణం చేస్తామని మొక్కుకొని ఆ విధంగా ఆచరించే సంప్రదాయం ఒకటి

సమాజంలో ఉండేదిట. ఇంతేకాక సంసార జంజాటంపట్ల వైముఖ్యంతో పూర్తిగా దైవానికే తమను అర్పించుకొని, దైవసేవచేసే వర్గం కూడా ఉండేదట. శైవమత సంప్రదాయంలో వర్ణవ్యవస్థలోని దిగువ కులాల వాళ్ళలో ఈ విధంగా 'బసివి' సంప్రదాయం క్రమేపీ వెలయాలి వ్యస్థగా దూషితమైపోయింది. అయినా ఈ వర్గానికి చెందిన బసివి నాగమ్మ తన సౌజన్య, సౌశీల్య, సత్సంప్రదాయాలతో తనకు మహిళలపట్ల గొప్ప గౌరవాన్ని, మర్యాదను, మన్ననను చిన్నప్పటినుంచే అలవడేట్లు చేసిందని రామచంద్ర రాసుకున్నారు. ఆమెను గూర్చిన జిజ్ఞాస, కుతూహలం తొలిసారిగా తనలో ప్రబుద్ధమైనప్పుడు ఆయన వయసు ఆరేళ్ళే.

రామచంద్ర బాల్యంలో ఆయనను బాగా ప్రభావితం చేసిన సంఘటన పన్నా రాజకుమారుడితో ఆయనకు కలిగిన పరిచయం. 'పన్నా' మధ్యప్రదేశ్‌లో చిన్న సంస్థానం. బ్రిటిష్ ప్రభుత్వంలో చిన్నా, పెద్దా సంస్థానాలు కూడా వారి సంరక్షిత రాజ్యాలుగా ఉండేవి. పన్నా రాజకుమారుడు క్షణికోద్రేకంలో ఘర్షణ పడి తన పిన తండ్రిని కాల్చి చంపగా బ్రిటిషు ప్రభుత్వం ఆయన్ను బళ్ళారిజిల్లాలో ప్రవాస శిక్ష ననుభవించేట్లు నిర్బంధించింది. ఆయన ఆ జిల్లాలో సంచరించే సందర్భాలు కూడా ప్రభుత్వానికి ముందుగా తెలియచేయవలసి ఉండేది. హంపీ విజయనగరం అడవులతో కొండలతో ఉండే ప్రదేశం కాబట్టి ఆయన తరచు కమలాపురం వస్తుండేవారని, తన పినతండ్రికీ ఆయనకూ సాన్నిహిత్యమనీ, పన్నారాజు వేటప్రియుడనీ రామచంద్ర రాశారు. అంతేకాదు. ఆయన వేటాడి సంపాదించిన పులిచర్మాలు, జింక చర్మాలు, జపం చేసుకొనే వారికి, ధ్యానయోగ సాధకులకు ఆ రాజు బహూకరించేవారుట. పిల్లలంటే ఆ రాజకుమారుడికి చాలా ఇష్టమట. ఈయన పెద్ద ఫోర్డు కారులో కమలాపురం వచ్చేవారుట. ఈ ఫోర్డుకారు ఊళ్ళోకి రావడం తనను చాలా ఆకర్షించేదనీ, ఉల్లాసం కలిగించేదనీ రామచంద్ర రాశారు.



# 4. కౌమారం - చిన్ననాటి చదువు సంస్కారాలు

ఎవరి జీవితంలోనైనా పది పన్నెండేళ్ళనుంచి పదిహేడు పద్ధెనిమిదేళ్ళ దాకా కౌమార వయస్సు. సామాన్యంగా భవిష్యజ్జీవిత వ్యక్తిత్వం ఈ కాలంలో చాలవరకు రూపుదిద్దుకుంటుంది. కొంతవరకు సూచితమవుతుంది.

ఇంచుమించుగ నూరేళ్ళనాడు భారతీయ సమాజం ఇంకా సంప్రదాయ బద్ధంగానే ఉండటానికి అభిముఖ్యంగా ఉంటూ మానసిక ఘర్షణను వదిలిపెట్టలేదు. మార్పును అనుమానంతోనే చూస్తున్నది. భావపరివర్తనం పూర్తిగా అంగీకారం కాలేదు. ఇంతవరకు సామాజిక సాంస్కృతిక మతభావాల ప్రతినిధులుగా చెలామణి అవుతున్నవారిలో వేగవంతంగా రూపుదిద్దుకుంటున్న నూతన వ్యవస్థపట్ల ఆశ, ఆసక్తి ఉన్నా సంప్రదాయ విచ్ఛిత్తిపట్ల సానుకూలత, సమాశ్వాసమూ ఏర్పడలేదు. నూతన వ్యవస్థ ప్రయోజనాలను అంగీకరించారేకాని వాళ్లలో సంప్రదాయం ఏమైపోతుందోనన్న భీతి వదలలేదు. ముఖ్యంగా పురోహిత వర్గాలలో, వైదిక కర్మకాండ నాశ్రయించుకొని జీవికసాగిస్తూ సమాజానికి పూజనీయులైన వాళ్ళలో గతం, ఆగతం ఏది పోల్చుకోవాలి, ఏది తేల్చుకోవాలి? అనే ద్వైధీభావం తొలగిపోలేదు.

రామచంద్రకు ఎనిమిదేళ్ళ వయసున ఆయనను ఇంగ్లీషు చదివించాలా లేదా తరతరాలుగా అనూచానంగా కుటుంబంలో సాగుతున్న సంస్కృత పాండిత్యం

వేపు మళ్ళించాలా అన్న విచికిత్స వచ్చింది. ఆయన స్వీయచరిత్రలో చెప్పిన విషయం చాలా ఆసక్తికరంగా ఉంది. తండ్రి, పినతండ్రి తన ఇంగ్లీషు చదువుపట్ల మొగ్గుచూపారుట. అయితే తాతగారూ, తల్లీ సంస్కృతం చదవాలి రామచంద్ర అని అభిలాష కన్పరచారట. ఆనాటి సంప్రదాయ కుటుంబీకుల ద్వైధీభావ మనస్థితిని ఈ ఉదంతం చక్కగా ప్రతిబింబిస్తున్నది. కొన్ని రోజులు ఈ విషయమై చర్చోపచర్చలు, తర్జన భర్జనలు కూడా చోటుచేసుకున్నాయి ఇంట్లో అని ఆయన భోగట్టా.

ఏమైతేనేం ఇంగ్లీషు పక్షమే తాత్కాలికంగా సమ్మతమైంది. అయితే అప్పుడు కమలాపురంలో ఇంగ్లీషు మాధ్యంతో నడిచే స్కూలు ఏముంది? మిడిల్ స్కూల్ పరీక్షకు అప్పట్లో ప్రైవేట్‌గా కట్టవచ్చు. కాని ఇంగ్లీషు రావాలి. అందుకని ఊళ్ళోనే బంధువైన ఒక పోస్టు మాస్టరుగారు ఇంగ్లీషు చెపుతానంటే ఆయన దగ్గర కొన్నాళ్ళు చదివారు రామచంద్ర. ఇంతలో కమలాపురానికి దేశీయుడే అయిన ఒక క్రిస్టియన్ హెడ్‌మాస్టర్ మిడిల్ స్కూలుకు వచ్చారు. ఆయన ఇంగ్లీషు బోధించి పిల్లలను పరీక్షలకు పంపుతారని తెలిసి వారివద్ద రామచంద్ర కొన్నాళ్ళు ఇంగ్లీషు చదివారు. ఇంతలో బళ్ళారిలో తమ బంధువులే ఒకరు ప్రైవేట్ ట్యూషన్లుచెప్పి మెట్రిక్యులేషన్ పరీక్షకు పిల్లల్ని తరిఫీదు చేస్తున్నారని తెలిసి తాతగారు రామచంద్రను అక్కడ అప్పగించారు. బళ్లారి కమలాపురానికి చాలాదూరమేమీకాదు. అదీకాక తాతగారు కోర్టు పనులమీద బళ్ళారికి తరచు వస్తూనే ఉంటారు. అందువల్ల పొరుగూరైనా, రామచంద్ర చిన్నవాడే అయినా బళ్ళారిలో ఆ బంధువులింట రామచంద్రను అప్పగించటంలో ప్రతిబంధకాలేమీ లేకపోయినాయి. అంతేకాక రామచంద్ర పెద్దతల్లివాళ్ళు బళ్ళారిలోనే కదా ఉండటం. అందువల్ల ఆయన ఇంటిమీద కూడా అంత బెంగపెట్టుకోనక్కరలేదు అని తల్లిదండ్రులూ, తాతగారూ అనుకున్నారు. అయితే ఒక కొత్త చిక్కు వచ్చిపడింది. అక్కడ పిల్లల్ని ప్రైవేట్‌గా పరీక్షలకు తర్ఫీదుచేసే ఉపాధ్యాయుడు పిల్లలపట్ల చాలాకఠినంగా ప్రవర్తించేవారు. ఏ చిన్న తప్పుచేసినా తీవ్రంగా శిక్షించేవారు. అందువల్ల ఈ చదువుకు అలవాటు పడలేక పోయినాడు రామచంద్ర. ఒకసారి తాతగారు చూడటానికి వచ్చినప్పుడు

తన అనిష్టతను, వైమనస్యాన్ని తాతగారికి చెప్పుకుని తననెలాగైనా అక్కడ నుంచి తీసుకొని వెళ్ళవల్సిందిగా అర్థించాడు. ఈవిధంగా రామచంద్ర ఇంగ్లీషు చదువు ముచ్చటగా మూడుసార్లు విఘ్నమైపోయింది. ఇంటిల్లిపాదికీ గారాబం కదా! రామచంద్ర అంటే. బళ్లారి చదువు రెండు వారాలు కూడా కొనసాగలేదు. మళ్ళా ఆయన కమలాపురం చేరాడు. ఎనిమిదేళ్ళు నిండుతున్నాయి. ఎలిమెంటరీ స్కూల్లో నాలుగో క్లాసు పూర్తి అయింది. ఆ తర్వాత చదువులో ప్రవేశించాలి. ఏం చేయాలి? అనుకుంటూ ఉండగా కమలాపురానికి తిరుమల వారి బంధువు ఒకాయన ఒకసారి వచ్చాడు. ఆయనకేవో కుటుంబ సమస్యలు, కలతలు. వాళ్ళింటిపేరు కూడా తిరుమలవారే. అయితే కొన్ని తరాలకిందటవాళ్ళు తాడిమర్రినుంచి మైసూరు రాష్ట్రానికి వెళ్ళారు. అక్కడ ముచ్చుకుంట అనే ఊళ్ళో స్థిరపడ్డారు. అందువల్ల వాళ్ళింటిపేరు ముచ్చుకుంట అయింది. వీరి పేరు వెంకట శేషాచార్యులవారు. ఈ శేషాచార్యులవారి అన్నగారి పేరు వేంకటకృష్ణమాచార్యుల వారు. ఈ కృష్ణమాచార్యులవారు గొప్ప పండితులు. మైసూరు మహారాజావారు వీరిని ఆస్థాన విద్వాంసుడిగా గౌరవించారు. విద్వత్త సంగతి అలా ఉంచి కృష్ణమాచార్యులు గొప్ప తపశ్శక్తులు కలవారు. గొప్ప యోగి. వీరికి రష్యాలో కూడా శిష్యులుండేవారంటే ఈయన యోగవిద్య ఎంత జగత్ప్రసిద్ధమో తెలిసిపోతూ ఉంది. వేంకట శేషాచార్యులవారు కమలాపురం వచ్చి అక్కడికి అతి సమీపంలోని హంపీలోని కోదండరామ స్వామి దేవాలయంలో జపం, తపం, ధ్యానంతో కొన్నాళ్ళుండాలనే సంకల్పం వెలిబుచ్చారు రామచంద్ర గారి తాతగారైన వేంకట నరసింహాచార్యుల వారితో. అప్పుడు నరసింహాచార్యుల వారు శేషాచార్యులవారితో ఎలాగూ మీరు కొన్ని నెలలుండాలని అనుకుంటున్నారు కాబట్టి కోదండరామ స్వామి దేవాలయంలో పూజా పురస్కారాలు కూడా మీరే చూడవల్సిందిగా అర్థించారు. ఆయన సరేనన్నారు. ఆయన మహావిద్వాంసుడు. కాబట్టి సంస్కృతం చదివించమని రామచంద్రనాయన కప్పగించారు. అంటే ఆయన వెంట ఉండి ఆయన నిర్ణయించిన పాఠ్యప్రణాళిక మేరకు రామచంద్ర సంస్కృతం చదువుకోవాలి. ఆయనకు శుశ్రూషచేయాలి. తెల్లవారుఝామున నాలుగు గంటలకే లేచి

రెండువందల మెట్లుదిగి అర ఫర్లాంగు నడిచి తుంగభద్రనుంచి దేవాలయంలోని బసకు నీళ్ళు తేవాలి. గురువుగారికి వేడినీళ్ళు కాచాలి. గురువుగారి స్నానసంధ్యానుష్ఠానాలన్నీ ముగిశాక ఆయన దగ్గర చదువుకోవాలి. మధ్యాహ్నం పన్నెండు గంటలకు భోజనం. మధ్యాహ్నం రెండు గంటలనుంచి నాలుగు గంటలదాకా కొత్త పాఠాలు. రాత్రి 8 గం.లకు భోజనం. రాత్రి 9 గం.లకు విశ్రాంతి. నిద్ర. ఆయన పాఠాలు బాగానే చెప్పేవారు కాని, ఇంకెవ్వరూ పలకరించే దిక్కులేదు. క్రూరమృగాలు సంచరిస్తుండే ప్రదేశమది. రాత్రిపూట చిరుతపులులు తిరుగాడేవి. నదీతీరంలో మొసళ్ళు కన్పించేవి. దీనితో భయంపట్టుకుంది రామచంద్రకు. ఆయన దగ్గర చదువుకోవడంలో వైముఖ్యం ఏర్పడిపోయింది. ఇంటిమీద ధ్యాసమళ్ళింది. గురువుగారికి విన్నవించుకుంటే ఆయన చంటిపిల్లవాడివా అని వెటకారం చేశారు. కాని ఒకసారి తనకేదో పనిఉండి శిష్యుణ్ణికూడా వెంటపెట్టుకొని కమలాపురం వెళ్ళారు. రెండు మూడు రోజులకు వచ్చి మళ్ళీ వెంటతీసుకొని పోతాను అని చెప్పారు. బతుకుజీవుడా అనుకున్నాడు రామచంద్ర. అన్నట్లు ఆయన రానేవచ్చారు. ఆయన్ను చూడగానే కొండలపెట్టున జ్వరం వచ్చింది రామచంద్రకు. కలవరింతలు. అందువల్ల శేషాచార్యులవారు చేసేదేంలేక తనదారిన తాను ఒంటరిగా వెళ్ళిపోయినారు. మళ్ళీ మొదటికొచ్చింది రామచంద్ర చదువు.

ఇంతలో ఒక ఆలోచన వచ్చింది రామచంద్ర కుటుంబ పెద్దలకు. ఆనెగొందిలో వారి బంధువులున్నారు. ఆనెగొంది సంస్థాన పండితులు అంబారు వెంబాళం రామాచార్యులవారు సకలశాస్త్ర పండితులు. విద్యానిధి. వారి కుమారులు వెంకటాచార్యులవారు కూడా మహాపండితుడు. ఎందరికో చదువుచెపుతూ ఉండేవారు. రామాచార్యులవారి తమ్ముడి పత్ని కొండమ్మగారు తిరుమల వారి కుటుంబానికి దగ్గర బంధువురాలు. రామచంద్ర తాతగారికి ఆమె మరదలవుతుంది. అంటే రామచంద్ర పితామహికి కొండమ్మగారు చెల్లెలు. రామచంద్రకు చిన్నాయనమ్మ. ఆమెదొక విషాదగాథ. చిన్నతనంలోనే ఆమె భర్త చనిపోగా ఆమె పుట్టింటికి చేరకుండా అత్తవారింట్లోనే ఆనెగొందిలో కాలం

గడుపుతున్నది. ఆమె అక్క మనవడే కదా రామచంద్ర. ఆమె కమలాపురం వచ్చినప్పుడల్లా రామచంద్రను తమ ఇంట్లో ఉంచాల్సిందిగా, తమ బావగారైన రామాచార్యుల వారివద్ద సంస్కృతం చదివించవల్సిందిగా గట్టిగా కోరుతుండేది. కాబట్టి రామచంద్ర ఆనెగొందిలో ఉండి చదువుకోవాలని కుటుంబం నిర్ణయించింది. ఏముంది!? నది దాటితే వెళ్ళి చూసుకోవచ్చు పిల్లవాణ్ణి. చిన్నాయనమ్మ అక్కడే ఉంది కాబట్టి పోషణకు లోపమేమీ ఉండదు. ప్రేమగా చూసుకుంటారు. గొప్పగా చదువుకుంటాడు పిల్లవాడు అని తృప్తిపడ్డారు కుటుంబమంతాను.

అంబాళం వెంబారురామాచార్యుల వారివద్ద 2 సం.లు చదువుకున్నారు రామచంద్ర. సంస్కృత విద్యలో గొప్ప పునాది ఏర్పడింది. ఆనెగొంది చిన్న సంస్థానం. చారిత్రక ప్రసిద్ధిగాంచింది. రామాచార్యులవారివద్ద సంప్రదాయ సిద్ధంగా సంస్కృతం చదవడమేకాక ఊళ్ళో మిడిల్ స్కూలులో ఉర్దూ, ఇంగ్లీషు, తదితర ఆధునిక విద్యా విషయాలు కూడా బోధిస్తారు. ఆ స్కూల్లోచేరి క్లాసులకు వెళుతూ ఇంగ్లీషు, ఉర్దూకూడా చదివారు రామచంద్ర. ఆనెగొందిలో అప్పుడు పదిహేను, ఇరవై శ్రీవైష్ణవ కుటుంబాలుండేవి. పండుగలకు, పబ్బాలకు, శుభకార్యాలకు, ఉత్సవాలకు అందరూ కూడుతూ ఉండేవారు. ఆ చిన్నతనపు జీవితం నిత్యోత్సవంగానే ఉండేది రామచంద్రకు. కృష్ణాష్టమిని మహాఘనంగా జరిపేవారు. దేవీ నవరాత్రులు ఎంతో వైభవంగా జరిగేవి ఆనెగొందిలో అని ఆయన స్వీయ చరిత్రలో రాశారు. రామచంద్ర ప్రవృత్తి ఆబాల్యం గవేషణతో నిండి ఉండేది. ఆ జిజ్ఞాస, పరిశీలనాసక్తి అసదృశం. ఆయన ఎనిమిదేళ్ళ వయసులోనే కమలాపురం వచ్చిన పానుగంటి లక్ష్మీనరసింహరావును చూశారు. పానుగంటివారు ఆనెగొంది సంస్థానాధిపతులైన రంగదేవరాయలవారి ఆస్థాన కవిగా కొన్నాళ్ళు ఆనెగొందిలో ఉన్నారు. రంగరాయల వారితో ఒకసారి పానుగంటివారు కమలాపురం వచ్చినట్లూ, అప్పుడు ఊరి గ్రంథాలయంలో పానుగంటి వారిని సమ్మానించినట్లూ రామచంద్రగారి స్మృతి పదిలంగా ఉంది. అంత చిన్న వయసుననే ఆయనపట్ల ఒక ఆకర్షణ కలిగినట్లు రాశారు రామచంద్ర. తర్వాత తిరుపతి సంస్కృత కళాశాలలో చదివేప్పుడు తరగతి వ్యాసరచన శిక్షణలో

తాము పానుగంటివారి సాక్షి వ్యాసాన్ని అనుసరించి ఒక వ్యాసం రాసి అధ్యాపకుల మెప్పుపొందినట్లు రామచంద్ర స్వీయచరిత్ర బాల్యోదంత స్మృతులు చెపుతున్నాయి.

రామచంద్రకు పదేళ్ళలోపు వయసున నిద్రలో నడిచే వ్యాధి ఉండేది. స్వాప్నిక చేతనావిష్టుడై పక్క మీదినుంచి లేచి అవిదిత జాగ్రదావస్థలో ఆయన సంచరించేవాడు. రాత్రివేళ మైళ్ళు మైళ్ళు నడవటం కూడా సంభవించింది. ఇటువంటి ఒకటి రెండు ఉదంతాలు ఆయన స్వీయ చరిత్రలో వర్ణించారు.

ఆనెగొంది చదువుకు రాకముందే రామచంద్రకు ఉపనయనం జరిగింది. ఆనెగొంది వచ్చిన తర్వాత కూడా తనకు తెలియకుండానే నిద్రలో ఆవేశితుడు కావడం సంఘటనలు జరిగినట్లు ఆయన రాశారు. అప్పుడు గురువుగారు ప్రేమాభిమానాలతో చికిత్స చేయించారు. ఆ చికిత్స క్రమమంతా రామచంద్రకు గుర్తుండడం విశేషం. ఆయన అప్పుడు చెవిపోటుతో విపరీతంగా బాధపడుతుండే వారట. అంతేకాక అరచేతిలో పుండులేచి మోచేతిదాకా వాచి అస్వస్థులైనారుట. వీటన్నిటిని మించి నిద్రలో నడకవ్యాధి. అప్పట్లో వెంబారు రామాచార్యులవారి వియ్యంకులు శ్రీనివాస రాఘవాచార్యులవారు ఆనెగొంది వచ్చారు. ఆయన చాలా గొప్ప ఆయుర్వేద వైద్యుడు. చెవిపోటుకు నిర్గుండాదితైలం, అరచేతి పుండుకు గంధకలేపం, నిద్రలో నడక వ్యాధికి నారికేళాంజనం ఔషధాలుగా ఉపయోగించి రామచంద్ర అస్వస్థతలన్నింటినీ నిశ్శేషం చేశారని రామచంద్రే స్వీయ జీవనోదంతాలలో చెప్పారు. రామచంద్ర పెద్దైన తర్వాత ఆయుర్వేదం కూడా చదివారు. అందువల్లనే ఏమో డెబ్బై అయిదేళ్ళ కిందటి తమ బాల్యం నాటి అనారోగ్య చికిత్సను అంత వివరంగా చెప్పగలిగారు.

శ్రీవైష్ణవ సంప్రదాయమైన సమాశ్రయణం అంటే భగవత్, భాగవత ప్రపత్తి, దాససంప్రదాయ దీక్షాస్వీకరణం. త్రికరణ శుద్ధిగా దాస భావాన్ని సమాశ్రయించడం, స్వీకరించడం. ఈ సమాశ్రయణాన్నీ ఆనెగొంది సంస్కృత విద్యాభ్యాస కాలంనాటి తమ బాల్య ప్రవర్తనలోని చెడు నడతను ఆయన గుర్తుచేసుకున్నారు. ఒకసారి తమ ఇంట్లోనూ, ఒకసారి గురువుగారింట్లోనూ తాము చేసిన దొంగతనాన్ని, చెప్పిన అబద్ధాలను ఆయన డెబ్బై, ఎనభైఏళ్ళ తర్వాత కూడా జ్ఞాపకం చేసుకున్నారు. ఆయన మనస్వి.



# 5. కళాశాల నుంచి కారాగారానికి

రామచంద్ర కౌమార వయసు విద్యార్జన మొదటినుంచీ సాఫీగా సాగలేదు. ఆనెగొందిలో ఆయన చదువుకు ఆటంకాలేమీ కలగలేదు. పరాయి వారింట్లో ఉండి తేరగా తిని చదువుకుంటున్నాడన్న భావం ఇతరులకూ, ఆఖరుకు రామచంద్రకూ కూడా కలగకుండా గురువుగారి కుమారులైన వెంకటాచార్యులవారు ఆనెగొందిలో ఒక దేవాలయంలో రామచంద్రకు 'పడి' ఏర్పాటు చేశారు. పడి అంటే దేవుడి సేవకుగాను దేవాలయం వారు ఇచ్చే ప్రసాదం. దేవుడికి ఆరగింపు చేసిన తర్వాత ఆ ప్రసాదం నిత్యార్చనలలో పాల్గొన్న వారికి ఇంత భాగమని ఇస్తారు. అది ఆ కైంకర్యం చేసిన వారికి ఆ పూట భోజనానికి సరిపోతుంది. పడి అంటే కొలత. పూజా కార్యక్రమంలో పాల్గొన్నవారికిచ్చే భోజన పరిమాణం. ఆ దేవాలయం రంగనాథస్వామి దేవాలయం. ఆ దేవాలయం అర్చక యాజమాన్యం వెంకటాచార్యులవారిది. ఆనెగొందిలో 40 వరకు వైష్ణవాలయాలున్నాయని రామచంద్ర రాశారు.

గురువుగారు ఎంతో ప్రేమతో చదువు చెపుతున్నారు. ఇంట్లో వంటా వార్పూ అంతా కొండమ్మవ్వది. గురువుగారి మనవలిద్దరు ఆట పాటలకు తోడున్నారు. గురువు గారి దగ్గర ఇంకా విద్యార్థులుకూడా చదువుతున్నారు. ఒంటరితనం లేనేలేదు. చదువు బాగా సాగుతున్నది. చిన్నప్పటినించి బాధిస్తున్న 'నిద్రలో

నడక వ్యాధి' కూడా గురువు గారి దయవల్ల నయమైంది. ఇంకా రెండు మూడేళ్ళు శ్రద్ధగా చదువుకుంటే మైసూరు మహారాజావారు నిర్వహింప చేసే విద్యాపరీక్షలలో ఉత్తీర్ణుడై ఏదైనా విద్యాసంస్థలో మంచి పదవి కూడా సంపాదించవచ్చు. కమలాపురం దగ్గరే కాబట్టి తనవాళ్ళు అప్పుడప్పుడు చూసి పోతూనే ఉన్నారు. కమలాపురంలో శుభకార్యాలు, పండగ పబ్బాలకు తానుకూడా వెళుతూనే ఉన్నాడు. అయినా ఆనెగొందిలో ఉండి చదువు కొనసాగించడానికి రామచంద్రకు వైముఖ్యం కలిగింది. దానికి కారణం రామచంద్రే స్వీయచరిత్రలో రాసుకున్నారు. ఏదో ఒక సందర్భంలో చుట్టపుచూపుగా తమ బంధువు తమకన్న ఏడెనిమిదేళ్ళు పెద్దలైన తిరుమల వేంకటరంగా చార్యుల వారనేవారు ఆనెగొంది వచ్చారుట. సహజంగానే విద్యావిషయకమైన పరస్పర సమాచారవినిమయంవారి మధ్య జరిగి ఉంటుంది. రామచంద్ర చదువును గూర్చి రంగాచార్యులువారూ, ఆ ఆచార్యులవారి చదువును గూర్చి రామచంద్రా ఆసక్తితో అడిగితెలుసుకొని ఉంటారు.

తిరుపతి దేవస్థానం వారి సంస్కృతకళాశాల వంటిది అప్పటికి దేశంలోనే ఎక్కడా ఉండిఉండదు. ఉత్తరాది రాష్ట్రాలనుంచి కూడా అక్కడ చదువుకోవడానికి విద్యార్థులు వచ్చేవారు. దివ్యప్రబంధం అధ్యయనం చేసే తరగతి కూడా అక్కడ ఉండేదని రామచంద్ర రాశారు. అందువల్ల వైష్ణవ భక్తితత్వం, సిద్ధాంతం అధ్యయనం చేయడానికి గుజరాత్ నుంచీ, బెంగాల్ నుంచీ కూడా విద్యార్థులు వచ్చేవారని రామచంద్రకథనం. ఇక యాతాయాత తీర్థయాత్రాపరులతో వర్ణనీయంగా ఉంటుంది తిరుపతి. అక్కడ వివిధ శాస్త్రాలు బోధించే ఆచార్యులు ఉద్దండపండితులు. దేశం మొత్తం మీదనే ఎంతో పేరు ప్రఖ్యాతులున్నవారు. భోజనవసతి సౌకర్యం ఉంది. అని రంగాచార్యుల వారు రామచంద్రలో ఉత్కంఠ కలిగించారు.

ఆనెగొందిలో గురువుల వారికుటుంబంలో తన పట్ల చూపే ప్రేమ, ఆదరణ, లాలన, బుజ్జగింపులుకూడా వెక్కసంకలిగించాయని రామచంద్ర స్వీయచరిత్రలో చెప్పారు. తనకది ఒక పంజరంలా అనిపించి ఉంటుందాయనకు. రంగాచార్యులు వర్ణించిన తిరుపతి ఎంతో ఆకర్షణీయంగా కన్పించసాగింది. అక్కడ కళాశాలలో

50 మంది అధ్యాపకులున్నారనీ, ఏ శాస్త్రం ఇష్టమైతే ఆ శాస్త్రం చదవవచ్చుననీ, విద్యార్థులు జట్లుగా తిరుమల, తిరుపతుల ఉత్సవాలలో, సభలలో పాల్గొంటారనీ ఇత్యాదిగా ఆసక్తి కలిగించాడాయన. అందువల్ల ఆనెగొంది చదువుపై వైముఖ్యం ఏర్పడ్డది రామచంద్రకు. ఎలానైనా తిరుపతికి వెళ్ళి అక్కడ చదువుకోవాలని కోరిక కలిగింది. దానికోసం సమయంకోసం కనిపెట్టుకుని ఉన్నాడాయన. అప్పటికీ కొండమ్మవ్వ, గురువుగారూ ఎంతగానో బుజ్జగింపుగా చెప్పి చూశారు. మైసూరు మహారాజాకళాశాల విద్వత్పరీక్షల ఆశచూపారు. కాని రామచంద్రమనస్సు కొత్తలోకాలకోసం ఆరాటపడసాగింది.

కమలాపురంలో ఒక శుభకార్యం నిమిత్తం ఆనెగొంది నుంచి గురువు గారి కుటుంబమంతా వచ్చింది. వారితో రామచంద్ర వచ్చాడు. వాళ్ళు తిరిగి వెళ్ళేప్పుడు రామచంద్రవాళ్ళతో వెళ్ళనని మొండి కేశాడు. గురువుగారు నొచ్చుకొన్నా చేయగలిగిందేముంది? ఇంట్లో వాళ్ళుకారణమడిగితే తాను తిరుపతి వెళ్ళి చదువుకుంటానని చెప్పాడు రామచంద్ర. అంత చిన్నవయస్సులో మనవణ్ణి తిరుపతికి పంపించటానికి మనస్కరించలేదు తాతగారికి. అయినా అమ్మసిఫార్సు చేసింది. అక్కడ మనబంధువులున్నారు. వాళ్ళు కనిపెట్టి ఉంటారని తాతగారి మనస్సును తిప్పగలిగింది. ఇట్లా రెండు మూడు నెలలు తాత్సారమైనా తిరుపతి దేవస్థాన సంస్కృత కళాశాలలో చేరటానికి రామచంద్ర తాతగారి వెంట వెళ్ళాడు. అయితే అప్పటికే కొత్త విద్యార్థుల కళాశాల ప్రవేశం పూర్తి అయి తరగతులు ప్రారంభమై రెండు నెలలు కూడా గడచేపోయాయి. అప్పట్లో తిరుమల-తిరుపతి దేవస్థాన నిర్వహణ మహంతుల యాజమాన్యంలో ఉండేది. మహంత్ ప్రయాగదాసుతో తిరుమల వెంకటనరసింహాచార్యుల గారికి పరిచయం ఉంది. అందువల్ల ఆయన సిఫార్సు సాయం అర్థించారు. ఆయన సిఫార్సు పత్రం తీసుకొని కళాశాల ప్రిన్సిపాల్ సేలం సుబ్బారావుగారిని దర్శించారు తాతా, మనవడు. రామచంద్ర తాతగారు నరసింహాచార్యుల వారికి ప్రిన్సిపాల్ గారితోనూ బాగా పరిచయమే. ఏమంటే సుబ్బారావుగారి ప్రథమ కళత్రం పుట్టిల్లు కమలాపురమే. అందువల్ల ఆయన అప్పట్లో కమలాపురం తరచు వస్తూండేవారు. ఆవిధంగా

నరసింహాచార్యుల వారితో పరిచయం. సుబ్బారావు గారు రామచంద్ర కళాశాల ప్రవేశార్హత ప్రాథమిక పరిజ్ఞానం పరీక్షించి కళాశాలలో ప్రవేశం అనుమతించారు. ఈ మాత్రం దానికి మహంతుగారి సిఫారసు ఎందుకనీ గూడా ప్రిన్సిపాల్‌గారు నొచ్చుకున్నారు. తాతగారు అనునయంగా 'మీరిక్కడ ప్రిన్సిపాల్ అని నాకు తెలయదు కదాఽ ఇక వీడు మీ మనవడే' అని అనునయంగా రామచంద్రను ప్రిన్సిపాల్ గారికి అప్పగించాడు. కొండమీదదైవాన్ని దర్శించిరావటానికి తాతా, మనవలు తిరుమలకొండ ఎక్కారు. అక్కడ దైవదర్శనం చేసుకొని కిందికి దిగి వస్తుండగా ఒక ప్రమాదం జరిగింది. ఉత్సాహోల్లాసాలతో వేగంగా దిగుతున్న రామచంద్ర మెట్ల మీద నుంచి జారిపడిపోయి చాలా మెట్లు కిందికి దొర్లిపోయినాడు. దైవానుగ్రహంవల్ల ఏమీ దెబ్బతగులలేదు. తాతగారు దైవానికి కోటి మొక్కులు మొక్కుకున్నారు. మనవడికి జాగ్రత్తలు చెప్పి ఆయన కమలాపురం వెళ్ళిపోయినారు. తిరుపతి కళాశాలలో చేరింది 1924 డిసెంబరు చివరి వారమని రామచంద్ర స్వీయ చరిత్రలో ప్రస్తావించారు. అంటే ఆయన వయస్సప్పటికి 11 సం॥లు. రామచంద్ర కోరుకున్న కొత్త లోకమేదో ఆయనకు దర్శనమివ్వసాగింది. 50 మంది అధ్యాపకులు రెండుమూడు వందల మంది విద్యార్థులు. భారతదేశంలోని వివిధ ప్రాంతాల వారు, వివిధ భాషలవారు. బదరీ నారాయణ ప్రధానార్చక కుటుంబానికి చెందిన క్షీరాబ్ధిశర్మ దివ్యప్రబంధం కోర్సు చదువుకోవటానికి ఇక్కడకు వొచ్చాడు. అట్లానే బీహార్, యు.పి, గుజరాత్, వంగదేశంనుంచీ, దక్షిణాదితమిళ, కేరళ ప్రాంతాలనుంచీ విద్యార్థులున్నారక్కడ. ధనుర్మాసంలో కౌమారోల్లాసంతో, ఉత్సాహంతో కొండమీదికి పరుగులతో ఎక్కిప్రసాదాలు తీసుకొనిమళ్ళీ కళాశాల తరగతులు ప్రారంభమయ్యే సమయానికి తిరిగి వచ్చేవారమని రామచంద్ర స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. సంస్కృత సాహిత్యంతోపాటు, ఆయుర్వేదం, ఇంగ్లీషుకూడా బోధించేవారని రామచంద్ర రాశారు.

ఈ విధంగా కళాశాలలో సంస్కృత విద్యాభ్యాసం ఉత్సాహంగా సాగుతున్నా ఆయన హృదయంలో చిన్ననాడే పడిన స్వాతంత్ర్యోద్యమ కాంక్షా బీజాలు పొల్లుపోలేదు. ఎనిమిదేళ్ళ వయస్సుననే గాంధీజీని రామచంద్ర దర్శించి ఉత్తేజితుడైనాడు. ఆయన ప్రబోధించిన సహాయ నిరాకరణోద్యమం, త్రివిధ

బహిష్కారం రామచంద్రను బాల్యం నుంచి ప్రభావితం చేశాయి. తిరుపతి గొప్ప తీర్థయాత్రాస్థలమే కాకుండా జాతీయోద్యమకేంద్రం. అక్కడకు ఎందరెందరో స్వాతంత్ర్యోద్యమ ప్రచారకులు, కార్యకర్తలు వస్తుండేవారు. వాళ్ళ ప్రచారోపన్యాసాల హోరు బాగా ఉండేది తిరుపతిలో. పురుషోత్తమ ఆర్య అని బీహార్ నుంచి వచ్చిన ఉద్యమ ప్రచారకుడు తనను బాగా ఆకర్షించినట్లు, ఆ ప్రచార ప్రముఖుడు ఇందుకోసం తెలుగు నేర్చుకొని తెలుగులో తన ప్రబోధం ప్రారంభించి ఆ తర్వాత ఇంగ్లీషు లోనూ హిందీలోనూ అనర్గళంగాప్రసంగించేవారని రామచంద్రరాశారు.

చిత్తూరు జిల్లా అంతా స్వాతంత్ర్యోద్యమం పరవళ్లు తొక్కుతున్న కాలమది. కళాశాల శెలవు దినాలలో రామచంద్ర చుట్టుపక్కల ఊళ్ళకుకూడా స్వాతంత్ర్యోద్యమ సభల కోసం పరుగులెత్తేవారు. చిత్తూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులైన పార్థసారధి అయ్యంగారితో రామచంద్ర చాలా చోట్లప్రచారోద్యమ సభలలో పాల్గొన్నారు. తిరుపతి తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులైన నరసింహాచార్యుల వారితో కూడా రామచంద్ర పరిచయం పెంచుకున్నారు. కౌమారోద్వేగం, దేశంలోని వివిధ ప్రాంతాల స్వాతంత్ర్యోద్యమ వార్తలు ఎంతో ఉత్తేజకరంగా ఉండేవి. సభలలో ఎలుగెత్తి పాడటానికి గేయాలు, శ్లోకాలు కూర్చడం రామచంద్రకర్తవ్యమైంది. ఈ విధంగా రామచంద్ర ఉద్యమంలో తల మునకలు కావడం తటస్థించింది. తిరుపతి నగర కాంగ్రెస్ కార్యనిర్వహణ సంఘం ఏర్పాటుచేయాలని ఉద్యమకార్యకర్తలకు ఉత్సాహం కలిగింది. నగరంలో కాంగ్రెస్‌ప్రచారం, జాతీయోద్యమస్ఫూర్తి ఎక్కువ చేయాలని ఉద్యమకార్యకర్తలు నిర్ణయించారు. కల్లుసారా దుకాణాల దగ్గర పికెటింగ్, ఖద్దరు అమ్మకం, విదేశ వస్తు బహిష్కరణ ముమ్మరంగా కొనసాగించాలని నిశ్చయించారు. ఈ కార్యక్రమాలన్నిటినీ సమన్వయం చేయడానికే నగరకాంగ్రెస్ కమిటీ అవసరమైంది. తిరుపతి రైల్వేస్టేషన్‌కు ఎదురుగా ఉండే కరణం వీథిలోని నగలవర్తకుడు ఆదిమూర్తి ఆచారిని పట్టణ కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడిగా ఎన్నుకున్నారు. ఈయన పలుకుబడిగల జాతీయ వాది. ప్రభుత్వ ప్రాపకం ఏమాత్రం అవసరం లేని వాడు. కార్యదర్శిగా రామచంద్రను కోరుకున్నారు. అప్పుడాయన వయసు 14 సం.లే. సంస్కృతకళాశాల

విద్యార్థి. ఏమాత్రం సామాజిక హోదాలేదు. అనుభవం కలవారిని, పెద్దవారిని ఈ స్థానంలో ఎన్నుకోవల్సిందిగా ఆయన కాంగ్రెస్ కార్యకర్తలకు నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. అయితే వాళ్ళాయన మాటలు అంగీకరించలేదు. ఉత్సాహం, ఉపజ్ఞ, చొరవ, కార్యనిర్వహణశక్తి ముఖ్యంకాని హోదా, వయసు ముఖ్యం కావన్నారు. తర్వాత మూడుసంవత్సరాల కాంగ్రెసు కార్యకలాపాలలో ఆయన చురుకుగా పాల్గొన్నాడు. ఊరివారందరికీ పరిచయమైనాడు. మద్యవిక్రయాల పికెటింగ్‌లోనూ, విదేశ వస్త్రబహిష్కరణ ప్రచారం లోనూ ముందంజవేశాడు. బహుఉత్సాహశీలి. కాబట్టి ఆయనకు కాంగ్రెస్ కార్య నిర్వహణ భారం ఎక్కువైంది.

రామచంద్రకు సహాధ్యాయులు కూడా కొందరు తోడ్పడ్డారు. అందులో కలచవీడు వేంకటరమణాచార్యుల వారి తమ్ముడు శ్రీనివాసాచార్యులు ముఖ్యుడు. ఈ వేంకట రమణాచార్యులకు తాడిపత్రిలో దేశబంధు ప్రెస్ ఉండేది. కాంగ్రెస్ ప్రచారం చేసేవాడాయన. తిరుపతి పట్టణానికంతకూ ఉన్నతోన్నతమైన దేవాలయం గోవిందరాజస్వామి వారిది. అది ఊరిమధ్యలో ఉంది. దానికి 12 అంతస్తులు. గగనచుంబిగా విలసిల్లుతుండేది. చిట్టచివరి అంతస్తుదాకా వెళ్లలేకపోయినా సగందాకా వెళ్ళి కాంగ్రెసు జెండా ఎగువేసినా, గొప్ప సంచలనవార్త సృష్టించవచ్చు అని శ్రీనివాసాచార్యులు, రామచంద్ర కూడబలుక్కున్నారు.అప్పట్లో విద్యుద్దీపాలులేవు తిరుపతిలో. రాత్రి వేళ ఆ గోపుర అంతస్తులలో దీపాలు వెలిగించేవారు. అందుకొక ఉద్యోగి ఉండేవాడు. అతడికి తప్ప ఆ అంతస్తులపైకి వేరెవరికీ సోపానాల ద్వారా ఎక్కే హక్కులేదు. అందువల్ల ఆ ఉద్యోగితో స్నేహం పెంచుకుని, మంచి చేసుకున్నారు ఈ మిత్రులు. కొన్ని అంతస్తులవరకైనా ఎక్కి పట్టణంచూడాలని కుతూహల మనిచెప్పి సంజవేళ అతడితో పైకి ఎక్కారు. ఆ ఉద్యోగి అన్ని అంతస్తులు ఎక్కి దీపాలు ముట్టించి వచ్చేలోపున తాము సగంలో ఆగిపోయి తమతో రహస్యంగా తీసుకొని వెళ్ళిన కాంగ్రెస్‌పతాకను రహస్యంగా ఐదో అంతస్తు అటూఇటూ ఉన్న ప్రతిమలకు స్నేహితులు చెరి ఒకటి కట్టి గుప్‌చుప్‌గా దిగిపోయారు. అనుమానం లేని ఆలయోద్యోగి తన పనిచేసుకుని కిందికి దిగి వచ్చాడు. అయితే ఆమర్రోజు తొలి ఉషఃకాంతులింకా ప్రసరించకముందే గోవిందరాజ స్వామి వారి సన్నిధి

వీథిలో కాపురముండే దొరస్వామి అయ్యంగారనే ప్రముఖ న్యాయవాది కంటపడ్డాయి ఈ త్రివర్ణపతాకలు. ఆయన గాబరాపడిపోయి జనసంచారం ఇంకా మొదలుకాక ముందే వాటిని తొలగించడం మంచిదని ఎంచి పోలీసుస్టేషన్‌కు కబురుచేయడం, ఇన్స్పెక్టర్ కన్నయ్యనాయుడు వచ్చి వాటిని తొలగింప చేయడం, ఆరాతీసి రామచంద్రను తీవ్రంగా హెచ్చరించడం జరిగింది.

1932వ సంవత్సరం వచ్చింది. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక విఫలమైంది. రౌండ్‌టేబుల్ సమావేశం వమ్మైంది. దేశంలో సత్యాగ్రహోద్యమం తీవ్రతరమైంది. దేశంలో ఎక్కడచూసినా దేశభక్తులు జైళ్ళునింపుతున్నారు. కాంగ్రెస్ ఉద్యమాన్ని, కార్యక్రమాన్ని ప్రచారం చేయడానికి రాత్రి అంతా చేతివ్రాతతో కరపత్రాలు రూపొందించి ఊరంతా పంచిపెట్టి, పోలీసు స్టేషన్ లోకూడా ఈ కరపత్రాల ప్రభావం ఎలా ఉంటుందో చూదామని రామచంద్ర పోలీసు స్టేషన్‌కు వెళ్ళి హెడ్ కానిస్టేబుల్‌కు కాంగ్రెస్ ప్రచారాశయ కరపత్రం అందజేశాడు. అది 1932 ఫిబ్రవరి 4వ తేదీ. అరెస్టుచేసి ఆమర్రోజు 5వ తేదీన చంద్రగిరి సబ్‌కోర్టులో ఆయన్ను పోలీసులు హాజరుపరచడం, ఆయనను రాయవెల్లూరు కారాగారం ప్రవేశింప చేయడం తర్వాత ఘట్టాలు. అప్పుడాయనకు పందొమ్మిదేళ్లు. ఈ ఏడేళ్ళ కళాశాల జీవిత కాలక్రమపరిణామాల చివరి ఘట్టం రామచంద్ర కారాగార ప్రాప్తి.





# 6. కారాగారవాసం - కుట్రకేసు

గోవిందరాజస్వామి వారి మహాదేవాలయగోపురంపై త్రివర్ణ పతాకం ఎగురవేయాలన్న కోరిక ఫలించకపోవడంతో హతాశులైన రామచంద్ర, ఆయన సంస్కృతకళాశాల అంతరంగికులు నిరుత్సాహం చెందలేదు. ఆలయ ఆవరణలోని నమ్మాళ్వారు గుడిగోపురం పైన అయినా త్రివర్ణ పతాకం రెపరెపలాడేట్లు చేయాలని వాళ్ళు తీర్మానించుకున్నారు. గుట్టు చప్పుడు కాకుండా ఆపని చేశారు. బట్టలు ఆరేసుకొనే రెండు దండాలు చివరలు జోడించి పదిహేను ఇరవై అడుగుల పొడవాటి జెండా కర్ర తయారు చేసి ఆ జెండాను నమ్మాళ్వారు గుడిగోపురంపై ఎగురవేశారు. దాంతో రామచంద్ర పోలీసువారికి పట్టుబడ్డాడు. ఫిబ్రవరి 5, 1932 చంద్రగిరి సబ్‌మేజిస్ట్రేట్ కోర్టులో విచారణ జరిగింది. నిషిద్ధసంస్థల కార్యకలాపాలలో పాల్గొన్నందుకు, దేశద్రోహం, రాజద్రోహం ప్రచారంచేసి నందుకు రామచంద్రకు మేజిస్ట్రేట్ ఒక సంవత్సరం కఠినకారాగార శిక్ష విధించారు. ఆ మర్రోజు అంటే ఫిబ్రవరి 6 తేదీన రేణిగుంట-కాట్పాడి రైల్లో రామచంద్రను వేలూరు జైలుకు తీసుకొని వెళ్ళారు. రామచంద్ర సత్యాగ్రహ ఖైదీకాబట్టి జైల్లో సౌకర్యాలకోసం

కాంక్షించలేదు. దరఖాస్తు చేసుకోలేదు. వెల్లూరు జైలు క్వారంటైన్ జైలు. అంటే సత్యాగ్రహులను ముందుగా వైద్య పరీక్షల నిమిత్తం సమావేశపరిచే కారాగారం. అంటు వ్యాధులున్నవారిని వేరు పరుస్తారు. తదితర రోగాలున్న వాళ్ళకు వైద్య చికిత్సాక్రమం నిర్ణయిస్తారు. రెండు మూడురోజులు ఈ తతంగమంతా జరిగిన తర్వాత సత్యాగ్రహులను వేరే వేరే జైళ్లకు కేటాయిస్తారు. ఈ విధంగా మూడు రోజుల తర్వాత రామచంద్రను సంయుక్త తిరుచునాపల్లి జైలుకు తరలించారు.దేశ స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులలో మద్రాసు రాష్ట్రంలో తిరుచునాపల్లి, వేలూరు, కడలూరు జైళ్లు ఎంతో సమర్ధంగా ఉండేవి. అప్పట్లో రాజమండ్రి, బళ్ళారి జైళ్లలోకూడాసత్యాగ్రహుల్ని నిర్బంధించే వారు. తనను తిరుచునాపల్లి జైలులో నిర్బంధించినప్పుడు వెయ్యిమంది సత్యాగ్రహులను అక్కడ నిర్బంధించినట్లు రామచంద్రరాశారు. కారాగారనిర్బంధంలో 'సి' క్లాసు ఇవ్వడమంటే కఠిన నిర్బంధం. మళ్ళీ మళ్ళీ సత్యాగ్రహం చేయకుండా, సహాయనిరాకరణం, చట్టధిక్కారం చేయకుండా బ్రిటిషు ప్రభుత్వం ఆనాటి రాజకీయ నిర్బంధితులకు, సమాజ శాంతి భద్రతలకు హానికలిగించే సామాన్య నేరచరితులకు విధించే కఠిన దండన పద్ధతులనే విధించేది. సాంఘిక నేరాల వారితో పాటే వీరిని లెక్కకట్టడం జరిగేది. అయితే సంఘంలో హోదా, ఆస్తిపాస్తులు, గుర్తింపుకల వాళ్లు జైలుకు వచ్చినప్పుడు వాళ్ళు అధికారులకు విజ్ఞప్తి చేసుకుంటే జైలు జీవితంలో వాళ్ళకు సౌకర్యాలు కలిగించేవాళ్ళు. అటువంటి అపరాధులకు 'ఏ'క్లాసు 'బి' క్లాసు ఇచ్చేవారు. ఆహారం ఇంటి నుంచి రావటానికీ ఇంకా ఇతర కనీస సౌకర్యాలు వారు పొందటానికీ జైలు అధికారులు అనుమతించేవారు. తక్కిన సత్యాగ్రహులను కంకరకొట్టడం, తాళ్ళు పేనడం, ధాన్యం విసరడం, నీళ్ళు మోయడం వంటి శరీరకష్టపు పనులకు వినియోగించేవాళ్ళు. విద్యాధికులైనా, శ్రీమంతులైనా, సాంఘిక స్థాయికలవారైనా తమ హోదాను గుర్తించి కనికరించమని ప్రభుత్వాన్ని వేడుకోకపోతే వారిని కూడా సామాన్య ఖైదీలు గానే పరిగణించేవారు. వాళ్ళ చేతకూడా శరీరకష్టం చేయించే వారు. ఇక 'సి' క్లాసు ఖైదీలకిచ్చే ఆహారం మరింత ఘోరంగా ఉండేది. ప్రమాదకారులనుకొన్న ఖైదీలను ఒంటరి గదిలో నిర్బంధించేవారు. బయట

ప్రపంచంతో వారికెటువంటి సంబంధం లేకుండా చూసేవారు. తిరుచునాపల్లి జైలులో తనను 8 అడుగుల పొడవు 5 అడుగుల వెడల్పు గల ఒంటరిగదిలో ('సెల్')లో నిర్బంధించినట్లు రామచంద్రరాశారు. 'సి' క్లాసు ఖైదీలు ధరించే దుస్తులు కూడా జైలుదుస్తులే. నేరాలు చేసిన అసాంఘిక శక్తుల తోపాటు గానే 'సి' క్లాసు ఖైదీలుగా పరిగణించి వారికి చారల మోటు బనియనూ, అటువంటిదేదో 'అరలాగూ' ధరించటానికిచ్చేవాళ్ళు. జైలులో కూరగాయలు పండించడానికీ, ముడి ఉన్నిని విడదీసి బేళ్ళు కట్టడానికీ, పీచు వేరు చేసి తాళ్ళు పేనడానికి అనువుగా సిద్ధం చేయడానికి వాళ్ళను నిఘాలోఉంచి పని చేయించే వారు జైలు అధికారులు. నియత వేళల్లోనే ఖైదీలు దేహ బాధలు తీర్చుకోవాలి. స్నానం కూడా జైలు ఉద్యోగుల కాపలాకిందనే చేయాలి. మలమూత్రాలమూకుళ్ళు తామే శుభ్ర పరచుకోవాలి. ఇవన్నీ రామచంద్ర జైలుజీవితంలో అనుభవించారు.

తాను ఆస్తి పాస్తులు కలవాడిననీ, జైలు భోజనం చేయలేననీ విన్నవించుకుంటే సౌకర్యాలు కలుగుతాయని ఆయన మిత్రులూ, హితులూ కొందరూ బోధించినా దేశం కోసం స్వచ్ఛందంగా కష్టపడటానికి నిర్ణయించుకున్నందువల్ల అటువంటి విజ్ఞప్తు లేమీ చేయడానికి ఆయన ఇష్టపడలేదు. 'తెలుగు కన్నడ మలయాళ మహారాష్ట్ర గుజరాత్ వంగ హిందూస్తానీ భాషలతో అదొక చిన్న భారతదేశమేననిపించింది' అన్నారు రామచంద్ర తనజైలు జీవితాన్ని స్మృతిస్తూ. తిరుచునాపల్లి జైలులో ఒక అనుకోని సన్నివేశం తటస్థించింది రామచంద్రకు. జైలులోప్రవేశించగానే హనుమంతరెడ్డి అనే కాన్విక్టు వార్డర్ తనను వెతుక్కుంటూ వచ్చిపరిచయం చేసుకున్నాడు. ఈ హనుమంత రెడ్డిదికూడా బళ్ళారి జిల్లా. ఈ హనుమంత రెడ్డి యావజ్జీవకారాగార వాస శిక్షకు గురిఅయి కొన్ని సంవత్సరాలు అండమాన్ కారాగృహంలో ఉండి శిక్షననుభవించి తరువాత భారతదేశంలో మరికొన్ని జైళ్ళలో ఉండి ఇప్పుడు తిరుచునాపల్లి జైల్లో శిక్షాకాలం పూర్తి చేసుకుంటున్నాడు. అతడప్పటికే పదేళ్ళుగా కారాగారవాసం అనుభవిస్తున్నాడు. జైలు జీవితంలో సత్ప్రవర్తనచూపితే, వాళ్ళు కొంచెం చదువుకున్నవాళ్లు కూడా అయితే అటువంటి వాళ్ళను జైలు ఉద్యోగకులకు సహాయకులుగా తోటిఖైదీలపై

అజమాయిషీకి నియమించి తక్కిన ఖైదీలకు ఆదర్శంగా చూపిస్తారు జైలు అధికారులు. హనుమంత రెడ్డి చాటుమాటుగా అవీ ఇవీ సౌకర్యాలు, అవసరాలు తీరుస్తానన్నా రామచంద్ర ఒప్పుకోలేదు.

రామచంద్ర ప్రవర్తనను మెచ్చి జైలు అధికారులు ఆయనను ఒంటరిగదినుంచి విశాల మైన హాలు లోకి మార్చారు. అక్కడ వరసాగా సిమెంట్ అరుగుల లాంటివి ఉండేవి. సత్యాగ్రహ ఖైదీలంతా ఒకేచోట కాలం గడపవచ్చు. తర్వాత స్వతంత్రభారతదేశంలో ఎంతో ప్రసిద్ధికెక్కిన కామరాజ నాడర్ రామచంద్ర పక్కన ఉండే సిమెంట్ దిమ్మపైనే జైలు జీవితం గడిపిన వైనం రామచంద్ర రాశారు.

రాజమండ్రి దగ్గర సీతానగరం సత్యాగ్రహాశ్రమం నుంచి వచ్చిన బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, సోషలిస్టు భావ విప్లవ వీరుడు మద్దూరి అన్నపూర్ణయ్య, ప్రసిద్ధ డాక్టరు పాలకోడేటి గురుమూర్తి ప్రభృతులు తోటి సత్యాగ్రహ ఖైదీలుగా ఉండేవారని రామచంద్రరాశారు. మద్దూరి అన్నపూర్ణయ్య తనచిన్నప్పటి సహాధ్యాయి అయిన అల్లూరి శ్రీరామచంద్రరాజుగారిని గూర్చిన, ఆయన వీరగాథలకు సంబంధించిన ఎన్నో చిత్రచిత్ర మైన కథలు చెపుతుండేవారని రామచంద్రరాశారు. జిల్లా మెడికల్ ఆఫీసరైన కల్నల్ తాడేపల్లి శంకరశాస్త్రి గారు అప్పుడప్పుడు జైలు లోని ఖైదీల ఆరోగ్యపరీక్షానిమిత్తం వస్తుండే వారట. వారు తనను అభిమానంగా చూసేవారని రామచంద్రగుర్తుచేసుకున్నారు. అప్పట్లో జైలు సూపరింటెండెంట్ ఐరిష్ జాతీయుడు కాబట్టి జైలుఖైదీలను కొంత సానుభూతితో చూసేవాడని రామచంద్రరాశారు. కొంత స్వేచ్ఛ ఉండేది జైలు జీవితంలో అని కూడా ఆయన చెప్పేవారు. అందువల్ల సత్యాగ్రహులు తమ తమ అభిమాన సిద్ధాంతాలను, విషయాలను తోటిఖైదీలతో చర్చించడానికి, బోధించడానికి అవకాశం ఉండేది.

గాంధీజీ సిద్ధాంతాలను అంటే సత్యాహింసలను త్రికరణ శుద్ధిగా నమ్మిన వాళ్లూ, యథాశక్తి పాటించేవాళ్ళూ మాత్రమే కాకుండా ఆ సత్యాగ్రహ ఖైదీలలో విప్లవ పంథా అనుయాయులుకూడా కొందరుండేవారనీ వారి బోధలు వినివినీ తన మనసుకూడా సాయుధ పోరాటం వైపు మొగ్గుచూపిందనీ రామచంద్ర తనజైలు జీవితోదంతాలలో రాశారు.

విప్లవ పంథాను, వామపక్షసిద్ధాంత భావజాలాన్ని ప్రచారం చేసే, ప్రబోధించే

ముగ్గురు బెంగాలీ సత్యాగ్రహులుండేవారనీ వాళ్ళుప్రతూల్ చంద్ర గంగూలీ, జీవనలాల్ చటర్జీ, సురేంద్ర మోహన్ ఘోష్ లనే వారనీ, మొదటి ఖైదీ సైన్యంలో పనిచేస్తూ సైనికులలో స్వాతంత్ర్యోద్యమ భావబీజాలు నాటడానికి ప్రయత్నించి శిక్షననుభవిస్తున్నాడనీ, జీవనలాల్ ఛటర్జీ పెద్ద భూస్వామిఅయిఉండిన్నీ సామ్యవాద సాయుధ పోరాటం పట్ల ఆకర్షితుడై జైలుకు వచ్చాడనీ, సురేంద్రమోహన్ ఘోష్, అరవిందుడి కార్యదర్శిగా పనిచేసిన వాడు, గొప్ప విద్వాంసుడు, రవీంద్ర సాహిత్యాభిమాని అనీ రామచంద్ర రాశారు. వీళ్ళే కాకుండా ప్రతూల్ చంద్రగంగూలీ బటకేశ్వరదత్ అనే వాళ్ళు, స్వయంగా విప్లవ కార్యక్రమాలలో పాల్గొన్నవారూ ఉండే వారనీ, వీళ్ళు తక్కిన ఖైదీల మనస్సులు సాయుధవిప్లవం వైపు మళ్ళించే ప్రయత్నం చేసేవారనీ రామచంద్ర జైలు జీవితోదంతస్మరణంలో చెప్పారు. ప్రతూల్ చంద్ర మీరట్ కుట్ర కేసులోని నిందితుడు, బటకేశ్వర్‌దత్ 20 సం.ల శిక్షననుభవించాల్సిన విప్లవఖైదీ. వీళ్ళ బోధలు, తర్కసమ్మతమైన వాదనలు తలకెక్కి ఆవేశోద్రేకాలతో, సత్వరస్వాతంత్ర్య సిద్ధికోసం, విప్లవ మార్గమే ఉపాదేయమని పరితపించేలా తన భావాలు మారిపోయినాయని రామచంద్ర చెప్పుకున్నారు. ఈ విప్లవమార్గ ప్రబోధకుల సగటు వయసు 40,45 సం.లుండవచ్చునని వీళ్ళంతా గొప్పవిద్వాంసులనీ, సిద్ధాంతావగాహనకల వాళ్ళనీ రామచంద్ర అభివర్ణించారు. అప్పట్లో భగత్‌సింగ్ ఉరిశిక్ష దేశాన్నంతా కలచివేసింది.

ఏడాదిశిక్షాకాలం పూర్తి కాకుండానే రామచంద్ర విడుదలైనారు ఆనాటి రాజకీయ పరిణామాలవల్ల. కమలాపురం నుంచి ఆయనకు లేఖ వచ్చింది. జైలు శిక్షననుభవించినవారు ప్రాయశ్చిత్తకర్మ నాచరించాలనీ, కావేరీ స్నానం, శ్రీరంగనాథ దర్శనంతో ఆ ప్రాయశ్చిత్త కర్మకాండ పూర్తి అవుతుందనీ ఆ లేఖ సారాంశం. ఆ విధంగానే రామచంద్ర శ్రీరంగ నాథుణ్ణి దర్శించుకున్నారు. జైలులో కాయకష్టం చేసినందుకు రామచంద్రకు జైలు అధికారులు 20. రూ.లు ప్రతిఫలం ముట్టచెప్పారు. స్వస్థలం చేరడానికి రైలు ప్రయాణానుమతిని ధ్రువీకరించారు. రామచంద్ర కమలాపురం వెళ్ళి కుటుంబాన్ని దర్శించారు. అప్పుడాయన వయస్సు 20 సం.లు. చదువు అర్ధాంతరంగా కడతేరింది. ఆయన తిరుపతి వెళ్ళి కళాశాల

పునఃప్రవేశంకోసం అర్థించగా అది సమకూడలేదు. సతీర్థులు చందాలు వేసుకొని 25 రూ.లు ప్రేమాభిమానాలతో అందజేసి నెల్లూరు వెళ్ళి అక్కడ వేద సంస్కృత కళాశాలలో వ్యాకరణ శిరోమణికోర్సు పూర్తి చేయవలసిందిగా సలహా చెప్పారు, ప్రోత్సహించారు.

తిరుచునాపల్లి జైలులో సాయుధ విప్లవ భావాల పట్ల తనలాగే ఆకర్షితులైన ఆళ్ళ బాలకృష్ణారెడ్డి, పట్టాభిరామిరెడ్డి, మైపాడు బలరామిరెడ్డి, బుచ్చిరెడ్డిపాలెం అనంతరామ అయ్యంగార్ మొదలైన మిత్రులు నెల్లూరు చుట్టు పక్కలగ్రామాలవాళ్ళే. జైల్లో ఉండగానే విప్లవ కార్యక్రమమేదో కట్టుదిట్టంగా నిర్వహించడానికి ఈ మిత్రులంతా రహస్యంగా ఒప్పందం చేసుకున్నవాళ్ళే. అందువల్ల నెల్లూరు ప్రయాణం రామచంద్రకు ఆకర్షకమైంది. ఆయన నెల్లూరు వెళ్ళారు. అక్కడి వేదసంస్కృతకళాశాల పాలకవర్గంలో గొప్ప ప్లీడర్ల సహాయంతో కళాశాలలో చేరారు. విప్లవ కార్యక్రమానికి కావలసిన ధన సదుపాయంకోసం దోపిడీలు నిర్వహించడంలో కూడా ఒకటి రెండుసార్లు మిత్రులకు రామచంద్ర తోడ్పడ్డారు. భగత్‌సింగ్ అనుయాయులను అండమాన్ పంపటానికి మద్రాసు తరలిస్తున్నారని విని ఆ రైలును ఆపి, వాళ్ళను తప్పించుకొని పోయేట్లు చేయటానికి పథకం సిద్ధంచేసుకున్నారు. అందుకవసరమైన వ్యూహరచన చేశారు. పిస్తోళ్ళు, చురకత్తులు, రివాల్వర్లు సంసిద్ధం చేసుకున్నారు. రాత్రుళ్ళంతా చర్చించుకునేవారు. నెల్లూరు పెద్దల సాయంతో స్వయంపాకుల వారి సత్రంలో నివాసానికి ఒకగది సంపాదించుకున్నారు రామచంద్ర. ఆయన గదిలోనే ఈ రహస్యకార్యకలాపాలన్నీ సంభవించేవి. కళాశాలల తరగతులకు హాజరవుతూ, అత్యంత నిష్ఠాపరుడిగా, సదాచారుడిగా లోకులనునమ్మిస్తూ విప్లవపంథా అనుయాయులకు సహకరించే వాణ్ణని రామచంద్రే తన జీవనోదంతాలతో చెప్పుకున్నారు.

'అయ్యవారా! నీవు తొండరడిప్పొడి ఆళ్వారులాగ ఉన్నావు (విప్రనారాయణ) నిన్ను ఎవరూ అనుమానించరు. గదిసోదాచేయరు. భయపడమాకు' అని దిటవు కలిగించేవాళ్ళు మిత్రులు అని స్వీయచరిత్రలో చెప్పారు రామచంద్ర. ఈ విధమైన హింసామార్గాచరణం ఆయన అంతఃకరణను బాధిస్తూనే ఉండేది. అయితే ఆయన

మిత్రులకు బందీఅయిపోయినాడు. మద్రాసు వెళ్ళే రైలును కావలి – బిట్రగుంట మధ్య దరిదాపుల్లో ఆపి భగత్‌సింగ్ అనుయాయులను తప్పించి సంరక్షించే పథకం విఫలమైంది. అదీ కాక వేదసంస్కృత కళాశాలలో చదవడంలో చిక్కులు కలిగాయి. అప్పటికి రామచంద్ర సాహిత్య శిరోమణి మొదటి సంవత్సరం మంచి మార్కులలో కృతార్థుడైనా ప్రిన్సిపాల్ రెండో సంవత్సరం అదే కోర్సులో చదవడానికి అంగీకరించలేదు. ఈ విధంగా రామచంద్రకు సమస్యలు ఎదురైనాయి. నెల్లూరు జీవితం కూడా సాఫీగా సాగటంలేదు. అందువల్ల చెన్నపట్నం వెళ్ళి అక్కడి మైలాపూర్ సంస్కృత కళాశాలలో ప్రవేశం సంపాదించి చదువు పూర్తి చేసుకుందామనుకున్నారు. మద్రాసు ప్రయాణమై సంస్కృత కళాశాలకు వెళ్ళగా అక్కడ తిరుపతిలో తనతో చదువుకొన్న మిత్రులు కన్పించి ఎంతో ఆదరించారు. చాలా ఆనందించారు. కళాశాల తరగతిలో ప్రవేశందొరికినా హాస్టలులో భోజన వసతిలభించలేదు. అయినా ఎట్లానో ఓర్పుతో కళాశాల తరగతులకు హాజరవుతుండగా ఒక రోజున పోలీసధికారి పార్థసారధి అయ్యంగార్ కళాశాలకు వచ్చి రామచంద్రను తన వెంట పోలీసు కమీషనర్ దగ్గరకు తీసుకొని వెళ్ళాడు. అప్పటికే పట్టాభి రామరెడ్డి పోలీసు నిర్బంధంలో ఉండి ప్రభుత్వానికి అనుకూలంగా నెల్లూరులో విప్లవకారుల ముఠా తలపెట్టిన రహస్య కార్యకలాపాల చిట్టా బయటపెట్టటంతో, రామచంద్రను ప్రాసిక్యూషన్ తరఫున మొదటిసాక్షిగా ఎంచుకోవడంతో పోలీసులు అతడికి రకరకాల ఆశలు కల్పించారు. కుట్ర కేసును సమర్థంగా నిరూపించి విప్లవ కారులకు శిక్షలు పడేట్లు చూడాలని పోలీసుల వ్యూహం. తిరుచిరాపల్లి జైలులోని 20,25 మంది ఖైదీలపై ఈ కుట్రకేసు మోపారు పోలీసువారు. తమిళ, మలయాళ, కన్నడ ప్రాంతాల సత్యాగ్రహులూ, ఆంధ్ర ప్రాంతంనుంచి పెద్దకుటుంబాలకు చెందిన సత్యాగ్రహులు కూడా కొందరు ఇందులో చిక్కుకున్నారు. దక్షిణాది అంతటా పెద్ద సంచలనం సృష్టించింది ఈ కుట్రకేసు. సత్యాగ్రహోద్యమాభిమానులు, స్వాతంత్ర్యోద్యమ ఉత్తేజితులు అందరూ ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారిని ఆశ్రయించారు. సతాగ్రహులపై ఈ కుట్రకేసు వీగిపోయేట్లు ఈ కేసును చేపట్టివలసిందిగా ఆయనను ప్రార్థించారు. ఆ కుట్రకేసు

నిందితుల పక్షాన వాదించటానికి ప్రకాశం పంతులుగారంగీకరించారు. పదేళ్ళ కిందట ఎప్పుడో వదులుకున్న న్యాయవాదవృత్తిని మళ్ళీ స్వీకరించారు. ఒకప్పుడు ఆయన దగ్గర జూనియర్‌గా పనిచేసిన బచ్చుజగన్నాథదాసు, ఆయన మిత్రులైన న్యాయవాది బృందమూ ఈ కేసులో పోలీసులు పరాభూతులయ్యేట్లు పట్టుదలతో పని చేశారు. ఈ కుట్రకేసు విచారణ కోసం ఏర్పాటైన ప్రత్యేక కోర్టు మేజిస్ట్రేట్ ప్రకాశం పంతులుగారి వాద బలం ముందు తెల్లమొగం వేసి కుట్రకేసును కొట్టివేశాడు. 1933 సెప్టెంబరు 8వ తేదీన ఈ కుట్రకేసు ప్రథమంగా విచారణకు వచ్చింది. ఆ రోజే ప్రకాశం పంతులు కోర్టు వారిని, పోలీసు వారిని గడగడ లాడించాడు.

ఈ కేసు మూడునాలుగు నెలలు నడిచింది. ఈ కేసు పర్యవసానంగా రామ చంద్రకు మద్రాసుకు నగరంలో నిలువనీడ లేకపోయింది. ఆయన నీడచూసే బంధువులు మిత్రులూ భయపడ్డారు. ఆకలితో, వేసటతో ఆయన చాలా అలమటించారు.





# 7. చెన్నపురి ప్రాచ్యలిఖితగ్రంథాలయం

మద్రాసు కుట్రకేసు పత్రికల నిండా బాగా వార్తకెక్కింది. మూడు నాలుగు నెలలు ఉత్సుకతతో పత్రికావార్తాభిలాషులు సాంగోపాంగంగా ఈ కుట్రకేసును చదువుతూ వచ్చారు. పత్రికలలో ఈ కుట్రదారుల ఫొటోలు కూడా వచ్చాయి.

రామచంద్ర చేతిలో ఎర్రని ఏగాని లేదు. ఆయన మిత్రులు కూడా అప్పటికి చదువు కుంటున్న విద్యార్థులే. బంధువులింటికి వెళితే వాళ్ళు ఈసడించారు. భయపడ్డారు. మా ఇంటి చుట్టుపక్కల మీ పొలకువతెలిస్తే పోలీసులు మా ఇంటిపై దాడి చేస్తారు. నిఘా ఉంచుతారు. అని ఆయన మొగాన్నే అన్నారు. ప్రత్యక్షంగా పరోక్షంగా తమ ఇళ్ళకు రావద్దు అని సంకేతాలు పంపారు. అప్పుడాయనకు ఏమి చేయడానికి పాలు పోలేదు. తినడానికి తిండీ, ఉండటానికి గూడూ లేకుండా ఎట్లా ఎన్నాళ్ళు తాను మనగలడు? అని నిర్వేదం కలిగింది. సముద్రతీరానికి వెళ్ళి దీర్ఘంగా ఆలోచించాడు. జేబులో రెండు కానులు మాత్రం ఉండగా రెండు ఇడ్లీకొనుక్కొని తిన్నాడు. అలా బాగా రాత్రి పొద్దు పోయిందాకా ఆ సముద్రసికతాతీరంలోనే గడిపాడు. అన్ని సమస్యలకు పరిష్కారం, సమస్తవేదనలకు సత్వర ఉపశాంతి ఆత్మహత్యే మేలు అనుకున్నాడు. క్రమంగా సముద్రంలోకి దిగి అలలను తోసుకుంటూ ముందుకు వెళుతుండగా ఇంతలో రాత్రి గస్తీ తిరిగే పోలీసులు ఇద్దరు వచ్చి రామచంద్రను పట్టుకొని తీరం

ఇవతలకు లాక్కోని వచ్చారు. చావడానికి కూడా నాకు స్వేచ్ఛలేదా? అని వాళ్ళమీద గింజుకున్నాడాయన. నడునడు పోలీస్‌స్టేషన్‌కన్నారు వాళ్ళు. తాను ఏదైనా హోటల్ లో పనిచేసుకుందామని మద్రాసు వచ్చాననీ ఎక్కడా పని దొరకక నిరాశా నిస్పృహలతో ఇటు వచ్చాననీ చెప్పుకున్నారు రామచంద్ర. వాళ్ళు ఆయన దైన్యాన్ని, కులాన్నీ కనిపెట్టి దయ తలచి ఒక సలహా చెప్పారు. 'వీధి అరుగుల మీద ఎక్కడా విశ్రమించవద్దు. పార్థసారథి కోవెల మండపాలలో దేనిలోనో ఈ రాత్రి గడిపి ఉదయమే మళ్లీ ఏహోటల్‌లోనైనా పరిచారకుడిగా పనికోసం ప్రయత్నించవలసింది'గా బోధించి వదిలిపెట్టారు. ఆ రాత్రి రామచంద్ర పార్థసారథి కోవెల మండపంలో గడిపాడు. పొద్దున్నే వీథికొళాయి వద్ద స్నానం ముగించి దైవదర్శనం చేసుకుందామని గుళ్ళోకి వెళ్ళాడు. ఆవాళ ఏదో ఉత్సవం జరుగుతున్నది. ఆయన చేతుల్లో పెద్ద ప్రసాదం ముద్ద పెట్టారు అర్చకులు. అది తిని కడుపునిండా నీళ్ళు తాగి కాలినడకనే ఆంధ్రపత్రిక ఆఫీసుకి బయలు దేరాడాయన. అక్కడ ఎవరినైనా పెద్దలను దర్శించి తన గోడు వెళ్ళబోసుకోవచ్చునని ఆయన ఊహ. అనుకోకుండా ఆయనకక్కడ తిరుమల వేంకటరంగాచార్యుల వారు తటస్థ పడ్డారు. ఈ వేంకటరంగాచార్యుల వారే రామచంద్ర ఆనెగొందిలో చదువుతున్నప్పుడు వచ్చి తిరుపతి సంస్కృతకళాశాల వైపు రామచంద్ర ఆసక్తిని ధృడపరచినవారు. అప్పుడు రామచంద్ర వయసు పదేళ్ళు. ఇప్పుడు ఇరవైఏళ్ళు. అంటే సుమారు 10 ఏళ్ళుగా ఆయనను రామచంద్ర చూడనేలేదు. రామచంద్రను చూసి వేంకటరంగాచార్యులవారు కూడా చాలా ఆశ్చర్యపడ్డారు. ఆయన అప్పుడు కాశీనాథుని నాగేశ్వరరావు గారి భారతి సాహిత్య మాసపత్రికలో పనిచేస్తున్నారు. రామచంద్ర ఆయనతో తన పరిస్థితిని తెలుపుకున్నారు. అప్పుడు వేంకట రంగాచార్యుల వారు తాము పరుశువాకంలో ఉంటున్నామనీ తనతోపాటు ఉండి కొద్దిరోజులపాటు రామచంద్ర తలదాచుకోవచ్చుననీ భరోసా ఇచ్చారు. ఆంధ్ర పత్రికపై నిత్యనిరంతరం పోలీసుల నిగా ఎలాగూ ఉంటున్నదే కాబట్టి తనకు సంకోచం ఏమీలేదని కూడా ఆయన అభయమిచ్చారు. మొలబంటి కష్టాలలో మోకాలిబంటి ఉపశమనంలాగా రామచంద్రకీ అవకాశం కొంత ఊరట కలిగించింది. అయితే రామచంద్ర కదలికలపై వేంకటరంగాచార్యులవారు కొన్ని నిబంధనలు విధించారు. ఆయన మిత్రుల ఇళ్ళకు తరచు వెళ్ళటంకాని, బయట ఎక్కడా తిరగడం కాని చేయకూడదనే రంగాచార్యులవారి ఆంక్ష.

కాని గృహనిర్బంధం ఎట్లా సహించటం? రామచంద్ర అప్పుడప్పుడు మిత్రులను చూడటానికీ, వార్తా సంగ్రహణం కోసమూ బయటకు వెళుతుండేవారు. ఆయన

కదలికలను కూడా పోలీసులు కనిపెడుతూ కనపడని ఛాయలాగా వెన్నాడుతూనే ఉండేవారు. అప్పటికింకా మద్రాసుకుట్ర కేసు విచారణ పూర్తి కాలేదు. నిందితుల, సాక్షుల వాఙ్మూలాలు రికార్డు చేసేందుకు, న్యాయవాదుల వాదాలు మేజిస్ట్రేట్ వినేందుకు ఎంత కాదన్నా మూడు నెలలైనా పట్టవచ్చు, కాబట్టి యీమూడు నెలలు ప్రవాసం అని రంగాచార్యుల వారు రామచంద్రకు చెప్పారు. ఆయన పత్రికలో పని చేస్తున్నారు కాబట్టి ఎప్పటి వార్తలప్పుడు తెలుస్తూనే ఉంటాయి.

రామచంద్ర యీ నిబంధనను, నిర్బంధాన్ని పాటించలేకపోయినారు. ఆయన తన సాక్ష్యంలో పోలీసులను బోల్తాకొట్టించినందువల్ల వారికి రామచంద్రపై ఆకంఠం ఆగ్రహంగానే ఉంది. కేసు ఇంకా నడుస్తూనే ఉంది. బచ్చు జగన్నాథదాసుగారి న్యాయవాదసహాయక బృందంలో ముఖ్యుడైన పి.రామమూర్తి కాళ్ళీడ్చుకుంటూ రంగాచార్యుల వారి బసకు వచ్చి రామచంద్రతో మంతనాలు జరుపుతూనే ఉన్నాడు. ఇదంతా రంగాచార్యుల వారికి బయటకు వెళ్ళగక్కలేని వై మనస్యం రామంచద్రపట్ల సృష్టించింది. రంగాచార్యులకు హోటల్ నుంచి కారియర్ వచ్చేదిరోజూ. దాంట్లోనే రామచంద్రకు భాగం ఇచ్చేవారు. ఒకరోజున నీవు ఇక్కడ నుంచి దయచేయవచ్చు నని సంకేతంగా కారియర్‌లో అన్నం లేకుండా చేశారు, రామచంద్ర పొద్దుపోయి రాత్రి ఇంటికి వచ్చేవేళకు. రామచంద్రకు మనసు చివుక్కుమంది. మర్రోజు ఉదయమే తనకు అత్యంత ముఖ్య స్నేహితుడిదగ్గర 5 రూపాయలు తీసుకొని ఆయన హోసపేట రైలెక్కాడు. అయితే అక్కడకు పోయి మాత్రం ఆయన చేసేదేముంది. బళ్ళారి స్టేషన్‌లో దిగి ధర్మవరంవారి బంగ్లావైపు వెళుతుండగా పోలీసు ఒకరు వెంటపడిపట్టుకొని స్టేషన్‌కు తీసుకొని పోయినాడు. పోలీసులు తనను వెంటాడుతున్నారని రామచంద్ర గ్రహించాడు. తాను కమలాపురం వెళ్ళలేదు. అక్కడ వాళ్ళెవరూ తన రాక హర్షించరు. తాత, తండ్రి శుద్ధ అహింసా వాదులు. పూర్తిగా గాంధీ మార్గానుసారులు. తమకుమారుడికీ తమకూ ఎలాంటి సంబంధమూ లేదని వాళ్ళప్పటికే జిల్లా అధికార యంత్రాగానికీ ముఖ్యంగా పోలీసువర్గానికీ తెలియజేశారు. కమలాపురం వెళ్ళటానికికాని, అక్కడి బంధువర్గాన్ని చూడటానికి కాని ససేమిరా అయనకు మనస్కరించలేదు. డోలాందోళన మనస్సుతో బస్‌స్టాప్‌లో తిరుగుతుండగా ఒక ప్రముఖ వ్యక్తి కన్పించి కమలాపురం రావల్సిందిగా ఆహ్వానించినా రామచంద్రకు విమనస్కతకలిగింది. ఆయన మనశ్చాంచల్యంతో ధార్వాడ రైలెక్కాడు. అక్కడ మాత్రం చేసేదేముంది. పోలీసులు పట్టుకొని ఆ ప్రాంతాలలోనే తనను జైల్లో ఉంచితే కుటుంబానికి దుఃఖక్లేశం, అవమానం, పరితాపం కలిగించినవాడవుతాడు. కాబట్టి ధార్వాడనుంచి ఆయన తిరుగు రైల్లో

మద్రాసు చేరాడు. అయితే పూట గడవటంఎట్లా? తలమీద ఆచ్ఛాదన ఏది?

రైల్వే స్టేషన్‌లోనే స్నానం సంధ్యా పూర్తిచేసి 'కింకర్తవ్యం'? అని యోచిస్తుండగా తనకు నెల్లూరులో పరిచయమై తన నెంతో అభిమానించిన ఒక మహిళ గుర్తుకు వచ్చింది. ఆమె ఇప్పుడు అన్ని విధాల సుఖసంసారం చేస్తున్నది. తిన్నగా అక్కడకు వెళ్ళాడు రామచంద్ర. న్యాయానికి ఆమె రామచంద్ర ఇల్లాలు కావల్సి ఉండె. కాని దారం తెగిన గాలిపటంలాంటి తన జీవితంలోకి ఆమె ప్రవేశించటానికి రామచంద్ర ఇష్టపడలేదు. అదొక ఆర్ద్రమైన గాథ. ఆమెపేరు కోమల. తర్వాత ఆమెకు పెళ్ళై హాయిగా కాపురం చేసుకుంటున్నది. వాళ్ళిప్పుడు మాంబళంలో ఉంటున్నారు.

రామచంద్రకు 30 రూపాయలిచ్చి నమస్కారం చేసిందామె. అదృష్టవశాత్తూ పరశువాకం శరవణ మొదలి వీధిలో ఆయనకు అద్దె గదిదొరికింది. ఇంటి వాళ్ళు బయానా కూడా అడగలేదు. అద్దె 2రూపాయలు నెలకు. ఆ సంతోషంతో ముందుగానే అద్దె ఇచ్చేశాడురామచంద్ర. అక్కడకు దగ్గరలోనే ఉన్న పంకజవిలాస్ హోటల్‌లో 7 రూ.లకు నెలకు రెండుపూటలకు సరిపడా భోజనం టికెట్లు కొనేశాడు. ఇక నిర్విచారం అని నిట్టూర్చాడాయన.

మర్రోజు ఆయన ఇంట్లో రికామిగా ఉండలేక ఎగ్మూరులో మ్యూజియం చూసి వద్దామని వెళ్ళాడు. అప్పట్లో ప్రాచ్యలిఖితభాండాగారం మ్యూజియం ఆవరణ క్షేత్రంలోనే ఉండేది. మ్యూజియంలో అమరావతి స్తూపం నుంచి భద్రపరచిన బౌద్ధశిల్పాలు రామచంద్ర పరిశీలిస్తుండగా ఎవరో అపరిచిత వ్యక్తి 'ప్రాచ్యలిఖిత గ్రంథాలయం' ఎక్కడో చెపుతారా? అని రామచంద్రను అడిగారు. అడిగి ఆపైనేం తెలుసుకోకుండా, వెళ్దాంరండి అని రామచంద్రను కూడా ఆ 'మాన్యుస్క్రిప్ట్' లైబ్రరీకి తీసుకొని వెళ్ళాడు. అక్కడ బులుసు వెంకటరమణయ్య గారితో పరిచయమైంది రామచంద్రకు. ఇటువంటి ప్రాచ్యలిఖిత పుస్తకాలయం ప్రపంచంలోనే ఇంకొకటి లేదు. ఆ లైబ్రరీలో 30 వేల గ్రంథాలున్నాయి. దక్షిణాది భాష లిపులు, దేవనాగరి, గ్రంథలిపులలో సహస్రాధికంగా తాటాకు వ్రాత ప్రతులున్నాయి. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు ఆ తాటాకు వ్రాత ప్రతుల గ్రంథాలయంలో తెలుగు వ్రాత ప్రతులు పరిశీలించే పండితులు. ఆయన శెలవులో ఉన్నందువల్ల బులుసువారు తాత్కాలికమైన ఖాళీలో పనిచేస్తున్నారు.

రామచంద్ర జీవితంలో ఆయనను నడిపించినవన్నీ యాదృచ్ఛిక సంఘటనలే. అనూహ్యమైన సన్నివేశాలే. అడిగిరాని వరాలే. వెంకటరమణయ్యగారితో పరిచయమే తన జీవితానికి గొప్ప పాథేయమైందని రామచంద్ర స్వీయ జీవనోదంతాలలో స్మరించుకుంటారు. తిరుమల వేంకటరంగాచార్యుల వారికి

కూడా ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో రామచంద్రకు ఏదైనా పని దొరుకుతుందేమోనని ఆశ ఉండేది. భారతి సాహిత్య మాసపత్రిక కార్యస్థానానికి వెళ్ళినపుడొకసారి బులుసువారితో రంగాచార్యుల వారా ప్రస్తావనకూడా చేశారు. రామచంద్రను వారే (రంగాచార్యులు) పంపించారేమోనని కూడా అనుకున్నారు బులుసువారు. వ్రాతప్రతుల గ్రంథాలయంలో రామచంద్రకు పని లభించింది. అనుకోకుండా గుజరాత్‌లోని గోండా సంస్థానం నుంచి ఒక ఆయుర్వేదాచార్యుడు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారానికి వచ్చి తెలుగు, తమిళ, మలయాళ భాషలకు చెందిన ఆయుర్వేద గ్రంథాలన్నీ తనకు నాగరలిపి ప్రత్యంతరాలు కావాలని గ్రంథాలయ నిర్వాహకుల నర్థించాడు. తమిళ గ్రంథాలు గ్రంథలిపిలో ఉండేవి. ఆ లిపి రామచంద్రకు తెలుసు. గోండా నుంచి వచ్చిన పెద్దమనిషి ఒక్కసారిగా 7, 8 వందల రూపాయల గ్రంథాలయాధికారివద్ద న్యాసంగా ఉంచాడు. రామచంద్ర జీవితం ఒక గాడిన పడినట్లే. ఆ రోజుల్లో నెలకు 20 రూపాయలుంటే జీవితం ఒంటరి మనిషికి హాయిగా గడచిపోయేది. నెలకు 20,25 రూపాయలరాబడితో సంతృప్తిపడి రామచంద్ర వ్రాతప్రతుల నుంచి ఎత్తిరాస్తూ తన గ్రంథ పఠనాభిలాషను, జ్ఞానతృష్ణను తీర్చుకో సాగాడు. ఎన్నెన్నిగ్రంథాలో ఆయనక్కడ చదివారు. జీవితం ఒడిదుడుకులు లేకుండా సాగిపోతున్నది. ఇంతలో ప్రభాకర శాస్త్రి గారు తమ స్థానంలోకి వచ్చారు. వారితో గురుశిష్యసంబంధం ఏర్పడింది రామచంద్రకు.





# 8. లాహోర్ పయనం

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో తనను పరిచయంచేసుకున్నప్పుడే బులుసు వెంకటరమణయ్య గారికి రామచంద్ర తన కథంతా చెప్పారు. శెలవు నుంచి వచ్చిన ప్రభాకరశాస్త్రి ఆకథంతా విన్నారు. అందువల్లప్రభాకరశాస్త్రిగారు రామచంద్రను వినోదంగా వీరభద్రాచార్యులు అని పిలుస్తుండేవారు. మర్యాదాపురుషోత్తముడైన శ్రీరాముడి పేరు పెట్టుకొని కూడా విధ్వంస సృష్టికర్త అయిన వీరభద్రుడిలా ప్రవర్తించాడు, సాయుధ విప్లవమార్గంలో నడచుకొన్నాడు రామచంద్ర అని శాస్త్రిగారి పరిహాసపు కినుక. రామచంద్ర నాయన ఎంతో అభిమానించారు. వైష్ణవులు ఎంతో సౌమ్యంగాప్రపత్తి మార్గంలో ఉండాలికాని వీర శైవుల్లాగా ఆవేశపథాల్లో సంచరించడం మంచిదేనా అని శాస్త్రిగారి పరిహాస ప్రవణత కావచ్చు రామచంద్ర పట్ల. ఆయన అన్నివేళలా రామచంద్రను వీరభద్రాచార్యులూ అనే ప్రస్తావించేవారు.

ప్రాచ్యలిఖిత భాండాగారంలో రామచంద్ర జీవిక సుగమంగానే సాగిపోతున్నది. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి యోగశిష్యబృందమూ, ఆయనసాహితీ మిత్రులు కూడా రామచంద్రను ఎంతో అభిమానించేవారు. విస్సా అప్పారావుగారు తర్వాత రోజుల్లో శాస్త్రి గారి వియ్యంకులైనారు. ఆయనతో కూడా చనువు ఏర్పడింది రామచంద్రకు. ప్రాచ్య భాషా పండితులుగా గుర్తింపు పొందడానికి మద్రాసు విశ్వవిద్యాలయం అప్పట్లో తెలుగు, సంస్కృతాలలో పట్టభద్రతయోగ్యతకు తుల్యమైన 'విద్వాన్' పరీక్షలు నిర్వహించేది. అయితే ఈ పరీక్ష రాయడానికి అర్హత కనీస వయసు 30 సంవత్సరాలుగా నిబంధన ఉండేది అప్పట్లో. వేటూరి వారితో, విస్సావారితో సాన్నిహిత్యం పెరిగి, వారి ఆదరానికి రామచంద్ర పాత్రుడైన కాలానికి రామచంద్ర వయసు 22 సం.లే. ఆయన విద్వాన్ పరీక్షకు వెళ్ళడానికి వయసు రీత్యా అవకాశం లేదు. అందువల్ల విస్సా అప్పారావు గారు రామచంద్రపట్ల ఎంతో శ్రద్ధతో ప్రేమాభిమానాలతో కనిష్ఠ వయఃపరిమితి 23 ఏళ్ళు అని మార్పించగలిగారు. అందువల్ల 1936లో రామచంద్ర ప్రైవేటుగా తెలుగు, సంస్కృతం విద్వాన్ పరీక్షలో ప్రప్రథములగా ఉత్తీర్ణులైనారు. ప్రభాకరశాస్త్రి గారి సాన్నిహిత్యాన్ని, అభిమానాన్ని విశ్వాసాన్ని పొందారు. వారికోసం సాహిత్య విషయకమైన సమాచారం ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం తాళపత్ర

గ్రంథాలనుంచి సేకరించి ఇస్తుండేవారు. శాస్త్రిగారు సంకలనం చేసిన చాటు పద్యమణి మంజరికి పాతతాటాకు గ్రంథాలనుంచి సమాచారం సేకరించి ఇచ్చారు. శాస్త్రిగారికోసం అనేక తాళపత్ర ప్రతుల నుంచి పాఠాంతరాలు సిద్ధం చేశారు. నన్నెచోడుడి రచనగా భావిస్తున్న కుమార సంభవం ఏకైక తాళపత్ర ప్రతి మాత్రమే తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో ఉంది. అక్కడకు వెళ్ళినప్పుడు దాని నుంచి శాస్త్రి గారికోసం పాఠాలు సిద్ధం చేశారు రామచంద్ర.

అవకాశం ఉన్నందువల్ల రామచంద్ర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఎన్నోగ్రంథాలు చదివి తన జ్ఞాన పరిధిని, భాషాసాహిత్య పాండిత్యాన్ని ఎంతో విస్తృతం చేసుకున్నారు. రకరకాల లిపులతో ఆయనకు అవగాహన ఏర్పడింది.

ఇది ఇట్లా ఉండగా బరోడా మహారాజా గైక్వాడ్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ వారు దక్షిణభాషాలిపులు తెలిసిన పండితులొకరు కావాలని పత్రికల్లో ప్రకటించారు. రామచంద్ర దరఖాస్తు పంపుకోగా ఇంటర్వ్యూ వచ్చింది. కాని బరోడా వెళ్ళడానికి పైకం రామచంద్ర దగ్గర లేకపోయింది. అప్పట్లో మద్రాసు నుంచి బరోడాకు రైల్వే టికెట్ 8రూ. లుండేది. తన ఇంటర్వ్యూ వర్తమానాన్ని చూపి రామచంద్ర శ్రీ ప్రభాకరశాస్త్రి గారిని 8రూ.లు అప్పు అడిగాడు. ఆయనెందుకో ఇవ్వలేదు. ఇవ్వక పోవడమే కాకుండా నీకా ఉద్యోగం రాదని నిరుత్సాహపరిచారు. ఈ ఉదంతం 1937వ సంవత్సరం మొదట్లో జరిగినట్లు రామచంద్రరాశారు. బహుశా వేటూరివారికి రామచంద్ర తమను విడిచి పెట్టి దూరంగా వెళ్ళటం ఇష్టం ఉండి ఉండదు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ద్విపద భారతం ప్రకటించదలచి తాళ పత్రప్రతులు చదివి, పాఠనిర్ణయం చేయగల ఇద్దరు పండితులు కావాలని పత్రికా ప్రకటనం చేశారు. ఆ ఉద్యోగం వచ్చినా రాకపోయినా నష్ట మేముందని రామచంద్ర దరఖాస్తు పడేశారు. ఒకసారి విస్సా అప్పారావు మద్రాసు వచ్చినప్పుడు రామచంద్ర దరఖాస్తు గురించి ప్రసంగవశాన వేటూరి వారు విస్సావారికి చెప్పారు. విస్సా వారు అప్పటి ఆంధ్ర విశ్వ విద్యాలయ కళాశాల ప్రిన్సిపాల్. ఆ ఉద్యోగ నియామకంతో తనకేమీ సంబంధం లేదంటూనే కేవలం ఉబుసుపోకకే తాము రామచంద్రను కుతూహలంతో తెలుగు అంకెలు పుట్టుకను గూర్చి విస్సావారు అడిగారు. రామచంద్ర తన ఊహకందిన అభిప్రాయాలు చెప్పారు. విస్సావారు విశాఖ వెళ్ళిన తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయం అప్పటి తెలుగు శాఖ అధ్యక్షులైన పింగళి వారితో రామచంద్ర అర్హతగూర్చి ప్రస్తావన చేసి ఉంటారు.

రామచంద్రకు ద్విపద భారతం వ్రాతపని కాగితపుప్రతిగా పరివర్తింపజేసే

నియతకాలిక పండిత ఉద్యోగం లభించింది. ఆయనకు కొమ్మనమంచి జోగయ్య శర్మగారిని జతచేశారు. ఇద్దరూ తంజావూరు సరస్వతీ మహల్‌గ్రంథాలయంలో ద్విపదభారతం పాఠనిర్ణయం చేస్తూ ఎత్తిరాసే పనిలో ఒక సంవత్సరం అక్కడ ఉన్నారు. తంజావూరు చుట్టుపక్కల ఉన్న చారిత్రిక ప్రదేశాలు, పుణ్యక్షేత్రాలు అప్పుడు దర్శించారు రామచంద్ర.

రామచంద్ర తంజావూరు సరస్వతీ మహల్ తాళపత్రగ్రంథ ప్రత్యంతరీకరణం పనిలో ఉండగానే పంజాబ్ విశ్వవిద్యాలయం వారు తమ గ్రంథాలయంలో దక్షిణ భాషాలిపులతో ఉన్న గ్రంథాల వివరణాత్మక కేటలాగ్ కూర్చగల పండితులొకరు కావాలని పత్రికాప్రకటన చేశారు. సరస్వతీ మహల్‌లో సంస్కృత పండితుడైన వరదరాజ శర్మ ఈ ఉద్యోగానికి దరఖాస్తు పంపవలసిందని రామచంద్రను ప్రోత్సహించారు. రామ చంద్ర తటపటాయిస్తున్నా వినకుండా ఆయనే అభ్యర్థన పత్రం సంస్కృతంలో రాశాడు రామచంద్ర తరపున. రామచంద్ర సంతకం పెట్టి పోస్టుచేశారు.

ఇంతలో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి జోగయ్య శర్మగారిని విశాఖ వచ్చి స్వస్థానంలో పనిచూసుకోవలసిందనీ, రామచంద్రను మద్రాసులో రంగనాథ రామాయణం పరిష్కరణలో ఉన్న గన్నవరపు సుబ్బరామయ్యగారికి సహాయకుడిగా ఆ పనిలో నిమగ్నం కావలసిందనీ టెలిగ్రామ్ ఉత్తర్వువచ్చింది. కనుక తంజావూరి నివాసం ముగిసింది రామచంద్రకు.

ఆయన వచ్చి గన్నవరపు సుబ్బరామయ్యగారికి రంగనాథరామాయణ పరిష్కరణ ముద్రణ ప్రతిసిద్ధం చేయడంలో సహాయకుడిగా తనపనిలో చేరి పోయినాడు. ఈ విధంగా అనుదినం సుబ్బరామయ్య గారింటికి రాకపోకలు సాగిస్తూ వారికుటుంబంతో చనువుగా సన్నిహితంగా మెలగుతుండడంతో సుబ్బరామయ్య గారి నాలుగో కుమార్తె ఆదిలక్ష్మి గారికీ, రామచంద్రకు మనసులు కలిశాయి. పెళ్ళిచేసుకుందామని కూడబలుక్కున్నారు. సుబ్బరామయ్య దంపతులు అందుకు అంగీకారం తెలిపారు. ఇంతలో రామచంద్ర తండ్రిగారెందుకో మద్రాసు వచ్చారు. అప్పుడు రామచంద్ర యాదృచ్ఛికంగా తన తండ్రిగారిని సుబ్బరామయ్య గారింటికి తీసుకొని వెళ్ళి వారి కుటుంబాన్ని పరిచయం చేశారు. రామచంద్ర అభిప్రాయమేమిటో తండ్రిగారు గ్రహించారు. తండ్రీకొడుకులు మళ్ళీ బసకు తిరిగి వెళుతుండగా తండ్రిగారావిషయం ప్రస్తావించి నీ నిర్ణయం అమ్మకూ నాకూ ఎంతమాత్రం ఆమోదయోగ్యంకాదు, అని సున్నితంగా చెప్పారు. రామచంద్ర చాలామనస్వి, మృదుహృదయులూ, సున్నితమనస్కులు కాబట్టి తండ్రి మాట

శిరసావహించారు.

ఇంతలో పంజాబ్ విశ్వవిద్యాలయం, లాహోర్ నుంచి రామచంద్రకు ఉద్యోగ నియామక వార్త అందింది. మేనెల నుంచి భరించలేని చలి ప్రారంభమవుతుంది కాబట్టి దాక్షిణాత్యుల కది దుస్సహంగా ఉంటుంది కాబట్టి సెప్టెంబర్ కల్లా వచ్చి పనిలో చేరవలసిందిగా విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారులు రామచంద్రకు లేఖరాశారు.

గన్నవరపు సుబ్బరామయ్యగారితో రంగనాథ రామాయణం పరిష్కరణం పనిచూస్తు ఉండగనే మే 7 (1939)న పెళ్ళి ముహూర్తమని రామచంద్రకు తండ్రిగారి నుంచి వర్తమానం వచ్చింది. ఇప్పుడే పెళ్ళిచేసుకోవాలనిలేదని రామచంద్ర సమాధానం రాయగా తన పరువు దక్కించవలసిందని ప్రాధేయపడుతూ తండ్రిగారు టెలిగ్రాం పంపారు.

అనాసక్తంగానే పెళ్ళి చేసుకుని ఆయన తిరిగి వెంటనే మద్రాసు చేరారు. రామచంద్ర వివాహం 1939 మే 7వ తేదీన కర్ణాటక, ఆంధ్ర (తెలంగాణ) సరిహద్దులలో ఉన్న సురపురంలో జరిగింది.

ఆగస్టు 27వ తేదీన రామచంద్ర లాహోర్‌కు ప్రయాణమైనారు. అప్పట్లో మద్రాసు నుంచి ఢిల్లీవరకు మూడు రోజుల రైలు ప్రయాణమట. ఢిల్లీ నుంచి లాహోర్ చేరడానికి ఒక రోజు పట్టేదట. లాహోర్ ప్రయాణానికి ప్రభాకరశాస్త్రి గారి దగ్గర శెలవు తీసుకోవడానికి వారింటికి వెళ్ళగా ఆయనప్పుడు 'తరుణం సర్షపశాకం, నవౌదనం పిచ్ఛిలానిదధీని' (లేతఆవకూర, కొత్తబియ్యపన్నం, గడ్డపెరుగు) అనే శ్లోకాన్ని అర్థ వివరణచేశారుట. అప్పుడు శాస్త్రిగారా పనిలో ఉన్నందువల్ల రామచంద్ర కనపడగానే ఈ ప్రస్తావన వచ్చిఉంటుంది. 'లేత ఆవవేసి పొగిచిన కూర' అని శాస్త్రిగారు అర్థం చెప్పగా, 'లేతావకూర అయి ఉంటుందండీ' అని రామచంద్ర అభిప్రాయపడ్డారట. కాని శాస్త్రిగారికి అది సమ్మతం కాలేదు.

రామచంద్ర లాహోర్ చేరగానే రైల్వేస్టేషన్‌కు ఎదురుగానే ఉన్న 'శుద్ధశాకాహార భోజన' ప్రకటన చూసి ఆ హోటల్‌కు వెళ్ళారు. అక్కడే స్నానం చేసి భోజనానికుపక్రమిస్తుండగా యథాలాపంగా ఉత్సాహసక్తితో ఏమిటి ఆధరువులు? అని అడిగితే భోజనం వడ్డించే కుర్రాడు 'సర్సోంకాసాగ్' (ఆవకూర) అనగానే ఈయనకు ఎక్కడలేని ఉత్సుకోల్లాసం కలిగింది. 'అంటే ఏమిటి, దాని మూలాధారం పట్టుకొ'రమ్మంటే రెండు ఆవ మొక్కలపోచలు తెచ్చాడా హోటల్ పనిమనిషి. గబగబ భోజనం చేసి అక్కడకు దగ్గరలోనే ఉన్న పోస్టాఫీసుకు వెళ్ళి అప్పట్లో

అణామాత్రమే ఖరీదైన ఒక కవరుకొని అందులో రెండు ఆవమొక్కల పచ్చిపోచలుంచి సుదీర్ఘమైన లేఖరాసి శాస్త్రిగారికి పంపి ఎంతో బరువు తీరినంత సంబరపడిపోయానని రామచంద్ర విముగ్ధహృదయంతో 'లావణ్యం ఒలికే లాహోర్' అనే స్వీయ చరిత్ర ప్రకరణంలో రాశారు. ఈ ప్రకరణం గొప్ప ఆసక్తి కరంగా, పరమ సుందరంగా, భావుకమనోహరంగా రాశారు రామచంద్ర. లాహోర్‌ను ఉద్యానవనంగా వర్ణించారు. ఇక్ష్వాకు వంశ ప్రభవిష్ణుడైన శ్రీరామచంద్రుని కుమారుడు లవుడి పేర నిర్మితమైనది ఈ సుందర నగరమని మురిసిపోయినారు. లాహోర్‌లోని పంజాబ్ విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖిత భాండాగారంలో దక్షిణాదిలిపుల వివరణ సూచీకర్తగా ఆయన బాధ్యత స్వీకరించే నాటికి ఆయనకు 25 సం.ల వయస్సు. ఏడేళ్ళు తిరుపతి సంస్కృత కళాశాలలో వ్యాకరణం, సాహిత్యం చదివారు. ఆయుర్వేదం చదివారు. తర్వాత సుమారు రెండేళ్ళు నెల్లూరు సంస్కృత కళాశాల, మైలాపురం మద్రాసు సంస్కృత కళాశాలల్లో చదివారు. మూడేళ్ళు మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో పనిచేశారు. ఎన్నో తాళపత్రగ్రంథాలు సరిచూశారు. మానవల్లి రామకృష్ణకవి, వేటూరిప్రభాకరశాస్త్రి వంటి మహాపండితులవద్ద, పరిశోధకులవద్ద పనిచేశారు. నిత్యనిరంతరోత్సాహశీలి. ఆవయస్సుననే రామచంద్ర మద్రాసు విశ్వవిద్యాలయ సంస్కృతాచార్యులు కున్హాన్ రాజా, సంస్కృత గ్రంథసూచీ వివరణజ్ఞులు డా. వి.రాఘవన్, చరిత్ర శాఖాధ్యాపకులు నేలటూరి వెంకట రమణయ్య గారి వంటి సాహిత్య, చారిత్రక, పరిశోధన రంగ నిపుణుల మెప్పు, విశ్వాసం, పొందారు.

లాహోర్‌లోని పంజాబ్ విశ్వవిద్యాలయానుబంధ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో రెండువేల తాళపత్ర గ్రంథాలున్నాయనీ, తెలుగు, కన్నడ, మలయాళ, గ్రంథ, నందినాగరి లిపులలో ఆ తాళ పత్రగ్రంథాలున్నాయనీ, ఒకటి రెండు గ్రంథాలు కాశ్మీరు పండితులు ఉపయుక్తం చేసే శారదలిపిలో ఉన్నాయన్నారు రామచంద్ర. హెచ్చు భాగం అవన్నీ శ్రుతి, స్మృతిగ్రంథాలు. శ్రీనాథ మహాకవి సమకాలికులైన ఆదివణశఠగోపజియ్యర్ రచించిన వాసంతికా పరిణయం, నిర్దుష్టమైన ప్రతి అక్కడ కనిపించడం చూసి పొంగిపోయినారు. అట్లానే దాశరథి తంత్రం అనే తంత్ర గ్రంథం రెండంగుళాల వెడల్పులోనే 20పంక్తులు ముత్యాల కోవలా తెలుగక్షరాలు కన్పించడం రామచంద్రకు మహదానంద మనిపించింది. పంజాబ్ విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షులు బాలాసహాయ్ శాస్త్రి, సంస్కృత శాఖాచార్యులు లక్ష్మణ స్వరూప్, గ్రంథపాలకుడు లాభూరాం రామచంద్ర నెంతో అభిమానించారు. ఓరియంటల్ కాలేజి ప్రిన్సిపాల్

మహోపాధ్యాయ మాధవశాస్త్రి భండారిజీ, వైదికానుసంధాన సంస్థ అధ్యక్షులు విశ్వబంధు శాస్త్రి, అక్కడి ప్రభుత్వ కళాశాల సంస్కృతాచార్యుడు గౌరీశంకరశాస్త్రి, విశ్వవిద్యాలయ ఆచార్యుడైన డాక్టర్ బనారసీదాస్ జైన్ మొదలైన హేమాహేమీలతో రామచంద్రకు సన్నిహిత పరిచయం కలిగింది. లాహోర్ లో తెలుగు విద్యార్థులెందరో ఉండేవారని రామచంద్ర ముచ్చటగానే చెప్పుకున్నారు. పరమ ఉత్సాహభరితంగా రామచంద్ర తన పనిసాగించారు.

మూడునాలుగు నెలల తర్వాత తాళ పత్ర గ్రంథ ప్రదర్శనం ఒకటి నిర్వహిస్తే చాలాబాగుంటుందని తనపై అజమాయిషీకల సంస్కృత శాఖవారికి సూచించాడు రామచంద్ర. వాళ్ళు ఎంతో సంతోషంతో అంగీకరించారు. రామచంద్ర మద్రాసులో గన్నవరం వారికి వ్రాసి తాళపత్రాల ప్రతులు తయారు చేసే పద్ధతి, వాటి మీదరాసే గంటం ఛాయాచిత్రాలు తెప్పించారు. ఈ ప్రదర్శనతో స్థానికంగా విద్వన్మండలిలో రామచంద్రపేరు బాగా పరిచయమైంది.

వీరు పనిచేస్తున్న కాలంలోనే ఒకసారి సర్వేపల్లి రాధాకృష్ణ లాహోర్ యూనివర్సిటీలో ప్రసంగించడానికి వచ్చారు. రెండు గంటలపాటు 'వాట్ఈజ్ఫెయిత్' అనే అంశంపైన అనర్గళంగా ప్రసంగించగా మహాకవి ఇక్బాల్ అంతటి వాడు ఆయనముందు చేతులు కట్టుకొని శిష్యుడిలాగా ప్రవర్తించటం మరపురాని అనుభూతి అన్నారు రామచంద్ర. అట్లాగే మళయాళ మహాకవి, మహావిద్వాంసుడు వల్ల త్తోల్వచ్చినప్పుడు ఆయనకు గొప్ప స్వాగత సత్కారం జరిగిందనీ ఆ సంరంభంతాను మరువలేనని చెప్పారు. కాశీ విశ్వవిద్యాలయ సంస్కృతాచార్యులు మహామహోపాధ్యాయ చిన్న స్వామి శాస్త్రులు లాహోర్ ఓరియంటల్ కాలెజి వారి ఆహ్వానంపైరాగా - ఆయన గొప్ప మీమాంసా చార్యులు - వేదమంత్రాల గొప్పతనం వివరిస్తూంటే అక్కడి ఆర్యసమాజీయులు జేజేలు పలకడం మరపురాదు అన్నారు. మహోపాధ్యాయ మాధవ శాస్త్రి భండారినీ రామచంద్రకలుసుకున్నారు. హిందీ రచయిత లెందరో ఆయనకు పరిచయమైనారు. ఒకదీపావళి పండుగకు అమృతసర్ వెళ్ళి స్వర్ణదేవాలయ దీపశోభను దర్శించారు. అక్కడుండగానే హిందీ సాహిత్యరత్న పరీక్ష రాసి తన హిందీ పరిజ్ఞానం నిరూపించుకున్నారు. ఉర్దూ, పంజాబీ కవులెందరితోనో పరిచయాలు చేసుకున్నారు. నాకు ఎంతోమంది పండితకవులతో పరిచయం కావడం ఎంతో ఉత్సాహం కలిగించింది అన్నారు రామచంద్ర. ఒక ఏడాదిలోనే పంజాబ్ యూనివర్సిటీ తాళపత్రలిఖిత సూచీకరణ ఉద్యోగం పూర్తి అయి పోయింది.



# 9. సైన్యంలో చేరడం

ఏడాది ఏణ్ణర్థం కాగానే పంజాబ్ యూనివర్సిటీ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ లోని తాళ పత్ర గ్రంథాల వివరణ సూచీకరణం పనిముగిసింది. లాహోర్‌కు ఆ నిమిత్తమే వచ్చారు రామచంద్ర. న్యాయానికైతే ఆయన మళ్ళీ స్వరాష్ట్రం వెళ్ళి పోవాలి. మద్రాసు చేరి మళ్ళీ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట లైబ్రరీ పని చూసుకోవచ్చు. కోరిన వారికి నిర్ణీత ప్రతిఫలం మేరకు ప్రతులురాసి పెట్టడం, వివిధలిపుల భాషల అనువాదాలు చేసి పెట్టడం మొదలైన పని అది. లేదా ఆయన లాహోర్‌లో ఉండగా హిందీపరీక్షలు పాసైనారు. కాబట్టి హిందీ ఉపాధ్యాయ పదవినైనా వెతుక్కోవచ్చు. ఆయుర్వేద భూషణ డిగ్రీ ఉంది కాబట్టి ఆయుర్వేద వైద్యమైనా ప్రారంభించవచ్చు ఎక్కడైనా, ఆంధ్రదేశంలోనో లేదా మద్రాసులోనో.

కాని రామచంద్రకు వీటివేటి మీద మనసుపోలేదు. తన వివాహ జీవితం పట్ల, భార్య పట్ల ఆయనకు గొప్పగా ఆస్థ కూడా లేకపోయింది. మానసికంగా తనకుటుంబం పట్లా, తన వివాహ బంధం పట్లా ఆయనకు అనివార్యమైన మక్కువ, కుటుంబ సౌఖ్యం పట్ల తహతహ ఉండేందుకు గల అవకాశం లేని పరిస్థితులు కొన్ని ఇదివరలో సంభవించాయి. కాగా లాహోర్ జీవితం ఆయన్ను చాలా ఆకర్షించింది. సమాజ సాహిత్య సాంస్కృతిక జీవన రంగాలలో ప్రముఖులందరూ పరిచయమైనారు. అక్కడున్న తెలుగు వారు ఆయనను ఎంతో ఆదరించారు. అభిమానించారు. అందువల్ల ఇంకా కొన్నాళ్ళు అక్కడే ఉండి బి.ఏ. పూర్తి

చేసుకోవాలని అభిలషించానని ఆయనే రాసుకున్నారు.

మొదటి నుంచీ రామచంద్ర స్వభావరీత్యా డబ్బు కూడబెట్టుకోవాలనీ, స్థిరమైన ఉద్యోగం అభిలషణీయమనీ, ఉద్యోగంలో క్రమానుగతమైన పై స్థాయులు ఆకాంక్షితమనీ, ఆస్తి పాస్తులు, స్థావరమైన ఉనికీ, ఇల్లూ వాకిలీ, పిల్లాపాపా వాంఛితమనీ అనుకొనేవారు కారు. ఆయనమనస్తత్వానికి ఈ విధమైన నిలకడగలిగిన జీవితం సమ్మోహకం కాదు. ఒకరకంగా చూస్తే ఆయన సాహసి. నిశ్చలచిత్తుడు కాదు. దానికాయన తన జాతకానికి అన్వయింప చూస్తారుకాని, ఏదిఏమైనా వారి ఎనభైఏళ్ల జీవితంలో ఈ క్రమమే కనపడుతుంది.

చాలా ఆశ్చర్యకరమైన విషయం. లాహోర్ వచ్చిన తర్వాత ఆయన ఇల్లాలుకు ఒకజాబు ముక్క కూడా రాయలేదు. డబ్బుకూడా ఏమీ పంపలేదు. ఒకరకంగా ఆయనది సంచారజీవన ప్రవృత్తి. చుట్టుపక్కల ఉన్న పురాచారిత్రకప్రదేశాలు, సాంస్కృతికకేంద్రాలు, మిత్రుల ఇళ్ళు దర్శించే వారనుకోవాలి. అందువల్ల పంజాబ్ ఉద్యోగంలో ఆయన నెలజీతం ఏభైరూపాయలైనా ఆయన ఏమీ మిగుల్చుకోలేదు. 'లాహోర్‌లో ఉంటూ పశ్చిమాన ముల్తాన్ వరకు, తూర్పున ధరమ్‌శాలావరకు తిరిగాను. పన్నెండుకోసులకు భాష మారుతుంది అన్న పంజాబీ భాషకు అనుగుణంగా మారుతున్న పంజాబీ మధురవాక్కులను ఆస్వాదిస్తూ, వారిండ్ల ఆవకూర, యవల పిండిరొట్టెలు తింటూ, తామర తూళ్ళ ఊరగాయలు నంజుకుంటూ, మనమధ్యాక్కరవంటి వారి హీర్ ఛందస్సులోని పాటలు వింటూ నిలువెత్తు ఆవచేలలో, మొక్కజొన్నచేలలో, రహస్యంగా పెంచే నల్లమందుతోటలలో భంగ్ (భంగా)తోటలలో తిరిగాను. ప్రాప్రా (భ్రాతాభ్రాతా) అంటూ చుట్టూచేరి, నా జరీఖద్దరు పంచెలు జరీ ఉత్తరీయాలు చుట్టుకొని ఆనందించే అమాయకులైన పల్లె పడుచుల ఆనందాన్ని చూచి మురిసిపోతూ 'రబ్బా (భగవంతుడా!)నీవు ఉన్నావు. నీవు భారత గ్రామప్రజల ఆనందంలో ఉన్నావు. అనుకొని కళ్ళు మూసుకొని మా అమ్మను తలచుకొని ఆమె మాటలు మననంచేస్తూ సంతోషించాను అని స్వీయచరిత్రలో రాసుకున్నారు రామచంద్ర.

ఇప్పుడు రామచంద్రకు ఉద్యోగంకావాలి. ఆయన జీవితమంతా

యదృచ్ఛాలాభంగానే గడిచింది. అట్లానే ఉద్యోగంకూడా సమకూడింది. లాహోర్‌లో ఆయన అద్దెగది పురానా అనార్కలీ అనే పేరుతో ఉండేపేటలో ఉన్నది. ఆ గది దొరకడం కూడా విచిత్రమే. లాహోర్‌లో దిగిన సాయంకాలమే అద్దెగదివేటలో వీథిలో 'పూడా'లు (అప్పాలు) వేయిస్తున్న వ్యక్తిని ఇక్కడేదైనా గది దొరుకుతుందా? బాబూ అని అడిగారు. 'ఇప్పుడే ఒకాయన (ఈపక్క వీథిలోనే ఉంటారు) నీకు తెలిసినవారెవరైనా ఉంటే చెప్పు, మా ఇంట్లో ఒక గది అద్దెకిస్తామని' చెప్పి పోయినాడు. అక్కడికి వెళ్ళి వాకబు చేయండి అని ఆ ఇంటి గుర్తులు చెప్పాడు.వెంటనే రామచంద్ర ఆ ఇంటికి వెళ్ళికనుక్కున్నారు. ఆ గది రామచంద్ర కద్దెకిచ్చారు. అది మేడమీదిగది. ఆ తర్వాత సుమారు ఏడాదికి ఆ ఇంటి యజమాని చనిపోతే రామచంద్ర ఆ గది ఖాళీ చేయాల్సి వచ్చింది. అయితే లాహోర్‌లోనే ఉంటున్న రామచంద్ర పరిచితులు జమ్మలమడుగు లక్ష్మీనారాయణతో ఆ తర్వాత ఉన్నారు. తర్వాత ఆయన బదిలీకాగా శ్యామసుందరమిత్ర అనే బెంగాలీ మిత్రుడితో ఉన్నారు.

ఇప్పుడు ఉద్యోగం కూడా అట్లానే ఆయనకు దొరికింది. ఒక రోజు ఉదయం వీథిదుకాణంలో పాలూ జిలేబి పుచ్చుకుంటూ ఉండగా ఆప్రాంతంలోనే తనకు బాగా పరిచితుడైన వ్యక్తి కనిపించి దక్షిణాది భాషలు తెలిసిన ఒక వ్యక్తికి అక్కడ 'రోల్డుగోల్డు కంపెనీ' లో ఉద్యోగం ఇస్తారు అని చెప్పాడు. రామచంద్ర ఆ కంపెనికీ వెళ్ళారు. ఆయనకు నెలకు 60 రూ.ల జీతంపై వెంటనే ఉద్యోగం దొరికింది. ఆ కంపెనీ వారు చేసే వ్యాపారం ఏమంటే బంగారు పూత పూసిన నగలు, కామవర్ధకమైన మందుల అమ్మకం. వీటిని దూరదూర ప్రాంతాలనుంచి సొమ్ము పంపించి తెప్పించుకున్న వారు ఆ మందులన్నీ ఒట్టి బూటకపువనీ, అంతేకాక శరీరానికి హానికరమైనవనీ తేలడంతో, ఆ నగలు నాలుగు రోజుల కూడా మన్నిక లేకుండానే వెలవెలపోతుండడంతో ఆ కంపెనీ యజమానులను నిరసిస్తూ, న్యాయపరమైన చర్యలు తీసుకుంటామని బెదిరిస్తూ, తిడుతూ, హెచ్చరిస్తూ కుప్పలు తెప్పలుగా ఉత్తరాలు రాసేవారు. ఆ ఉత్తరాలన్నీ ఆయాప్రాంతీయ భాషలలో ఉండడంవల్ల ఆ ఉత్తరాల సమాచారం తెలియచేయగల ఒక ఉద్యోగి ఆ కంపెనీ వాళ్ళకు కావలసి వచ్చాడు. భుక్తి గడవటం తక్షణ

కర్తవ్యం కనుక ఆ ఉద్యోగంలో రామచంద్ర చేరారు. అయితే ఆ పచ్చిమోసాన్ని ఆయన అంగీకరించలేకపోయినారు. ఒక నెల పూర్తి అవుతుండగానే ఆ ఉద్యోగం ఆయన వదులుకున్నారు. ఆయజమాని ఎంతగానో నచ్చచెప్పచూశాడు. బెజవాడలో తన వ్యాపార సంస్థ బ్రాంచిని తెరచి దానిని రామచంద్రకు అప్పగిస్తామనీ, వ్యాపార లాభాలలో భాగం ఇస్తానని ఆకట్టుకోచూశాడు. కాని రామచంద్రకు ఆ వ్యాపారమంటేనే వెగటు పుట్టింది. వైమనస్యం కలిగింది.

ఇప్పుడు మళ్లీ ఆయన ఉద్యోగం వెతుక్కోవలసి వచ్చింది. ఆయనకు ఎప్పుడూ రెక్కాడితే గాని డొక్కాడదు. ఈ సారి కూడా వెంటనే ఆయనకు ఉద్యోగం దొరికింది. ఆయన ఎప్పుడూ యధృచ్ఛాలాభసంతుష్టుడే. లాహోర్ లోనే పురానా అనార్కలీ ప్రాంతంలో మద్రాసు నుంచీ, దక్షిణాదిప్రాంతాల నుంచీ వచ్చినవారు కొన్ని వందల కుటుంబాలుండేవి. వాళ్ళకక్కడ ఒక స్కూలు స్థాపించాడు ఒక పెద్దమనిషి. ఆ స్కూల్లో హిందీ బోధించే ఉపాధ్యాయుడిగా ఉండమని ఆ సజ్జనుడు రామచంద్ర నర్థించాడు. అప్పటికే హిందీలో 'ప్రభాకర' అనే పరీక్ష కృతార్థతాయోగ్యత సముపార్జించాడు రామచంద్ర. వెంటనే ఆయన పనిలో చేరిపోయినారు. అయితే ఏం? మళ్ళీ కథ మొదలు. స్కూలు నిర్వాహకుడు బతిమాలినా, విద్యార్థులు మీరు వెళ్ళకండి అనిప్రాధేయపడినా చంచలమనస్కత ఆయనను సుస్థిరంగా ఉండనివ్వలేదు. ఉపాధ్యాయవృత్తి ఆయనకు నచ్చలేదు. తనకూ బోధన సామర్థ్యానికీ సగమెరిక అని ఆయన నిర్ణయం. అందుకని ఆ ఉద్యోగం ఆయన వదలిపెట్టారు. మళ్ళీ జీవిక కోసం వేట.

ఒకరోజు సాయంకాలం నగర సివార్లలో వ్యాహ్యాళికి వెళుతుండగా ఒక గుర్రపు గడ్డిబండిలో గడ్డిమీద కూచుని ఏదోపుస్తకం చదువుకుంటూ వెళుతున్న డా. రఘువీర కన్పించారు రామచంద్రకు. ఈయన పరుగున వెళ్ళి ఆయన్ను నమస్కార పురస్సరంగా పలకరించారు. డా. రఘువీర మహావిద్వాంసుడు. వేద సంస్కృతిని పునరుద్ధరించి ప్రచారం చేస్తున్న మహావ్యక్తి. ఆయన జన్మస్థానం పంజాబ్ రాష్ట్రమే. ఆయనప్పుడు లాహోర్‌లో 'ఇంటర్నేషనల్ అకడమీ ఆఫ్ ఇండియన్ కల్చర్' అనే అంతర్జాతీయ గుర్తింపుగల గొప్ప సంస్థ నిర్వాహకులుగా ఉన్నారు.

ప్రాచీన భారత విజ్ఞానం, సంస్కృత సంస్కృతి ప్రచారం, వేద విజ్ఞాన ప్రచారం చేస్తున్నారు. అంతకుముందు లాహోర్ లోని సనాతన ధర్మకళాశాలలో సంస్కృతాచార్యులుగా పనిచేశారు. పంజాబ్ యూనివర్సిటీ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో తాళపత్ర గ్రంథ సూచీకరణ పనిలో ఉన్నప్పుడు రామచంద్రకు డా. రఘువీరతో బాగా పరిచయం కలిగింది.

డా. రఘువీర తనతో కలిసి పనిచేయవలసిందిగా రామచంద్రను అర్థించారు. ఒక విధంగా బతిమాలి బామాలి చెప్పారు. డా.రఘువీర అప్పుడు ప్రపంచ భాషా నిఘంటువు నిర్మిస్తున్నారు. దక్షిణాది భాషల విషయంలో తమకు సహాయ పడవలసిందిగా రామచంద్ర నాయన కోరారు. 30 రూపాయల నెలజీతం ఇస్తామనీ, తమ సంస్థభవనం లోనే ఉచితంగా అంటే అద్దె చెల్లించకుండా ఉండవచ్చుననీ మూడురూపాయలకు నెలసరి భోజనం లభిస్తుందనీ, పెద్దపెద్ద సంస్థలలో అంకిత భావంతో పనిచేసే వారికి చిన్నచిన్న జీతాలే అని ఎంతగానో నచ్చచెప్పచూశారు. కాని రామచంద్రకు 30 రూపాయలే నెల జీతమనేప్పటికి మనసు ఒప్పలేదు. యూనివర్సిటీ ప్రాచ్యలిఖిత భాండాగారంలో కేటలాగ్ రూపొందించే పనిలో 50 రూ.ల నెలజీతం, మాయబంగారం కంపెనీ ఇచ్చిన నెలజీతం అరవైరూపాయలు, ఉపాధ్యాయుడిగా 40 పైనే అని ఈ విధంగా ఆలోచించానే కాని డా. రఘువీర వంటి మహోన్నతుడితో కలసి పనిచేయడం ఎంత గొప్ప! ఎంత అదృష్టం, ఎంతటిఅపురూపమైన అవకాశం అని ఆలోచించలేక పోయినానే అని తర్వాత కాలం చాలా పశ్చాత్తాపపడినట్లు, చింతించినట్లూ రామచంద్ర స్వీయ జీవనోదంతాలలో ప్రసక్తం చేశారు.

ఇంతట్లో ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. అది వెంటనే ప్రపంచంలో అగ్రరాజ్యాలనుకొనే వాటికి, శక్తిమంతమైనవాటికి, బలదర్పాహంకార దేశాలకు విస్తరించింది. హిట్లర్ దురహంకారానికీ, దురాక్రమణ దౌర్జన్యానికీ అడ్డుకట్ట వేయాలనే ఆరాటంతో అమెరికా, బ్రిటన్, రష్యాలు కూడా ఏకమైనాయి. అందువల్ల భారతదేశంలో బ్రిటిష ప్రభుత్వం సైనిక బలవిస్తరణకు పూనుకొంది. కొత్తగా సైనికులను తన సైన్యంలో చేర్చుకోవడం ప్రారంభించింది.

అందుచేత ఎవరికీ చెప్పాపెట్టకుండా వెళ్ళి రామచంద్ర సైన్యంలో చేరారు. గది మిత్రుడైన శ్యామసుందర మిత్ర కూడా ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయినాడని రాశారు రామచంద్ర. సరాసరి రిక్రూటింగ్ ఆఫీసుకి వెళ్ళి మిలట్రీలో చేరిపోయానని రాశారు రామచంద్ర. తనకు బాగా తెలిసిన జమ్ములమడక లక్ష్మీనారాయణ గారికైనా కనీసం చెప్పకుండా, ఆయనప్పుడు మిలట్రీ అకౌంట్స్ శాఖలో పెద్ద ఉద్యోగంలో ఉన్నా ఆయనతో మాటమాత్రమైనా చెప్పకుండా, తాను మిలట్రీలో చేరిపోయాననీ, ఆయన ద్వారా వెళ్ళి ఉంటే కొంచె పైస్థాయి ఉద్యోగమే దొరికేదేమోనని రామచంద్ర రాశారు. ఆయనను మిలట్రీలో హవల్దార్ గుమాస్తాగా చేర్చుకున్నారు. అప్పట్లో ఆయన శరీర వ్యాయామం కూడా చేసేవారు కాబట్టి దృఢ గాత్రతతో వెంటనే సైన్యంలో ఉద్యోగం దొరికింది. మర్రోజేట్రెయినింగ్ నిమిత్తం బెలూచిస్థాన్‌లోని క్వెట్టాసైనిక శిక్షణ కేంద్రానికి ఆయనను మిలటరీ వాళ్ళు పంపారు.

క్వెట్టాచాలా సుందరమైన నగరం. హిమాలయం పడమటి కొండలలో ఉంది. ఎండాకాలంలో భరించలేని ఎండలు. చలికాలంలో అడుగు అడుగున్నర ఎత్తున హిమం పేరుకొంటుంది అంతటా. బ్రిటిషు వారికి భారతదేశపడమటి సరిహద్దులలో అది పెద్ద సైనిక స్థావరం. అక్కడి సైనిక కవాతు మైదానంలో పదివేల మంది సైనికులు, అంటే పది బెటాలియన్‌లు సైనిక కవాతు విన్యాసాలు చేస్తారు.

సిపాయి దుస్తులతో పెరేడ్‌లో కవాతు చేశారు రామచంద్ర. తుపాకులు, మెషీన్‌గన్‌లు ఎలా ఉపయోగించాలో, ప్రయోగించాలో నేర్చుకున్నారు. అన్నీ ఉన్ని దుస్తులతో భుజాల వరకు ఉండే స్వెట్టర్, దానిపైన ఫుల్ ఓవర్‌స్వెట్టర్ ధరించేవారు. రూట్ మార్చ్‌లో గ్రేట్ కోటు వేసుకొనేవారు. ఈ విధంగా మూడు నెలలు శిక్షణ పొందిన తర్వాత క్వెట్టాకు వాయవ్యంగా 80 మైళ్ళ దూరంలో ఉన్న చమన్‌కు రామచంద్రను పంపారు. అది చాలా ముఖ్యమైన సైనిక కేంద్రం. అక్కడ గూర్ఖాబెటాలియన్‌లో ఆయన కొంతకాలం ఉన్నారు. తర్వాత అక్కడే ఉన్న మిలటరీ ఆస్పత్రిలో క్వార్టర్ మాస్టర్‌గా రామచంద్రను నియమించారు. నార్త్-వెస్ట్ (వాయువ్య) రైల్వే మార్గపు చివరిస్టేషన్ చమన్. మిలటరీ శిబిరానికి చెందిన

200 పడకల ఆస్పత్రి ఉండేది. రామచంద్ర ఉద్యోగం ఆ మిలటరీ క్యాంపులో రోజూ వెయ్యి పదిహేను వందలమందికి భోజన పదార్థాలు కొలచి ఇవ్వడం. రామచంద్రపైన అజమాయిషీ అధికారి జోషీ అనే పంజాబీ, అవినీతి పరుడు, కుట్రదారుడు, కపటి, విపరీతమైన తాగుబోతు, మూడు నాలుగు వేలు ఖరీదు చేసే సైనిక పటాలాలను, గుడారాలను, కాలం చెల్లినవనీ, పనికిరావనీ నెపంవేసి మూడు నాలుగు వందలకు అమ్మి తాగుడుకు వినియోగించేవాడు. పై అధికారులకు తలలో నాలుకలా ఉండేవాడు కాబట్టీ మంచి ఇంగ్లీషు మాట్లాడ్డం, రాయడంలో దిట్ట కాబట్టీ, ప్రయోజకుడు కాబట్టీ ఇష్టారాజ్యంగా నెగ్గుకొచ్చేవాడు. నియమ నిబంధనలను ఏమాత్రం అతిక్రమించకుండా, ఎంతో నీతినిజాయితీలతో తన పని తాను నిర్వర్తించేవాడు కాబట్టి రామచంద్ర అంటే ఆ జోషీకి కళ్ళమంట, కడుపు మంటగా ఉండేది. ఏ విధంగా ఈ క్వార్టర్ మాస్టర్‌ను సాధించాలా అని ఆరాటంతో ఒక కంటకనిపెడుతూ ఉండేవాడు. ఇంతలో దేశరక్షణలో సైనికులను ఉద్బోధించడానికి బ్రిటీష్ ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్ ఆ సైనిక పటాలాలను ఉత్తేజపరచడానికి వచ్చి పేరేడ్ మైదానంలో గంభీరంగా ప్రసంగించాడు. చర్చిల్‌ను దగ్గరగా చూశారు రామచంద్ర, ఆ చర్చిల్ సైనిక కవాతు విన్యాస ప్రదర్శనలు తిలకిస్తున్నప్పుడు. షాన్‌వాజ్, షామహమ్మద్ వంటి సిపాయిలతో, ఫతేసింగ్ కర్నెయిల్ సింగ్, తేజాసింగ్ వంటి పటాలపు చిన్నచిన్న ఉద్యోగులతో వీరందరితో మంచి మైత్రి ఉండేది రామచంద్రకు.

ద్వితీయప్రపంచ యుద్ధం తీవ్రతరమైంది. క్వెట్టా ప్రాంతంలోనూ ప్రత్యక్షంగా యుద్ధం జరిగే సూచనలు కనపడ్డాయి. క్వెట్టా ప్రాంతాన్నీ రణరంగంగా ప్రకటించేయోచన యుద్ధ నిర్వాహకులకుందని కర్ణాకర్ణిగా వెల్లడైంది. ఈ సైనిక పటాలంలో పనిచేస్తూ పటాలం పనిమీద పర్షియాసరిహద్దులో నిజాహిదన్ దాకా ప్రయాణించారు రామచంద్ర. ఈ మార్గం లోని షీలాబాగ్, శిబిపట్టణాలు చూశారు. ఇదంతా పర్వతమార్గం. అది హిమాలయా శీర్షప్రాంతం. ఈ ప్రాంతాన్ని శిబిచక్రవర్తి పాలించాడని అక్కడి వాళ్ళ ఐతిహ్యమని రామచంద్ర రాశారు. సిపాయి మిత్రులలో కవితావేశంకల మిత్రులు కూడా ఉండేవారనీ వాళ్ళతో సాహిత్య

చర్చలు, కవితా గోష్ఠులు కూడా జరిపేవాడననీ రామచంద్ర తన జీవితానుభవాలలో చెప్పారు. రణరంగానికి అనువుగా ఆప్రాంతాన్ని రూపొందించడానికి ప్రకటించడానికి సన్నాహక చర్యగా సైనికేతర ఉద్యోగులకు ఒక నెల విధి నిర్వహణ విరామంగా శెలవు మిలటరీ అధికారులు ప్రకటించినట్లు ఆ తర్వాత తాను ప్రయాణమై హఠాత్సంభవంగా అత్యంతాశ్చర్యా నంద సంధాయకంగా అనంతపురం వెళ్ళి తన తల్లిదండ్రులను, కుటుంబాన్ని కలిసినట్లు రామచంద్రరాశారు. నాలుగేళ్ళ తర్వాత అత్తారిల్లు సురపురం వెళ్ళి ఇల్లాలును చూశారు. అది అత్యంత రమణీయకర సన్నివేశంగా వర్ణించారు రామచంద్ర. నెలరోజులు ఎంతో ఆనందంతో బంధువుల ఊళ్ళకు వెళ్ళి, అత్తవారింటా, కన్న వారితోను గడిపి మళ్లీ గడువు తేదీకి చమన్ వచ్చి సైన్యాధికారులకు హాజరు విన్నవించుకున్నాడు 



# 10. పత్రికారంగ ఆరంగేట్రం

తెలుగు సాహిత్య పరులలో తిరుమలరామచంద్ర జీవితమంత వైవిధ్య భరితమైన జీవితం ఎక్కడా చూడం. తనది వైవిధ్యభరితజీవితమే కాదు, వైరుధ్య వైచిత్రీ విలసితమైన జీవితమని కూడా ఆయనే చెప్పుకున్నారు. గడచిన రెండుమూడు శతాబ్దాలలోనే ఆయన వంటి వ్యక్తి సాహిత్యలోకంలో మరొకరు కన్పించరు. ఆయన గడిపినంతటి వైవిధ్య వైచిత్రీ జీవితంకూడా గడిపిన వాళ్ళెవరూలేరు. ఏవిధమైన భయాందోళనలు, ముందు జాగ్రత్తలు, ఆరాటాలు, ఆర్భాటాలూ, ప్రతీక్షలు, నిరీక్షణలూ, ఆశాభంగాలు, లేకుండానే, అథవా పట్టించుకోకుండానే ఆయన గడిపారు జీవిత మంతా. బహుశా ఆయన జీవితగాథ ఒక అత్యద్భుతమైన నవలకేమీ తీసిపోదు. అది 'స్వీయ చరిత్రాత్మక' నవల.

1941, 42లలో ఆయన భారతదేశ వాయవ్య సరిహద్దు ప్రాంతంలో రక్షణ సంసిద్ధంగా ఉన్న సైనిక పటాలలో పనిచేశారు. సైనిక యుద్ధతంత్ర నిర్వహణకు అనుగుణంగా ఒక నెల అధికార వ్యవస్థ వారే కలగజేసిన శెలవుపై స్వస్థలానికి చేరి కుటుంబ సౌఖ్యం అనుభవించారు. మళ్ళీ వచ్చి సైన్యంలో చేరారు. సైనిక పటాలంలో తనకు స్నేహితుడైన కర్నైయిల్ సింగ్‌కూడా అప్పుడు శెలవులో జలంధర్ సమీపంలో తమ స్వగ్రామమైన పాన్సటాలో ఉంటే అతణ్ణిచూసి, కలుపుకొని పోవచ్చునని జలంధర్‌లో దిగారు రామచంద్ర. జలంధర్‌కు ఐదు మైళ్ళ దూరంలో ఉంది పాన్సటా. స్నేహితులపట్ల, భారతదేశంలోని వివిధ జాతి జనజీవన

సంస్కృతుల పట్ల ఆయన కుండే అభినివేశం, అభిమానం, ఆదరణ అటువంటివి.

అక్కడ నుంచి మళ్ళీ లాహోర్ వచ్చి క్వెట్టాకు బయలుదేరారు. ఇంచుమించుగా అది ఒకరోజు రైలు ప్రయాణం. రైలుబోగీలో రామేశ్వర దయాళ్‌గౌడ్ అనే రైల్వేఆఫీసరు కుటుంబంతో ఆయనకు పరిచయమైంది. క్వెట్టాలో ఆ కుటుంబం ఆయనను ఎంతో ఆదరిస్తూ వచ్చింది. వారం వారం వాళ్ళింటికి వెళ్ళి వేడినీళ్ళ స్నానం, రుచికరమైన భోజనం చేసేవాణ్ణని చెప్పుకొన్నారు రామచంద్ర. ఆయన స్నేహశీలత, సౌజన్యం, నిండు హృదయం అటువంటివి. సైన్య ఉద్యోగంలో రోజులు ఒక లాగా బాగానే జరిగిపోతుండగా మహాభయంకరమైనప్రమాదం ఆయన మీద విరుచుకొని పడింది.

చమన్‌లో అచ్చరసింగ్ అనే రవాణారంగ వ్యాపార ప్రవీణుడు ఒక రుండేవారు. ఆయన చమన్ నుంచి కాందహార్‌కు (ఆఫ్ఘనిస్తాన్) బస్సులు,ట్రక్కులు, రవాణా యానవాహనాలు నడిపి లక్షలులక్షలు ఆర్జించాడు. రాజభోగాలనుభవించాడు. ఇంతా చేసి ఆయన వయసు యాభైయ్యోపడిలోదే. ఆయనకు భార్యా ఇద్దరు కూతుళ్ళున్నారు. వాళ్ళు నాగరిక మర్యాదలతో ఇంట్లో విందుల్లో వినోదాల్లో అతిథులతో కలసి పోయేవారు. చర్చల్లో పాల్గొనేవాళ్ళు. అయితే విధి వక్రించి అచ్చర్ సింగ్ సంపదంతా క్షీణించింది. ఆయన ఒకే సారిగా ముప్ఫై నలభై వాహనాలు ఇంగ్లండ్ నుంచి తెప్పించుకునే ఏర్పాటులో అవి సకాలంలో తనకు చేరకపోవడంతో ఆర్జించినదంతా పోగొట్టుకొని నిష్ఠదరిద్రుడైనాడు. సైన్యాధికారులు అంతకు ముందరోజుల్లో ఆయన ఇంటి విందులు, వినోదాలు, అతిథిమర్యాదలు అనుభవించేవాళ్ళే. అయితే ఇప్పుడాయన ఒక పరమ అప్రయోజకుడు. కటిక పేదవాడు.

ఒక రోజు సాయంకాలం ఆయన రామచంద్ర దగ్గరకువచ్చి మూడురోజులనుంచి ఇంటిల్లిపాదీ పస్తు అని పరమవిషాదంగా చెప్పాడు. అప్పుడు రామచంద్ర ఆయనకేదోకొంత డబ్బు ఇచ్చి పంపుతుండగా, తనడేరా నివాసానికి కొంత దూరంలో ఉన్న ఒక బెటాలియన్ వాళ్లు తమ శిక్షణపూర్తి చేసుకొని వెళ్ళిపోతూ మిగిలిపోయిన గోధుమ పిండిబస్తాను వెనక్కుతీసుకొని ఖాతాలో

జమచేసుకోవలసిందని చెప్పిన విషయం హఠాత్తుగా జ్ఞాపకానికి వచ్చింది రామచంద్రకు. అది నిండు బస్తాయేమీకాదు. కొంత వరకు వినియోగించగా మిగిలిపోయిందే. దానిని వినియోగార్హంకాదనీ పాడైపోయిందనీ ఖాతాలో తోసిపారేయవచ్చు. పనికి మాలిన వాటిని తోసేస్తున్నామంటూ కండెమ్ చేసిన వంటూ మిలటరీలో ఎన్నో వస్తుసామాగ్రులను నామమాత్రపు ధరలకు కాని, అసలేమీ తీసుకోకుండాకానీ తోసివేస్తారు, తీసివేస్తారు.

అచ్చుర్ సింగ్ దైన్యస్థితిని చూసి అవకాశముంటే, వీలైతే ఒడుపుగా నిర్మానుష్యంగా ఉన్న, సైనికులు ఖాళీ చేసి పోయిన ఆగుడారం నుంచి ఆ ఆటా బస్తాను ఇంటికి చేర్చుకోగలరా? అని సూచన ప్రాయమైన ఆంతర్యాన్ని వ్యక్తపరిచారు రామచంద్ర. ఆ సాయంకాం, చిరుచీకట్లు ముసురుకునే వేళ అచ్చుర్ సింగ్ ఆగోధుమ పిండి బస్తాను తన ఇంటికి చేర్చుకునే ప్రయత్నంచేశాడు. చమన్‌లో అర్ధ ఫర్లాంగు మేర వెడల్పుగా ఒక దానికి పక్క ఒకటి రైల్వేలైనులు విస్తరించుకుని ఉంటాయి. అది ఆ రైలు మార్గపు చిట్టచివరి స్టేషన్‌కనుక.

ఆచ్చుర్ సింగ్ ఆ రైలు పట్టాల వరసలను ఆ బస్తాతో దాటటంతో డ్యూటీ ముగించుకొని గుడారానికి వెళుతున్న ఒక బ్రిగేడియర్ గృహపరిచర్యా సేవకోద్యోగి (ఆర్డర్లీ) చూశాడు. ఈ చిన్న ఉద్యోగి యీ విషయం తన బ్రిగేడియర్ దృష్టికి తెచ్చాడు. ఆయన సంబంధిత అధికారికి వెంటనే ఫోన్ చేశాడు. ఆ సంబంధిత అధికారి రామచంద్ర పై కక్ష, కార్పణ్యాలతో విషం కక్కుతున్న పంజాబీ అధికారి, రామచంద్రపై అధికారిఅయిన జోషి. ఆజోషి రాత్రికి రాత్రి పెద్దకేసు సిద్ధం చేశాడు. సాక్షులెందరినో సమకూర్చాడు. రామచంద్ర సైనిక విధులను అతిక్రమించి ఘోరమైన అవినీతికి పాల్పడ్డాడని సైనికాధికారికి ఫిర్యాదు చేశాడు. ఈ అభియోగ మంతా రాత్రికి రాత్రి చాలా కట్టుదిట్టంగా రూపొందించాడు. దీనితో తన విధులకు హాజరు కావటానికి సైనిక కార్యస్థానం చేరగానే నలుగురు సిపాయిలు వచ్చి రామచంద్రను అరెస్టు చేశారు. ఆయనకు 'కోర్టు మార్షల్' (సైనిక చట్టధిక్కార నేర విచారణ) విధించారు. సైనిక పటాల ఉన్నతాధికారి అయిన కల్నల్ కామ్‌కాక ఈ నేర విచారణ చేశారు. ఆయనకు సహాయకులుగా ముగ్గురు కెప్టెన్‌లూ

వచ్చారు. తన నెందుకు అరెస్టుచేశారో, కోర్టుమార్షల్ విచారణ ఎందుకు జరుపుతున్నారో సౌమ్యుడూ, అమాయకుడూ అయిన రామచంద్రకు విచారణ చివరి ఘట్టం వరకూ తెలియదు. రామచంద్ర గుడారంలో సహవిభాగంలో ఉండే షామహమ్మద్ చేతనే జోషి చార్జిషీట్ తయారు చేయించాడు. పట్టుకొన్న ఆ గోధుమపిండి బస్తాను కోర్టు మార్షల్ అధికారులు స్వయంగా చూడటానికి ఆ విచారణ సంఘం ముందుకు చేర్పించాడు.

కోర్టుమార్షల్ అధికారులు ఆగ్రహోదగ్రులైనా, తర్జించినా రామచంద్ర వినయంగా అమిత విధేయతతో, మానవత్వ దృష్టితో, దయాదాక్షిణ్యాలతో అచ్చర్ సింగ్ నిష్ఫచ్చురాన్ని భరించలేక, పరువుగా బతికిన కుటుంబం పస్తులతో అలమటించటం చూడలేక, హృదయ విదారకమైన వాళ్ళ దుర్గతిని సహించలేక తానే ఆ మిగిలిపోయిన గోధుమపిండి బస్తాను 'అచ్చర్‌సింగ్ తీసుకొని వెళ్ళవచ్చునని చెప్పాననీ, అతడికెటువంటి శిక్ష పడకుండాను, ఎటువంటి అవస్థపాలుగాకుండాను పూర్తిశిక్ష తనకే విధించవలసిందని' ఆ అధికారులముందు ప్రాధేయపడ్డాడు. కల్నల్‌కామ్‌కాకా ఏమనుకున్నాడో ఏమో, తక్కిన సైనికాధికారులతో ఏకాంతంగా సంప్రదించి 'బతికిపోయినావు, ఇటువంటి బుద్ధిహీనపు పనులకెపుడూ పాల్పడవద్దు' అని తీవ్రంగా హెచ్చరించి విడిచిపెట్టాడు. సైనిక పటలాల అక్రమ ప్రవర్తన న్యాయవిచారణ చరిత్రలోనే ఇటువంటిది ఎప్పుడూ ఎక్కడా జరగదు. రామచంద్ర యీవిధంగా రక్షితుడైనాడు. ('రక్షంతి పుణ్యాని పురాకృతాని')

ఇక పటాలం కొలువులో ఉండటానికి ఇష్టపడలేదు రామచంద్ర. 'సర్పంబుపడగ నీడను కప్పవసించినట్లు కదరాసుమతీ!' అనుకొన్నాడాయన. అయితే యుద్ధకాలంలోసైనిక విధులనుంచి బయటపడటం సామాన్యంగా జరగదు. పారిపోతే పట్టుకొని తీవ్ర శిక్షకుగురి చేసే అవకాశముంది. ప్రభుత్వాని కధికారముంది.

అయినా రామచంద్ర జీవితంలో అన్నీ ఘటనలు అనూహ్యంగా, అచింతితంగా, చిత్రవిచిత్రంగా సంభవించినట్లే ఆయన సైనిక ఉద్యోగానికి స్వస్తి చెప్పడం గూడా అట్లానే సంభవించింది. అప్పుడక్కడ సైనిక పటాలాల వైద్యాధికారి కడప వెంకటకృష్ణ

ఆయన తెలుగు వాడు. ఆ మొత్తం సైనిక పటాలాలలో రామచంద్ర, వెంకటకృష్ణలు ఇద్దరు మాత్రమే తెలుగువారు. వెంకటకృష్ణ భారతప్రభుత్వ అధీనంలోని వైద్యనిపుణుడుకాడు. ఆగ్నేసియాలో పనిచేసి చాలా డబ్బు సంసాదించాడు. శెలవులకని భారతదేశం వచ్చాడు. అయితే బ్రిటిష్ప్రభుత్వం ఆయన్ను మళ్ళీ సారవాక్ (ఆగ్నేసియా) వెళ్ళనివ్వలేదు. నిర్బంధంగా మిలటరీ వైద్యశాఖలో రిక్రూట్ చేసింది. ఈ విధంగా కడప వెంకటకృష్ణ, తిరుమల రామచంద్రకు ఆపద్రక్షకుడైనాడు. సైనికోద్యోగం నుంచి బయటపడే వెరవు తనకు చూపవలసిందని రామచంద్ర అర్థించగా కడప వెంకటకృష్ణ ఆయనకు వైద్య పరీక్షలు జరిపి, రామచంద్ర ఎక్కువ ఆవేశపరుడనీ, ఉద్విగ్న చిత్తుడనీ, అటువంటి సన్నివేశాలలో ఆయనజ్ఞాపకశక్తిలోపిస్తుందనీ కాబట్టి ఆయన్ను సైన్యం నుంచి పంపించివేయడం మంచిదని సిఫార్సు చేస్తూ పై అధికారులకు రాశాడు. ఉద్యోగం తెచ్చుకోవడానికి సిఫార్సులు ఎవరైనా ఎరుగుదురుకాని, ఉద్యోగం వదుల్చుకోవడానికి సిఫార్సు కావల్సి వచ్చింది రామచంద్రకు. అది మిలటరీ ఉద్యోగం కదా!

ఆయన జీవితంలో అన్నీ ఇటువంటి విచిత్ర సన్నివేశాలే కనపడతాయి. క్వెట్టానుంచి లాహోర్ వెళుతుండగా రోహ్రీజంక్షన్‌లో అదివరకు ఎన్నడూ తనమొగం ఎరుగని చారిత్రక పర్యటన కుతూహలి ఒకరు తారసపడి మొహంజొదరో-హరప్పాలు దర్శించటానికి రామచంద్రను ప్రోత్సహించి ఒప్పించడం, ఓం ప్రకాశ్ అనే ఆ హిందీపండితుడితో ఆయన మొహంజదరో, హరప్పాలు దర్శించడమే కాక, ముల్తాన్ కూడా వెళ్ళి అక్కడి చరిత్రావవేషాలు తెలుసుకోవడం, ఆ తర్వాత లాహోర్ నుంచి ఢిల్లీ వెళ్ళడం, ఢిల్లీ ధర్మశాలలో నైజాం హైదరాబాద్‌కు చెందిన సత్యనారాయణ అనే మాజీ సైనికోద్యోగి, తెలుగు వాడు తారస పడటం, అతడి ప్రోత్సాహంతో రామచంద్ర అస్సాం, వెళ్ళటం, అక్కడ సత్యనారాయణను ప్రభుత్వం అరెస్టు చెయ్యడం (సత్యనారాయణ సైనికోద్యోగం వదిలిపెట్టి అజాద్ హింద్‌ఫౌజ్‌లో చేరాడు కనుక) ఒంటరిగా మళ్ళీ రామచంద్ర కాన్పూర్ చేరడం, మళ్ళీ జీవిక కోసం, ఉద్యోగంకోసం వెతుక్కోవడం అసాధారణ, అతివిచిత్ర, అతిసాహస, అసామాన్య జీవన సంఘటనలే కదా!

లాహోర్‌లో తమమిత్రులైన చీమకుర్తి సీతారామయ్యతో రామచంద్ర అక్కడ ఎవరో కోటీశ్వరులు కొత్త పత్రిక స్థాపిస్తున్నారంటే ఢిల్లీ వెళ్లారు. కాని ఆపత్రిక రావడానికి ఇంకా మూడనాలుగు నెలలైనా వ్యవధి ఉంటుందని తెలిసింది. సీతారామయ్య మళ్ళీ లాహోర్ వెళ్ళిపోయినారు. ఢిల్లీలో రామచంద్రకెవరున్నారు? ఒక ధర్మశాలలో తలదాచుకున్నాడాయన. అప్పుడే హైదరాబాద్ వజీర్ సుల్తాన్ కంపెనీలో పనిచేశానని చెప్పుకొన్న సత్యనారాయణ పరిచయమైంది. అతడి ప్రేరణపై అస్సాం ప్రయాణం, అక్కడ సత్యనారాయణను మిలటరీ పోలీసులు అరెస్టు చేయడం జరిగింది. చచ్చీ చెడి రామచంద్ర కాన్పూర్ చేరారు.

ఇదివరలో లాహోర్‌లో పరిచయస్థుడైన రఘునాథ్‌సింగ్ అనే అతడు కాన్పూరులో రామచంద్రకు తటస్థ పడ్డాడు. మనం కలప వ్యాపారం చేసి లక్షలు గడించవచ్చని ఆకాశహర్మ్యాలు కట్టి చూపాడు ఈ రఘునాథ్ సింగ్. ఆయనతో రామచంద్ర గంగాతీరం వెళ్ళి అక్కడ నేపాల్ అడవులలో కొట్టి గండకి నదిలో పడవేసిన కలపదుంగలు గంగలో కొట్టుకొనిరావడం వాటినిక్కడ కలపవర్తకుల ఏజెంట్లు స్వాధీనం చేసుకోవడం రామచంద్రచూశాడు. మనం నేపాల్ వెళ్ళి ఈ కలప వ్యాపారం నిర్వహిద్దామని రఘునాథ్‌సింగ్ రామచంద్రకు ఆశకొలిపి నచ్చచెప్పి మూడురోజులలో స్వంత వ్యాపారాలు చక్కబెట్టుకొని వస్తానని వెళ్ళిపోయినాడు. రామచంద్ర నెలరోజులు ఆ రఘునాథ్‌సింగ్ కోసం ఎదురు చూస్తూ కేవలం గంగాజలం మాత్రమే సేవించి పస్తులున్నాడు. నీరసించి పోయినాడు. గంగాతీరంలో ఒక రోజు పండిట్ హరిలాల్ అనే మిత్రుడు రామచంద్ర స్థితికి వగచి, ఆయన కథంతా విని ఇంటికి తీసుకొని వెళ్లి భోజనం పెట్టారు. హరిలాల్ గారి తల్లి రామచంద్ర నెంతో ఆదరించింది. హరిలాల్ ఆయనకు ఒక బట్టల మిల్లులో కండెలు, బేళ్లు లెక్కరాసే రోజుకూలిపని ఇప్పించాడు. కాని రామచంద్ర ఆ పనిచేయలేక పోయినాడు. ఒక రోజు మిల్లు నుంచి సత్రం గదికి వస్తుండగా వీధిలో 'సెంట్రల్ ప్రెస్' అనే నామఫలకం కనిపించింది. ఏదైనా పని దొరుకుతుందేమోనని లోపలకు వెళ్ళాడాయన. ప్రొఫెసర్ గంగాశరణ శర్మ అనే ఆయన ఆప్రెస్సు యజమాని. అక్కడ సనాతనధర్మకళాశాలలో శర్మ వాణిజ్య

శాస్త్ర బోధకుడు. ఆయనకు లక్నోలో బుక్‌స్టాల్ ఉంది. పాఠ్యపుస్తకాల వాచకపుస్తకాల ప్రచురణ అమ్మకం వ్యాపారం ఉంది. పాట్నా వరకు ఆయన ఆ పుస్తకాల వ్యాపారం సాగిస్తాడు. ఆయన రామచంద్రను ఆదరించి పుస్తకాలు ఊరూరు తిరిగి అమ్మకం పనులు నిర్వహించే సంచార ఉద్యోగం ఇచ్చారు. ఈ ఉద్యోగం కూడా కొన్నాళ్ళ తర్వాత రామచంద్ర వదులుకున్నారు. మళ్ళీ సత్రంలోఉంటూ ఉద్యోగాన్వేషణం చేశారు రామచంద్ర. సత్రంలో పక్కగదిలోనే ఉంటున్న మెహర్‌సింగ్ అనే సజ్జనుడు ఈయన వాలకం చూశారు. పస్తులుచూశాడు. తనకు అతిథిగా ఉండవలసిందిగా ప్రార్థించాడు. క్షత్రియుల హోటల్‌కు తీసుకొని వెళ్ళాడు. మర్రోజే అతడే వచ్చి సంభ్రమంగా 'రామచంద్రాజీ! ఇక్కడ ఒక ఇంగ్లీషు పత్రిక పెట్టబోతున్నారు. మీరు వెళ్ళి ఏదైనా ఉద్యోగంకోసం ప్రయత్నం చెయ్యండి' అని ఎంతో ఆత్రుతతో చెప్పాడు. 'డెయిలీ టెలిగ్రాఫ్' అనేపేరుగల ఆ ఇంగ్లీషు దిన పత్రిక సంపాదకులైన వెంకట్రామన్‌ను కలుసుకున్నారు రామచంద్ర. తనవంటవాడిపై పర్యవేక్షణ భారంకూడా రామచంద్రకే అప్పగించి ఆయన దాక్షిణాత్యుడు కనుక, రామచంద్ర వంట ఇంటి అజమాయిషీకీ, శాకపాకాలు దగ్గరుండి ఘడ్‌వాలీ వంటబ్రాహ్మడిచేత సిద్ధంచేయించడానికీ, రామచంద్ర దక్షతను ఎంతో మెచ్చుకొనేవారు. డెయిలీ టెలిగ్రాఫ్ ఆఫీసులోనే రామచంద్రకు బసకూడా ఏర్పాటు చేశారు సంపాదకుడు. తీరికవేళల్లో ప్రూఫ్‌రీడింగ్ నేర్చుకోండి అని వెంకట రామన్ రామచంద్రను ప్రోత్సహించారు. రిపోర్టింగ్‌కు వెళ్ళి మీ చేతనైనంత మట్టుకు వచ్చిన భాషలో వార్తా సేకరణ చేయండి. అని ఆత్మవిశ్వాసం ప్రోదిచేశారు. రామచంద్ర డెయిలీ టెలిగ్రాఫ్ ఉద్యోగంలో చేరి రెండు మూడు రోజుల్లోనే రాహుల్ సాంకృత్యాయన్ కాన్పూర్‌లో ప్రసంగించే సభ ఒకటి తటస్థించింది. ఆసభకు వెళ్ళి మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ ప్రసంగాన్ని రిపోర్టు చేయవలసిందిగా కోరారు వెంకట రామన్. రామచంద్ర వెళ్ళి రాహుల్‌జీ ఉపన్యాసాన్ని రాసుకుని వచ్చారు. వెంకట రామన్ మెచ్చుకున్నారు. ఇట్లా రెండు నెలలు డెయిలీ టెలిగ్రాఫ్‌లో పనిచేసిన తరువాత తనక్షేమసమాచారలు తండ్రిగారికి అనంతపురం లేఖ రాశారు రామచంద్ర.



# 11. జ్ఞాన తృష్ణ

భాషా సాహిత్యం, వ్యాకరణం, లిపి విజ్ఞానం, పురాచరిత్ర, సంస్కృతి వికాసం, దేవాలయ వాస్తు శిల్పం, తులనాత్మక భాషా శాస్త్రం, సంగీతం, చిత్రకళ, స్థాపత్యం, ఆయుర్వేదం, లోకతంత్రం (కామశాస్త్రం), వేదాంతం తత్త్వ చింతనం లాంటి ఇన్ని విషయాలలో పరిజ్ఞానం మాట అటు ఉంచి జిజ్ఞాసకూడా కష్టసాధ్యమే ఒకపాటి సాహిత్యపరులకు, సాధారణ కవి పండితులకు.

తిరుమల రామచంద్రకు వీటన్నిటిలోనూ పరిజ్ఞానం ఉంది. ఇన్ని విషయాలు తెలిసినవారెవరైనా ఉంటేకదా, వాటిలో ఆయన సాధికారతను వివదించటానికి! ప్రశ్నించటానికి! ఒకే శాస్త్రంలోనో, ఒకే కళలోనో విశేషించి జీవితకృషిచేసిన వారికి ఆ విషయంలో, ఆశాస్త్రంలో, ఆ లలిత కళల్లో రామచంద్రకన్న ఎక్కువ తెలిసి ఉండవచ్చు. వాళ్ళు ఎక్కువ వ్యాఖ్యానించగలిగి ఉండవచ్చు. కాని ఇన్ని విషయాలపట్ల ఆసక్తి, కృషి, జ్ఞాన సంపత్తి ఉన్న వ్యక్తులు సాహిత్యలోకంలో అరుదు. భరతుడు నాట్యశాస్త్రంలో చెప్పినట్లు లోకధర్మియైన నాట్యశాస్త్రానికి అవసరంలేని శాస్త్రం గాని, కళగాని, యోగంకాని, ప్రజ్ఞకాని ఉండవు. ప్రపంచ పరిజ్ఞానభారమంతా కవిమీద ఉంటుంది. కవి అంటే వర్ణన ప్రతిభకలవాడు అన్నప్పుడు రామచంద్రను కూడా కవి అనవచ్చు. ఆయన కావ్యాలేమీ దాయలేదు. కాని ఆయన జీవితమే గొప్ప కావ్యం. అందులో నవరసాలున్నాయి.

ఎవరిజీవితంలోనైనా ఒక్క రసం సంఘటించవచ్చు. దానిని వారు భావించవచ్చు. భావించలేకపోవచ్చు. కాని రామచంద్ర చూసిన లోకంలో రసప్రపంచాన్ని ఆయన ఆకళింపు చేసుకున్నారు. ఆయనలో పసిబాలుడి సారళ్యమనప్రవృత్తి, కౌమార దశ విముగ్ధలోకాలోకనం, యౌవనాశోత్సాహావేశాలు, నడివయసులోని సంయమశీలం, వయసు మళ్ళినవారి నెమ్మదితనం, తాత్త్విక వివేచన ఎప్పుడూ అవసరానుగుణంగా అన్యోన్యంగా భాసమానమయ్యేవి.

విస్తృతమైన విపులమైన నిరవధికమైన పృథివీ స్వభావాన్ని అక్షరలోకంగా అధ్యయనం చెయ్యాలనీ, తనకు తెలిసింది తన భాషీయులకు చెప్పాలనీ ఆయన తహతహ. కలం పట్టిన తొలినాళ్ళనుంచి లోకం విడిచిపోయేదాకా ఆయనది ఇదేప్రవృత్తి. చదవడం, రాయడం ఆయన ఉచ్వాసనిశ్వాసాలుగా భావించుకున్నారు. దీనికి అనుగుణమైన వృత్తి పత్రికారంగంలో పనిచేయడమేనని అదృష్టవశాత్తూ ఆయన పాతిక,ముప్ఫైఏళ్ళ వయసుననే తెలుసుకున్నారు. తరువాత సుమారు ఐదారు దశాబ్దాలు ఆయన ఆవిధంగానే ఆలోకంలోనే, ఆలోకనతోనే జీవించారు.

రెండో ప్రపంచయుద్ధం పర్యవసాన దశ చేరుకుంటుండగా కాన్పూరు నుంచి కొత్తగా ప్రారంభమైన డెయిలీ టెలిగ్రాఫ్ అనే ఇంగ్లీషు పత్రికలో ఉద్యోగం కోసం వెళ్ళి సంపాదకుణ్ణి ఆయన అర్థించారు. తన యోగ్యత లేమిటనా? సంపాదకుడు ప్రశ్నించగా 'ఆకలి'అన్నిటినీ మించిన యోగ్యత అని రామచంద్ర చెప్పుకున్నారు. ఇందులో గొప్పతాత్త్విక స్ఫురణ ఉంది. ఆ సంపాదకుడు నవ్వి 'అనుభవమేమిటో చెప్పండి' అని అడిగారు. 'తంజావూరు, మద్రాసు, లాహోర్‌లలోగ్రంథాలయాలలో పనిచేసిన తన అనుభవం' చెప్పారు రామచంద్ర. చెబుతూ 'ఈ పత్రకార వృత్తికి ఇవి సంబంధించినవికావుగదా! 'అనేజిజ్ఞాసనూ వెలిబుచ్చారు. 'నో!నో! జర్నలిజానికి అన్నీ పనికి వచ్చేవే! చివరకు హోటల్‌లో ఎంగిలి కప్పులు కడిగిన అనుభవమూ పనికివస్తుంది' అన్నారు సంపాదకుడు. అయితే నాకు ఆ అర్హత పూర్తిగా ఉందండీ అన్నారు రామచంద్ర. తాను మద్రాసు మింట్ స్ట్రీట్ రామవిలాస్ హోటల్‌లో పనిచేసిన అనుభవాలు వివరించారు ఆ సంపాదకుడికి. ఆ సంపాదకుడు ఎంతో మెచ్చుకుని రామచంద్రను వదలిపెట్టలేక వెంటనే ఉద్యోగం ఇచ్చారు. ఆ

ఉద్యోగానికి అనుబంధం కాకపోయినా వంటశాల అజమాయిషీ అనే అదనపు బాధ్యత కూడా ఆయనకు అప్పగించారు.

డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికలోనే 'జర్నలిస్ట్'గా రామచంద్ర రంగప్రవేశం, స్వీయ చరిత్రలో రామచంద్రే చెప్పుకున్నారు. 'వెంకటరామన్ గారివల్ల నాకు వృత్తి విషయంలో స్థిరమయిన అభిప్రాయంకలిగింది. పత్రికా రచనా మనప్రవృత్తికి అనుగుణమయిన వృత్తి. అంతేకాక అది అప్పుడు దేశ సేవలో భాగం. పత్రికల్లో పనిచేసేవారు దేశ సేవకలుగా గొప్ప గౌరవం పొందుతున్న కాలమది. పత్రికా రచన వృత్తిని వదలరాదు అనే నిశ్చయం నాచంచల స్వభావానికి విరుద్ధంగా స్థిరపడింది' అన్నారు రామచంద్ర. ఆవృత్తేఆయన జీవితంలో ఆవృత్తి అయింది పదే పదే. ఆయనజీవితంలో ఏదీ ముందుగా కోరుకోలేదు. ఏది వస్తే దానిని నిండు మనసుతో స్వీకరించారు.

రామచంద్రలో జ్ఞానతృష్ణ అపారం. ధన సంపాదన వాంఛ అసలు లేనే లేదు. వ్యక్తిత్వపు భావశీలమైన యౌవన దశనుంచీ ఈప్రవృత్తి రామచంద్రలో కనపడుతుంది. తలవనితలంపుగా రామచంద్ర మద్రాసులోని ఎగ్మూర్ మ్యూజియానికి వెళ్ళారు. అక్కడ బౌద్ధశిల్పాలను పరిశీలిస్తుండగా ఎవరో ఆపరిచితవ్యక్తి 'ఇక్కడ ప్రాచ్యలికిత పుస్తక భాండారం ఉన్నదట కదా! ఎక్కడండీ' అని వెనుక నుంచి ప్రశ్నించారు. రండి వెళదాం అని ఆ అపరిచిత వ్యక్తి యథాలాపంగా అనడమేమిటి? ఈయన ఆయనను అనుసరించడమేమిటీ? చిత్రంగా లేదా! ఆ వ్యక్తితోరామచంద్రకూడా ఆరాతీసిప్రాచ్యలిఖిత భాండాగారంలో అడుగుపెట్టారు. అక్కడ బులుసు వెంకటరమణయ్య గారి దగ్గరకు వెళ్ళారు ఇద్దరూ. ఆయనే బులుసు వారని రామచంద్రకు అప్పటికి తెలియదు. తనను ప్రేరేపించి తాటాకులగ్రంథాలయంలోకి తీసుకొనివచ్చిన వ్యక్తి తనకు కావాల్సిన సమాచారమేదో కనుక్కుని వెంటనే వెళ్ళిపోయినారు. రామచంద్రకూడా శెలవు తీసుకోవడానికి ఉద్యుక్తులవుతుండగా 'కూచోండి' అన్నారు బులుసువారు. తన పేరూ అదీ చెప్పుకున్నాడు రామచంద్ర. అంతకు ముందే కొన్ని రోజులు వెంకటరమణయ్యగారు భారతి మాసపత్రిక కార్యాలయానికి వెళ్ళగా భారతి

సంపాదకత్వ బాధ్యత నిర్వహిస్తున్న టి.వి.రంగాచార్యులుగారు యధాలాపంగా 'తాళపత్రగ్రంథాలయంలో కాపీయిస్టు' చేసేపని ఏమైనా ఉందా! ఏదైనా ఖాళీ ఉందా అని అడిగారు. ఆ విషయం గుర్తు వచ్చింది. వెంకట రమణయ్యగారికి, బహుశా రంగాచార్యుల వారే ఈయనను పంపారేమోననుకున్నారు బులుసు వారు. రామచంద్రకూడా అక్కడ తాను చేయగలిగిన పని ఏమైనా ఉందా అనిప్రశ్నించారు. తన విద్యార్హతలు తెలుపుకుంటూ. రామచంద్ర చేతివ్రాత నమూనా, తెలుగులోనూ నాగరలిపిలోనూ అడిగారు వెంకటరమణయ్యగారు. వీరు అక్కడికక్కడే రాసి ఇచ్చారు. వెంటబడినట్లు ఉంటుందేమో నని ఆ తర్వాత రెండు మూడు రోజులు రామచంద్ర ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీకి వెళ్ళలేదు. తర్వాత వెళ్ళారు. ఆశ్చర్యం! గుజరాత్ లోని గోండా ఆయుర్వేద సంస్థాన్ నుంచి ఒక బాధ్యత గల వ్యక్తి వచ్చి దక్షిణాదిభాషా లిపులలో, సంస్కృత నాగరి లిపిలో, తమిళులు ఉపయోగించే గ్రంథలిపిలో ఉన్న ఆయుర్వేద తాళ పత్ర గ్రంథాలు నాగరలిపిలో చక్కగా కాపీ చేయించి ఇవ్వగలరా? అని లైబ్రరీ అధికారులను అర్థించారు. ఆగ్రంథాలను ఎంపిక చేశారు లైబ్రరీ అధికారులు. అప్పుడా వ్యక్తి 7, 8 వందల రూపాయలు లైబ్రరీ అధికారుల వద్ద బయానాగా ఇచ్చారు. బులుసువారా పనిని రామచంద్రకు అప్పగించారు. వంద అనుష్టుప్ శ్లోకాలకు 5 రూపాలయప్రతిఫలం చెల్లించే ఏర్పాటు. అప్పట్లో రామచంద్ర చేతిలో 15, 16 రూపాయలు మాత్రమే ఉన్నాయి. అయినా ఆయన ఎక్కువ పనిచేసి ఎక్కువ సంపాయించుకుందామని ఆత్రపడలేదు. నెలకు 15,16 రూపాయలు లభిస్తే చాలుననుకున్నారు. 15 రూపాయలంటే 300 శ్లోకాలు కాపీ చేయాలి. శెలవు రోజులు పోను సగటున ఒక పది దినాలుంటాయనుకున్నా రోజు ఆశ్లోకాలు రాసేవారన్న మాట రామచంద్ర. మరి పొద్దున పదిగంటల నుంచి సాయంకాలం దాకా లైబ్రరీలో ఏం చేసేవారు? ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం గూర్చి ఆయనే ఇట్లా చెప్పారు. 'అదొక సరస్వతీ నిలయం సంస్కృతాంధ్ర, కన్నడ, తమిళ, మలయాళ, అరబ్బీ, ఫారసీ, ఉరుదూ, హిందీ, మహారాష్ట్రగ్రంథాలు ముప్ఫైవేలకు పైగా ఉన్నాయన్నారు. అని వారు ఎంతో సంతోషపడ్డారు. అదిలిఖిత

పుస్తకభాండాగారమైనా ముద్రితగ్రంథాలూ వేలకొలది ఉండేవి, వాటిలో నా అభిరుచికి తగినట్టు చదువుకొనే వాడిని అన్నారు రామచంద్ర. అంతేకాదు ప్రతిఫలాపేక్షరహితంగా ప్రభాకర శాస్త్రిగారికోసం చాలా పుస్తకాలు నకలు చేసి ఇచ్చారు. పాతతాటాకు గ్రంథాలలో ఖాళీప్రదేశాలలో చాటు పద్యాలుంటాయిచూసి పెట్టు అని కోరారు శాస్త్రిగారు. అట్లా తాటాకు గ్రంథాలు గాలిస్తుండగా ఒక అపూర్వమైన గ్రంథం చేజిక్కింది శాస్త్రిగారికి. అది కన్నడ గ్రంథం. కన్నడ గ్రంథం నాకెందుకని వదిలి పెట్టలేదు రామచంద్ర. వరుస సంఖ్యాక్రమంతో చాలా పద్యాలున్నాయి. పద్యాంతాలన్నీ శివసంబోధనలు. ఇది పండితారాధ్యుల వారి శివతత్త్వసారమా? ఏమాని ఉత్కంఠ కలిగింది. కాని పండితారాధ్యుల వారు కన్నడంలోనూ రచయిత అని రామచంద్రకు తెలియదు అప్పటికి. ప్రభాకరశాస్త్రి గారిని సంప్రదించారు. అప్పటికే కొమర్రాజు వారిచే ప్రచురితమైన తెలుగు శివతత్త్వసారంతో పోల్చిచూశారు ఇద్దరూ. అది శివతత్త్వసారానికి కన్నడీకరణమని తేలిపోయింది. శివతత్త్వసారం తెలుగు -కన్నడ రూపాలు ఎదురెదురుగా ప్రతిపద్యం కూర్చి ప్రచురించాలని రామచంద్రకు అభిలాష కలగడమేమిటీ? వెంటనే ఆ పరిష్కృత ప్రతిని సిద్ధం చేయడమేమిటి? జరిగిపోయింది. కొమర్రాజులక్ష్మణరావు గారు ప్రత్యంతర సహాయం లభించక ఖిలమైన కొన్ని భాగాలు పూరించారు. ఆయన పూరించిన పాఠాలు ఎంత అద్భుతంగా ఉన్నాయో, లక్ష్మణరావుగారు ఎంత మహానుభావుడో, లక్ష్మణరావు పూరించిన పాఠాలను కన్నడ ప్రతిపాఠాలతో పోల్చి ఉప్పొంగిపోయినారు రామచంద్ర. ఈ విధంగా తెలుగు-కన్నడ శివతత్త్వసారం ముద్రణకు సిద్ధంచేశానుకాని ముద్రించలేకపోయాను. ఆ ప్రతి ఇంకా నా దగ్గర ఉంది అని స్వీయ జీవితోదంతాలలో చెప్పుకున్నారు రామచంద్ర. అదీ ఆయన చిత్తవృత్తి. సాహిత్యనిబద్ధత. పరిశోధనప్రవణత. కొమర్రాజు వారికి అప్పట్లో కన్నడ రూపాంతరీకరణ ప్రతిలభించలేదు కాబట్టి వారికి తట్టని చక్కని పాఠాలు రామచంద్రకు స్ఫురించాయి. తనకు తట్టిన ఆ పాఠాలను కన్నడప్రతితో తైపారు వేసుకొని రామచంద్ర ఎంతో మురిసిపోయినారు. 'శివతత్త్వ సారం పాఠాల పరిష్కరణ' అని రామచంద్ర ఒకప్రశస్తమైన వ్యాసం భారతిలో ప్రకటించారు.

రామచంద్ర రచనలను పరిశీలిస్తే, అధ్యయనం చేస్తే ఆయన ఎంత రాశాడో అంత కన్న ఎక్కువ చదివాడని స్పష్టపడుతుంది. సైన్యం కొలువులో చేరినా ఆయన అధ్యయన పిపాస ఆగిపోలేదు. తన సైనిక పటాల కొలువు రోజులనుగూర్చి రామచంద్ర ఇట్లా రాశారు.

"మా బెటాలియన్‌లో ఇంగ్లీషు లైబ్రరీ ఉండేది. నేను అక్కడ చదివిన తొలినవల (ఇంటర్ బి.ఏ ఇంగ్లీషుపాఠ్యపుస్తకాలలో సంగ్రహనవలల కథలు కాక) ఐవన్హో. దానిని పారాయణ చేశానన్నా తప్పులేదు. తరువాత ప్రైడ్ అండ్‌ప్రిజుడిస్ చదివాను. బోకాషియో బూతుకథలు చాలానే చదివాను. అవి కొన్ని జక్కన విక్రమార్క చరిత్రలోని కథలను చాలా పోలి ఉన్నాయి. ఆశ్చర్యమే. ఇక్కడివే కర్ణాకర్ణిగా అక్కడికి చేరి ఉంటాయి అంటారు రామచంద్ర.

ఇక లాహోర్‌లో పంజాబు విశ్వవిద్యాలయ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ తాళపత్ర సూచీకరణ కాలంలో తన గ్రంథపఠనతృష్ణ నెట్లా తృప్తి పరచుకొన్నదీ ఇట్లా ప్రస్తావించారు రామచంద్ర.

"నేను లాహోర్‌లో నా హిందీ జ్ఞానాన్ని విస్తరింప జేసుకొనడానికి ప్రయత్నించాను. లాహోర్ కార్యాలయాల పనిగంటలు విచిత్రమైనవి. చలాకాలంలో మధ్యాహ్నం 11 గం.ల నుంచి నాలుగు గంటలవరకు పన్నెండు తర్వాత వీధి ముఖం చూస్తే తలపగిలేది. చలికాలం సాయంకాలం నాలుగున్నరకే చీకట్లు ముసిరేవి. గ్రంథాలయాలు మాత్రం తెరిచే ఉండేవి. కనుక మొదటి నుంచి గ్రంథాలయ పక్షినే గనుక, అక్కడ గ్రంథాలయాలలో సమయాన్ని బాగా వినియోగించుకున్నాను. హెవలాక్ ఎల్లిస్ సైకాలజీ ఆఫ్ సెక్స్ చదివాను. మనకామశాస్త్ర గ్రంథాలలో తూలనాత్మక అధ్యయన దృష్టితో రెండు పద్ధతుల లోను సహజత ఎంత అని నిరూపించే గ్రంథం వ్రాయాలనుకొన్నాను. కాని వ్రాయలేదు అని రాశారు రామచంద్ర స్వీయచత్రలో. కాని ఆయన "సమాజ శ్రేయస్సు తృతీయ పురుషార్థం" అనే గొప్ప వ్యాసంలో ఈ విషయం స్థూలంగానే అయినా పరమసూక్ష్మంగా (అంటే సూత్రీకరణగా) పరామర్శించారు. వారిట్లా ప్రసక్తానుప్రసక్తంగా ఆ వ్యాసంలో అన్నారు.

"పాశ్చాత్యులలోనూ దాంపత్యజీవనానికి ప్రాధాన్యం కనిపిస్తున్నా విశృంఖలత ఉందని చెప్పాలి. దానికి కారణం దేశకాల పరిస్థితులు. ఆచార వ్యవహారాలు; సంస్కృతీ సంప్రదాయాలు కావచ్చు. ప్రాచ్యదేశాలలో లాగ స్త్రీ పురుషులు అక్కడ దూరదూరంగా ఉండటానికి వీలులేదు. పారిశ్రామిక నాగరికత మరీ పెరిగిన ప్రాంతమది. ఉభయులకూ సన్నిహితత్వం, కొంత వైశృంఖ్యల్యం తప్పవేమో! అయినా పెద్దవారు, సంస్కృతి కలవారూ దాంపత్యజీవనాకాంక్షులే. హెన్రీ ఫోర్డును "మీదాంపత్య జీవితము ఇంత సుందరంగాను, సుఫలంగాను ఉండడానికి కారణమేమిటి? అని ఎవరో అడిగారుట. మరేమీలేదు వాణిజ్యరంగంలో అనుసరించిన ఫార్ములానే గార్హస్థ్య జీవితంలోనూ అనుసరిస్తున్నాను. అదేమిటంటే ఒకేమోడల్‌ను నమ్ముకోడం "అని సమాధాన మిచ్చాడు ఆయన" అన్నారు రామచంద్ర. పాశ్చాత్యుల కామశాస్త్ర విజ్ఞానంతో భారతీయ ప్రాచీన కామశాస్త్ర విజ్ఞానాన్ని ఈ వ్యాసంలో పోల్చిచర్చించారు. వాత్స్యాయనుడికి ముందు తొమ్మిది మంది కామశాస్త్ర గ్రంథాలు రాశారని ఆ విషయాలుదాహరించారు. భారతీయ ప్రాచీన కామశాస్త్ర విజ్ఞానం పట్ల రామచంద్ర దోషారోపణం చేశారు కాని మెచ్చలేదు. ఫ్రాయిడ్ హెవలాక్ ఎల్లిస్‌ల కామశాస్త్ర తత్త్వవిచింతనలతో మనువు, వాత్స్యాయనుడు. సుశ్రుతుడు మొదలైనవారి భావతార్కికతతో పోల్చారు. సెక్సు పరిజ్ఞానం యువతకు బోధించడం మంచిదే అన్నారు. ఈ ప్రశస్తమైన వ్యాసాన్ని ఆయన "సాహితీ సుగతుని స్వగతం"లో చూడవచ్చు.

పదమూడు - పధ్నాలుగు ఏళ్ళ వయసుననే ఆయన తిరుపతి సంస్కృత కళాశాలలో విద్యార్జన కోసం చేరారు. ఆ కళాశాల గ్రంథాలయనిర్వాహకుణ్ణి మంచి చేసుకుని ఆయుర్వేదం చదువుకుంటున్నాము కాబట్టి కామశాస్త్ర గ్రంథాలు చదవడంలో తప్పులేదు అని ఆయన్ను అంగీకరింపజేసి ఆ అవన్నీ చదివామన్నారు. రామచంద్ర. అంతేకాదు వశీకరణౌషధాల గూర్చీ ఆసక్తితోప్రయోగాలు చేశామన్నారు. 'బుద్ధుడికి ముందునుంచే ఉన్న ధూమపానం', 'ఈజిప్టు ప్రజల ఆముష్మిక చింత', 'ఆఫ్రికా సాహిత్యంలో కల్పనలు', 'కళలు, శాస్త్రాలు ఏవిముఖ్యం?', 'దేశినామాలలోని మరికొన్ని తెలుగు పదాలు' మొదలైన

సాహితీసుగతుని స్వగతం అనే వ్యాస సంపుటిలో రచనలు చదివితే రామచంద్ర ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసాలేకాక సాహిత్య మేధావి అని స్పష్టమవుతుంది. పిల్లల కోసం కూర్చిన వాచక పుస్తకం లో 'చెఱకు' అని ఒక పాఠం ఆయన రచించారు. అది ఎంతో విజ్ఞానదాయకంగా ఉంది. చాలా మందికి తెలియని విషయాలు ఈ 6వ తరగతి (ఫస్ట్‌ఫారం) వాచకపుస్తకంలో ఉన్నాయి. 'పంచదార'కు ఆపేరు ఎందుకు వచ్చిందో ఈ పాఠంలో చెప్పారు రామచంద్ర. ఈ వాచకం (పాఠ్యపుస్తకం) రచించేనాటికి రామచంద్రకు నలభై ఏళ్ళుకూడా లేవు. 'ఐదుసార్లు వడపోసి కాచినదగుటచే దీనికీ పేరు వచ్చెను' అని వివరించారు ఆప్రక్రమమంతా రామచంద్ర. తమకన్నా 23 ఏళ్ళు పెద్ద అయిన చిలుకూరి నారాయణరావుగారితో సంస్కృత ప్రాకృతశబ్దవ్యుత్పత్తి చర్చలు చేశారు. రామచంద్ర జ్ఞాన తృష్ణ అపారం.





# 12.ప్రాకృత సాహిత్యం పట్ల ప్రేమ

సంస్కృతకావ్యనాటకాలంకార సాహిత్యంతో పరిచయం ఉన్నవారికి ప్రాకృతభాషతో అంతోఇంతో పరిచయం ఉండకపోదు. సంస్కృత నాటకాలలో కొన్ని పాత్రలు ప్రాకృత భాషలోనే భాషించాలి. భారత దేశంలో ఉత్తరాది భాషలన్నీ ప్రాకృతం నుంచే పుట్టాయని భాషా వేత్తల అభిప్రాయం. పురాతన లేదా చరిత్ర కొంత తెలిసిన భారతదేశ సామాజిక స్వరూపం, సంస్కృతి తెలియాలంటే ప్రాకృతంతో పరిచయం తప్పనిసరి. తెలుగు ద్రావిడ భాషాకుటుంబానికి చెందినదే అయినా దానిపై ప్రాకృత భాషా ప్రభావం ఎక్కువని చాలా మంది పండితుల అభిప్రాయం.

రామచంద్ర తెలుగుకూ ప్రాకృతానికీ ఉండే ఘనిష్ఠ సంబంధం గూర్చి ఇట్లా రాశారు. తెలుగు ప్రాకృతాల సంబంధం యీనాటిది కాదు. ఇరవై అయిదు శతాబ్దాలనాటిది. గౌతమబుద్ధుడు తథాగతుడు కాగానే ఆ వార్త విన్న తెలుగువారు బోధన్, జార్ఖండ్‌ల మీదుగా బీహార్‌కు, వారణాశికి వెళ్ళి ఆయనను కలుసుకొని ఉపదేశాలు పొంది, ఆయన చిత్రపటంకూడా తీసుకొనివచ్చినట్టు జాతకకథలలో ఉంది.

అలాగే జైనంతో మనకు సంబంధం ఏర్పడింది. అనంతపురం జిల్లా కొనకొండ్ల వాస్తవ్యుడైన కుందకుందాచార్యుడు ఉత్తరాపురానికి వెళ్ళి గొప్ప జైనాచార్యుడయ్యాడని చరిత్ర చెబుతున్నది. ఇతడు క్రీ.శ. ఒకటవ శతాబ్దంవాడు. ఇంకా ఎందరో

తెలుగు వారుజైనాచార్యులయ్యారు. తెలుగు దేశంలో బౌద్ధ క్షేత్రాలు వెలసినట్లే జైన క్షేత్రాలు వెలిశాయి. ఇవినేటికీ కొన్ని పూజాపునస్కారాలు పొందుతున్నాయి.

ఈ రెండు మతాల ద్వారా తెలుగుకు ప్రాకృతాలతో అత్యంత ఘనిష్ఠ సంబంధం ఏర్పడింది. కారణం తథాగతుడు, మహావీరుడు ప్రజాభాషలయిన ప్రాకృతాలతో ఉపదేశించడమే. బౌద్ధమతం మన (తెలుగు) సాహిత్యాన్ని అంతగా ప్రభావితం చేయకపోయినా భాషను చాలా ప్రభావితం చేసింది. కొన్ని వందల పాలీ ప్రాకృత పదాలు తెలుగు లో చేరిపోయాయి.

మనం వాల్మీకి రామాయణాన్నే ప్రామాణికమని విశ్వసిస్తున్నాము. తెలుగు సాహిత్యంలోని రామాయణాలలోని అవాల్మీక ఉపకథలన్నిటికీ చాలా వరకు మూలం జైనరామాయణాలు. జైనులు భారత భాగవత రామాయణ హరివంశాదులను తమ మతానుసారంగా తిరగరాసుకున్నారు. తామే నిజమైన ఇతిహాసాలను చెబుతున్నామని కూడా చెప్పుకున్నారు. కాని మూల పాత్రలకు అవమానకరమైన కథలేమీ వారు అంటగట్టలేదు.

తెలుగు సాహిత్యానికి బౌద్ధసాహిత్యం కొంతచేరింది. జాతక కథలు, పిటకాలలోని భాగాలయిన ధామ్మపదం వంటివి అనూదితాలయినాయి. నిజానికి పిటకాలు తెలుగులో యథాతథంగా అనువాదం కావాలి. దానివల్ల నైతిక, సాంఘిక, ఆధ్యాత్మిక, భాషా, చరిత్ర, భౌగోళిక విషయాలు ఎన్నో తెలుస్తాయి. తెలుగులో సాహిత్యం సుసంపన్నమవుతుంది.

జైన సాహిత్యం మనకు ఏ మాత్రమూ చేరలేదు. శ్రీపంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు ఏవో కొన్ని జైన కథలు అనువదించడం తప్ప. కనుక జైన సాహిత్యం అనువాదం అత్యవసరం. ఇందువల్ల రామాయణకథకు ఎన్నో ఉపకథలు చేర్చిన జైనరామాయణం వల్ల ఏదిఏదో తెలుగువారికి తెలుస్తుంది.

జైన రామాయణంలో మూడు సంప్రదాయాలున్నాయి. 1. విమలసూరి సంప్రదాయం 2. సంఘదాససంప్రదాయం. 3. గుణభద్ర సంప్రదాయం. వీటిలో విమలసూరి సంప్రదాయమే ఎక్కువ వ్యాప్తిలోకి వచ్చింది. లోకప్రియమైన

రామకథను జైన ధర్మపుమూసలో పోయడానికి తొలిసారిగా ప్రయత్నించిన వాడు విమలసూరి. ఇతనిని తరువాత ప్రాకృత, సంస్కృత కవులు అనుసరించారు. ఇతడు క్రీ.శ. ఒకటవ శతాబ్దంవాడు. ఇతనిని అనుసరించి శీలాచార్యుడు (క్రీ.శ. 868)చావుపన్న మహావూరి సచరియలో అంతర్భాగమైన రామలక్కణచరియం రచించాడు. 2. భద్రేశ్వరుడు కహావళిలో రామాయణం (11వ శతాబ్ది) 3. భువనతుంగసూరి సీతాచరియ, రామలక్షణచరియ (8వ శతాబ్దం) 4. హరిభద్రుడు ఉమచరియ (6వశతాబ్ది) రచించారు.

విమలసూరి రామాయణం పేరు 'పఉమాచరిఉ' అంటే పద్మచరితం. రాముడి ముఖం, చేతులు, పాదాలు, హృదయం పద్మాలుగా ఉన్నందున రామునికి 'పద్మఉ' అని పేరుపెట్టారు. (కన్నడ ఆదికవి అయిన పంపమహాకవి తెలుగులో పద్మపురాణం (జైనరామకథ) పూరకుడని ప్రతీతి. దానిలోని కొన్ని పద్యాలను శ్రీమానపల్లి రామకృష్ణకవిగారు ఉదాహరించారు.

అని రామచంద్ర తెలుగు సాహిత్యంపై బౌద్ధజైనగాథల ప్రభావం వివరిస్తూ పద్మ చరితం నూటయాభైఎనిమిది (158) పర్వాలగ్రంథమనీ దీన్ని తెలుగులో వ్యవహార భాషలో అనువదిస్తే బాగుంటుందనీ ఒక నివేదికలో కోరారు. దీని హిందీ అనువాదం లభిస్తుందనీ చెప్పారు.

లీలావతికథ ప్రాకృత కావ్యమనీ ఇందులో 1300 ఆర్యలున్నాయనీ సాతవాహన చక్రవర్తి హాలుడు సింహళరాజకుమార్తెను వివాహమాడడం దీని ఇతివృత్తమనీ, ఈ కావ్యంలో సప్తగోదావరి మొదలైన తెలుగుదేశం ప్రస్తావన ఉందనీ చెప్పారు.

తెలుగుభాషకూ ప్రాకృతానికీ ఉండే సంబంధం తెలిపే ప్రాకృత భాషా వాఙ్మయచరిత్ర అవసరమన్నారు. ప్రాకృతం నేర్చుకోవడానికి తెలుగువారికి కొన్ని వాచక పుస్తకాలు రెండుభాషలలోంచి కొన్ని అనువాద ఖండాలతో కూర్చడం ఎంతో ఆవశ్యకమని రామచంద్ర అభిప్రాయపడ్డారు. తెలుగు విశ్వవిద్యాలయం వారికి ఈ 'ప్రాజెక్టు'లను ఆయన సూచించినా పని ఏమీ జరగలేదు.

రామచంద్ర తెలుగు వారి పూర్వ చరిత్ర, సంస్కృతి, భాషాసాహిత్య విభవం తెలుసుకోవడానికి సర్వాత్మనా ఉత్సహించే పరిశోధన ప్రవణుడు. బహుశా హంపీ

విజయ నగర ప్రాంతంలో ఆయన చిన్నతన మంతా గడవటం ఇందుకు కారణం కావచ్చు.

90 సంవత్సరాల కిందట కొమర్రాజు వెంకటలక్ష్మణరావు హిందూ మహాయుగమనే తమ చరిత్ర రచనలో ఇట్లా అన్నారు. "నన్నయభట్టు నకు బూర్వము తెలుగు బాస యెట్టి స్థితిలో నుండెనో మనకు దెలియు నుపాయమేమియు లేదని యనేకులనుకొనుచున్నారు. కాని యాంధ్రదేశమందలి బెజవాడ, ధరణికోట, అమరావతి జగ్గయ్యపేట, మొదలయిన స్థలముల లోని స్తూపములలోను, విహారములలోను ఉండిన బౌద్ధులచే వ్రాయబడిన పాలీగ్రంథము లెచ్చట నున్నవో కనుగొని మనము వానిని శ్రద్ధతో బరిశీలించిన, నాంధ్రదేశమునుగురించియు, నితర దేశములను గురించియు ననేక నూతనాంశములు తెలియగలవని మాయొక్క నమ్మిక".

రామచంద్ర నమ్మకం కూడా అదే. లక్ష్మణరావు 1907వ సం. ముందే యీమాటలురాశారు. రామచంద్ర 1997లో యీమాటలు రాశారు. ఈ అభిప్రాయాలను వ్యక్తంచేశారు. తెలుగుభాష, తెలుగువారు దక్షిణాదికి చెందినా ఉత్తరం నుంచి ఆంధ్రులనే వారి వలసలతో కాలక్రమేణ మమేకమైపోయినారనీ అందువల్ల దేశవాచకంగా, జాతివాచకంగా, భాషావాచకంగా ఆంధ్ర, తెలుగు అనే పదాలు సమానస్ఫూర్తి మంతాలు, సమానార్థకాలు, సమానబోధకాలు అయినాయని తెలుగుదేశానికి చెందిన గొప్ప విద్వాంసుల అభిప్రాయం. రామచంద్ర అభిప్రాయం కూడా ఇదేననిపిస్తుంది. కోరాడ రామకృష్ణయ్య, మారేపల్లి రామచంద్రశాస్త్రి వంటి వారి అభిప్రాయమిదే అయినట్లు వారి రచనల వల్ల తెలుసుకోవచ్చు. మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు తాము కూర్చదలచిన గొప్ప తెలుగు నిఘంటువు నిమిత్తం ప్రాకృతం, పాలీ, మాగధి, అర్ధమాగధి మొదలైన నిఘంటువులు సంప్రదించినట్లు తమ తెలుగు నిఘంటువుల చరిత్రలో చెప్పారు. ఇందుకోసం వారు కలకత్తా వంటి దూరప్రాంతాలకు వెళ్ళి శ్రమించినట్లు తెలుస్తున్నది.

ఏ కొంచెం సందర్భం వచ్చినా రామచంద్ర హాల చక్రవర్తి సంకలిత, పాక్షిక

విరచిత గాథాసప్తశతిని అతి ఉల్లాసంతో ఉదాహరిస్తారు. ఆయన తన పుస్తక ప్రచురణ అభిమాన సంస్థకు ప్రాకృత అకాడెమీ ప్రచురణలుగా నామకరణం చేశారు. ప్రాకృత అకాడమీ అనే పేరుతో ఒక విద్వత్ పరిశోధక సంస్థను స్థాపించి ప్రాకృతంలో కృషి చేసిన, చేస్తున్న గొప్ప విద్వాంసులకు అనువార్షికంగా ఒక లక్షరూపాయలు బహూకరించాలని ఆయన కలలు కనేవారు.

తెలుగు ప్రాకృతాల సంబంధం అనే వ్యాసంలో (ఇది 1990 వ సం. అఖిల భారత తెలుగు రచయితల సభలు - బెంగూళూరులో చదివారు రామచంద్ర. తెలుగు భాషా సంబంధమైన ప్రాకృతపదాలు సుమారు 500 చూపారు. ఈ వ్యాసంలోనే హాలగాథాసప్తశతిలో తెలుగు పదాలై ఉంటా యివి అని నూరు పదాలు చూపారు. అట్లానే 8వ శతాబ్దికి చెందిన వజ్జాలగ్గమనే సంకలనంలో 24 తెలుగు పదాలు ప్రాకృత వేషంతో ఉన్నాయని పట్టికీకరించారు.

ప్రాకృతం కొన్ని శతాబ్దాలు తెలుగు నాట శాషనభాష కాబట్టి స్థానికమైన తెలుగు పదాలు ప్రాకృతంలో చేరాయని రామచంద్ర అభిప్రాయం. ' ఈవిధంగానే తెలుగు పదాలు ప్రాకృతాలలో చేరి తద్వారా సంస్కృతంలోనూ, సాహిత్యంలోనూ చేరాయి. ప్రాకృత సంస్కృత శాసనాలలో తెలుగు ఊళ్ళయిన వేంపూరు మొదలయిన వాటిపేళ్ళు, దానగ్రహీత పేళ్ళు కనిపిస్తాయి. ప్రస్తుతం మన కులభిస్తున్న అతిప్రాచీన తెలుగు పదాలు శాతవాహన చక్రవర్తుల ద్విభాషానాణేలలోనివి. ఈనాణేలకు ఒకవైపు ప్రాకృతంలోను, మరొకవైపు తెలుగులోను చక్రవర్తుల పేర్లున్నాయి. వీటిని సుప్రసిద్ధ పురాతత్త్వ శాస్త్రజ్ఞులు డా. ఇంగువ కార్తికేయశర్మగారు స్పష్టంగా చదివి 'ఎఫిగ్రాఫికా ఇండికా 4వ సంపుటిలో ప్రచురించారు" అని తెలుగు ప్రాకృతాల సంబంధం అనే ఈ వ్యాసంలోనే రామచంద్ర ఉటంకించారు. తెలుగు పట్ల రామచంద్రకంత అభిమానం. ఈ వ్యాసంలో ఆయన చాలా అపూర్వమైన, ఆశ్చర్యకరమైన విషయాలు తెలియజేశారు. తెలుగుకవులపై ప్రాకృతసాహిత్య ప్రభావం ఎంతో ఉందని రామచంద్ర ఈవ్యాసంలోనిరూపించారు. అవతారికా పద్ధతి, ఆశ్వాసవిభజనకూడా తెలుగుకావ్యాలలో ప్రవేశించడంపై ప్రాకృతసాహిత్యం ప్రభావంనుంచి నేరుగానో లేదా తత్ప్రభావితమైన కన్నడం నుంచో జరిగి ఉంటుందని

రామచంద్ర ఊహ.

1930ల లోనే ప్రాకృతాపభ్రంశ వాఙ్మయమని ఒక వ్యాసం రచించారు. రామచంద్ర. అయితే అప్పటి ఊహలు సరియైనవికావని తర్వాత తెలిసిందన్నారు. దీనిని బట్టి రామచంద్రకు ప్రాకృత సాహిత్యంపట్ల పద్ధెనిమిది, పందొమ్మిదేళ్ళ వయసు నుంచే ఆసక్తి ఉండేదని తెలుస్తున్నది. బౌద్ధమతానికీ బౌద్ధ వాఙ్మయానికీ, జైనమతానికీ, జైనవాఙ్మయానికీ తెలుగు దేశంతోనూ, తెలుగువారి ప్రజా జీవనంతోనూ తెలుగు భాషా సాహిత్యాలతోనూ ఒకప్పుడు ఎటువంటి విడదీయరాని సంబంధం ఉండేదో తెలుపుతూ ఆయన రాశారు. 20వ శతాబ్ది రచయితలలో రామచంద్ర కన్న ఎక్కువ కృషి చేసిన వారు ఈ విషయంలో మరొకరు లేరు.

అసలు ప్రాకృతభాషల పుట్టు పూర్వోత్తరాలను గురించి రామచంద్ర వెలువరించిన అభిప్రాయాలు చాలా మౌలికమైనవి. ఆయనంటారు ' ప్రజలే ప్రకృతులు. వారి భాష ప్రాకృతం. ఈ ప్రాకృతం అప్పటి మేధావులు చేసిన మార్పుతో – సంస్కారంతో సంస్కృత మయింది. ఈ సంస్కారం వేదాల ఆవిర్భావానికి ముందే జరిగింది. సంస్కృత ప్రాకృతాలు రెండూ సమానాంతరంగా అభివృద్ధిచెందాయి.

ఈ ప్రాకృతంతో తెలుగు వారికి గల సంబంధం దాదాపు మూడు సహస్రాబ్దాల నాటిది. మనకు బౌద్ధజైనాలతో కలిగిన ఘనిష్ఠ సంబంధంతో తెలుగు ప్రాకృతాల మధ్య పరస్పర ఆదానప్రదానాలు జరిగాయి. ఈ భాషలు రెండు జన్యజనక సంబంధం కలవా అన్నంతగా కలిసిపోయాయి. అని ప్రాకృతవాఙ్మయాన్ని గూర్చిన తమవ్యాస సంపుటిలో విషయ పరిచయ సారాంశంగా ప్రకటించారు రామచంద్ర.

ఏ విషయమైనా, అందులోని సత్య పరమార్థం జిజ్ఞాసు యోగులకు స్వయంగా సాక్షాత్కరిస్తుంది అంటారు రామచంద్ర. నిజంగా ఆయనది జిజ్ఞాసయోగమే. తపస్వులకు తాము కోరిన ఇష్టదేవతామూర్తి సాక్షాత్కారమవుతుందంటారు పెద్దలు. రామచంద్ర తనసాహిత్య కృషినంతా తపస్సులాగే చేసుకున్నారు.

క్షేమేంద్రుడి బోధిసత్త్వ అవధాన కల్పలతను రామచంద్ర తన 20 ఏళ్ళ వయస్సులోనే చదివారు. ఇది బుద్ధదేవుడి పూర్వజన్మలకు సంబంధించింది. ఈ గ్రంథం భారతదేశంలో దొరికిందికాదు. బర్మాలో లభించింది. 1920లో రాయల్

ఏష్యాటిక్ సొసైటీవారు ప్రచురించారు. చదివి నప్పుడే దీనిని అనువదించాలన్న అభిలాష కలిగిందన్నారు రామచంద్ర. 1963లో దీనిని మొదటిసారి ప్రకటించారు. తక్కిన భారతీయ భాషలలో అప్పటికి ఈ గ్రంథం ప్రకటితమైందో లేదో! అట్లానే 'లలిత విస్తర' మనే అపురూపమైన బౌద్ధమత మహాగ్రంథాన్ని రామచంద్ర బులుసు వారితో కలసి అనువదించారు.

1935 నుంచే నేను గాథసప్తశతిని, తక్కిన ప్రాకృత కావ్యాలను అధ్యయనం చేస్తూ వచ్చానని రామచంద్ర 1978లోనే రాసుకున్నారు. అది వారు ఆజీవం కొనసాగించారు. అంటే 60 సం.ల పైగా వారు ప్రాకృత వాఙ్మయక్షీరవారాశిని మథించారు. 'గాథసప్తశతిలో చాలా తెలుగు పదాలుండే అవకాశముందని స్ఫూర్తినిచ్చిన వారు వేటూరిప్రభాకరశాస్త్రి గారని రామచంద్ర కృతజ్ఞతతో శాస్త్రిగారిని స్మరించుకున్నారు. అప్పటికే ప్రాకృత అకాడమి రామచంద్ర గారిని మురిపిస్తున్నది. ప్రాకృత అకాడమీపేరున వచ్చిన తొట్ట తొలుతటి ప్రచురణ ఇది.

గాథాసప్తశతిలోని తెలుగు పదాలనే పేరిట వచ్చిన రామచంద్రగారి వ్యాస సంకలనం ప్రశస్త మైన రచన. గాథాసప్తశతిని కాళిదాస మహాకవి అనుకరించాడు. అని రమ్యమైన ఉదాహరణలు చూపారు రామచంద్ర. గాథసప్తశతిలో గ్రామజీవన సౌందర్యం అనే వ్యాసంలో 150 గాథలను ప్రాకృతములలోనే ఉదాహరించివాటిని చక్కగా అనువదించారు రామచంద్ర. 'గాథాసప్తశతి తెలుగు గడ్డపై వెలసిన రచన అని రామచంద్ర అభినివేశం. ఈ గాథలు రచించిన వాళ్ళంతా ప్రజాకవులని ఆయన కైవారం. సాహిత్యంజాతి జీవనప్రతిబింబమన్నారు కనుక తెలుగు జాతి జానపద లావణ్యం ఈ గాథలలో తొణికిసలాడుతున్నదని రామచంద్ర సంతోషం. ప్రవరసేనుడి సేతుబంధకావ్యాన్ని మూలంతో తెలుగులో చదవాలని రామచంద్ర తెలుగు వారిని ఊరిస్తున్నారు. ప్రాకృత సాహిత్యాన్ని గూర్చి తెలుగు వారికి పదే పదే 'రమ్యాణివీక్షగా' రామచంద్ర వివరించారు



# 13. గవేషణ శీలం

మానవ జీవితాన్ని ప్రభావితం చేసే, పరిపూర్ణంచేసే, ఉద్వేగ పరచే ప్రాతిపదిక ప్రవృత్తులను గూర్చి లోతుగా తరచి తెలుసుకోవాలన్న కుతూహలం కలవారు రామచంద్ర. చరిత్ర, సంస్కృతి, విజ్ఞానం, కళలు, ఏవిధంగా పరిణమిస్తున్నాయో అధ్యయనం చేయడం, ఆయనకు తీరని పిపాస. తన అధ్యయనం ద్వారా కొన్ని నూతన విషయాలు ప్రతిపాదిస్తారు. ఊహలు చేస్తారు. విజ్ఞుల ఆమోదానికి వాటిని సమర్పిస్తారు. ఆయన నిరంతరాన్వేషకుడు, నిత్యగవేషణాపరుడు.

రామచంద్ర చమన్‌లో సైన్యంలో హవల్దార్‌క్లర్క్‌గా పనిచేస్తున్నప్పుడు వాళ్ళ బెటాలియన్‌కు మిలటరీ డాక్టరు కడప వెంకటకృష్ణ. ఈ బెటాలియన్ మొత్తానికి వాళ్ళిద్దరే తెలుగు వాళ్ళు. రామచంద్రపై కక్షసాధించదలచిన ఒక అధికారి రామచంద్రను కోర్టు మార్షల్ చేయించడం, దైవవశాన ఆయన రక్షితుడు కావడం జరిగింది. సైన్యంలో పనిచేయడం రామచంద్రకు ముఖం మొత్తింది. ఆయన ఉద్యోగానికి 'గుడ్‌బై' చెప్పదలచుకున్నాడు. వెంకట కృష్ణగారు ఇందుకు సాయంచేశారు. తాత్కాలికంగా రామచంద్రను క్వెట్టా బదిలీ చేయించారు డాక్టరు.

క్వెట్టా నుంచి ఆయన లాహోర్ రైలెక్కాడు. రోహ్రీ జంక్షన్‌వస్తున్నది. అప్పుడు బోగీలో ఒక చరిత్ర విద్యార్థి పరిచయం కావడమేమిటీ? 'పండిత్‌జీ, మనమిక్కడ సింధూనదిలో స్నానం చేద్దామని ప్రోత్సహించడమేమిటీ! 'రామచంద్ర ఆ చరిత్ర విద్యార్థిని అనుసరించాడు. రేపటి గూర్చి ఆలోచనెప్పుడూ లేదు రామచంద్రకు. ఇవాళ గడచినట్లే రేపుగూడా గడుస్తుందని ఆయన నిబ్బరం. ఇతిహాస ప్రాధాన్యమున్న 'మొహంజొదడొ' చూడకపోతే ఎట్లా? అని ఉత్కంఠను ప్రేరేచాడా విద్యార్థి. ఇద్దరూ హైదరాబాద్ సింధ్ చేరారు. అక్కడ సింధునదిలో స్నానం చేశారు. ఇక మొహంజదడొ పట్ల అత్యంతాసక్తి కనపరచి ఆ పురాచారిత్రక ప్రదేశం అట్టుపుట్టాన వాళ్ళన్నీ పరిశోధించారు రామచంద్ర. తనకు పదేళ్ళప్పుడు మోహంజొదడో, హరప్పాల తవ్వకాలగూర్చి పత్రికల వార్త చూడటమే కాక తరవాతెప్పుడో ఆయన

ఈ విషయాలు చదివారు. లాహోర్ మ్యూజియంలో ఆ తవ్వకాలలో బయల్పడ్డ విశేష వస్తువుల ప్రతికృతులు చూశారు. అందువల్ల ప్రత్యక్షంగా చూడాలన్న ఉత్కంఠ కలిగిందన్నారు రామచంద్ర. మొహంజొదరా అంటే మృతుల దిబ్బ అని చెప్పారు రామచంద్ర. సింధురాష్ట్రంలో (ఇప్పుడు పాకిస్తాన్) లార్కానా జిల్లాలో లార్కానీ పట్టణానికి సమీపంలో సింధునది ఒడ్డున ఉంది ఈ ప్రదేశం.

అప్పటి బ్రిటీష్ ప్రభుత్వపు పురాతత్త్వశాఖ డైరెక్టర్ జెనరల్ జాన్ మార్షల్ ఈ దిబ్బలనుచూశాడు. ఇక్కడేదైనా పురాతన నగర శిథిలావశేషాలు బయట పడవచ్చుని ఆయన ఊహించాడు. 1921-27ల మధ్య యీదిబ్బల తవ్వకాలు జరిపారుట. మూడు మైళ్ళ చదరపు వైశాల్యంలో ఈ తవ్వకాలుజరిగాయి. ఇక్కడి శిథిలావశేషాల పై మార్షల్ 3 సంపుటాలు రచించారుట. తర్వాత మరో 6 సం.లు జె.హెచ్ మాక్కేఅని అధికారి మరోకొన్ని తవ్వకాలు జరిపించాడని రామచంద్ర రాశారు. భూమిలో కూరుకొని పోయిన పెద్ద ఇటుక గోడలు, పొడవు వెడల్పుల ఆకృతులతో బయటపడ్డాయట. అవి కోటగోడలు. యజ్ఞశాలలు, ధాన్యపు కొట్టాల వంటి నిర్మాణాలు, తీర్చిదిద్దిన వీధులు, గృహనిర్మాణంలో గాలీ వెలుతురు కోసం గవాక్షాలు, స్నానాగారాలు, మురుగునీరు పోయే నిర్మాణాలు, శౌచశాలలు కనపడ్డందువల్ల అక్కడ ఒకప్పుడు గొప్ప నాగరికత విలసిల్లిందని వేత్తలు నిర్ణయించారుట. ఈ తవ్వకాలలో రెండువేలదాకా గట్టి మట్టి ముద్రలు దొరికాయి. వీటిపై వివిధ జంతువుల ఆకృతులున్నాయి.

ఒక ముద్రికపైన ఎద్దుకొమ్ముల కిరీటంతో సింహాసనం అధివసించిన యోగి కన్పించాడు. ఆయన చుట్టూ వివిధ క్రూర జంతువులు పరివేష్టించి ఉన్నాయి. కొన్ని ముద్రికలపై ఏవో చిత్రచిత్రమైన లిపులున్నాయి. ఈ మట్టి అచ్చులను నాణేలుగా వాడేవారని కొందరు పరిశోధకుల ఊహ.

రకరకాల నగలతో స్త్రీ ప్రతిమలు, గొడ్డళ్ళు, కత్తులు, స్ఫటికహారాలు, నీలాలసరులు, బంగారు గొలుసులు కూడా లభించాయి. వీటి నక్కడే గొప్ప మ్యూజియంలో భద్రపరిచారు. వాటన్నిటినీ శ్రద్ధగా పరిశీలించానన్నారు రామచంద్ర. అక్కడ నుంచి వాళ్ళు హరప్పా వెళ్ళారు. ముందుగా ముల్తాన్

వెళ్ళారు. ఎందుకంటే లాహోర్‌లో పరిచయమైన తన మిత్రుడు గోపాల్ అక్కడ సంస్కృత పాఠశాలలో చదువుకుంటున్నాడట. అతణ్ణి చూడాలనిపించింది అంటారు రామచంద్ర. ముల్తాన్ లో అతడికోసం సంస్కృత విద్యాసంస్థలన్ని తిరిగి తిరిగి తనపాత స్నేహితుణ్ణి పట్టుకున్నాను అంటారు రామచంద్ర. ఇక హరప్పా విశేషాలన్నీ ఆసక్తికరంగా విశ్లేషించారు స్వీయచరిత్రలో. ఈ లిపి నుంచే బ్రాహ్మీలిపి వచ్చిందని ఊహించారు.

ఈ ముద్రలు, బొమ్మలు, చెట్టు మీద రెండు పక్షుల ముద్రిక చూస్తే పూర్తిగా ఆర్య సంస్కృతి ఋగ్వేద సంస్కృతికి సంబంధించినదేనని నా విశ్వాసం అంటున్నారు రామచంద్ర. డాక్టర్ సునీత్‌కుమార్ చటర్జీ అన్నట్లు భారతదేశ పురా సంస్కృతి ఆర్య, ఆర్యేతర సమ్మేళనమని రామచంద్రభావించారు. చెలిమితోనే ఇది జరిగిందని ద్వేషం, ధ్వంస సంస్కృతి కాదనీ అన్నారు.

లాహోర్‌లో తాను మొహంజదొడో హరప్పాలు దర్శించడానికి ప్రేరకుడైన, కారకుడైన ఆ చరిత్ర విద్వాంసుడికి వీడ్కోలు చెప్పి ఢిల్లీ రైలెక్కానన్నారు రామచంద్ర. అయితే అమృత్‌సర్ కన్పించగానే అక్కడ దిగిపోయారట. ఇదివరలో అమృతసర్ ఒకటి రెండు సార్లు ఆయన చూడకపోలేదు. అయినా అమృతసర్ రామచంద్రకు ఒకదివ్యక్షేత్రం. 'అమృతసర్‌లో జలియన్‌వాలాబాగ్‌లో జనరల్ ఓ.డయ్యర్ కాల్పులు జరిపించి వందల మందిని పొట్టబెట్టుకున్నప్పుడు తుపాకి గుండ్లు తగిలి రంధ్రాలేర్పడిన గోడలను మరోసారి దర్శించాలన్న కోరిక కలిగిందట. ఆ తోటకానుకొని ఉన్న మూడంతస్తుల గోడలో పదుల సంఖ్యలో రంధ్రాలున్నాయి. ఆ మేడ యజమాని ఆ గోడను దర్శించటానికి వచ్చిన వాళ్ళందరికీ ఆనాటి సంగతులు పూసగుచ్చినట్లు చెపుతాడట. ఆ రంధ్రాలను దర్శించి వాటిని చేతులతో తడిమితడిమి, వదలలేక వదలలేక మళ్ళీ ఢిల్లీ రైలెక్కాను అన్నారు రామచంద్ర. ఆయన అంతటి భావావేశి. త్యాగధనుల వీరమరణ సంస్మరణ ఉత్తేజితుడు.

యాదృచ్ఛికంగా కాన్పూరులో ఒక పూర్వ పరిచితుడు కలసి మనం నేపాల్ వెళ్ళి కలప వ్యాపారం చేద్దామంటే సరే నన్నాడాయన. ముందువెనుక లాలోచించలేదు. ఈ స్నేహితుడు తన స్వగ్రామం వెళ్ళి మళ్ళీ మూడురోజుల్లో

వస్తానని ముప్పైతొమ్మిది రోజులదాకా రాకపోయినా నెలరోజులపైన ఉభయ సంధ్యల్లో మూడుదోసిళ్ళ గంగాజలం మాత్రం తాగి, పస్తులుండి నిరీక్షించాడు గంగాతీరంలో. రామచంద్రది ఒక విచిత్ర వ్యక్తిత్వం. ఆయన ఒక యోగి అనిపిస్తుంది. జీవితం నిండా నిర్లిప్తతను సాధనచేసి, సిద్ధిపొందినట్లనిపిస్తుంది. మానవజీవితంపట్లా, జీవితాన్ని ప్రభావితం చేసే చోదక శక్తుల పట్ల, వాటిని తెలుసుకోవాలనే కుతూహలం ఆయనలో ఏళ్ల తరబడి కనబడుతూ వచ్చింది.

సైన్యంలో హవల్దారు గుమాస్తాగా రామచంద్ర పనిచేస్తున్నప్పుడు అక్కడాయనకు ఫతేసింగ్, కర్నైయిల్ సింగ్ అనే రాజపుత్ సిపాయి లిద్దరు మిత్రులైనారు. వాళ్ళిద్దరు ఏకోదరులు. అన్నదమ్ములు. అయితే మా అన్న అంటాడు కర్నైయిల్ సింగ్. తమ్ముణ్ణి మా బాబాయి కొడుకంటాడు ఫతేసింగ్. ఇదేమిటో చాలాకలవరపెట్టింది రామచంద్రను. ప్రేమ్‌చంద్ కథల్లో ఇటువంటి సంఘటనలు చదివాను కాని వీళ్ళిద్దరి జన్మానుబంధమేమిటో తెలుసుకోవాలని చాలా ఆత్రుత కలిగిందంటారు రామచంద్ర. ఫతేసింగ్ చాలా దగ్గర మిత్రుడే ఈయనకు. అమృతం కాస్తరుచి చూడవయ్యా అంటూ ఒకే ఒకసారి బలవంతాన జానీవాకర్ విస్కీరుచి చూపించాడట రామచంద్రకు. మరెప్పుడూ ముట్టుకోకు అని ఒట్టు వేయించాడట. కర్నల్ సింగ్‌కు 20 ఏళ్ళ వయసు. చిన్నవాడు. వీళ్ళనడిగే దేముంది. వీళ్ళ స్వగ్రామం పోయి వీళ్ళ తల్లినే చూస్తే ఆమె చెప్పకపోతుందా అనుకున్నారట రామచంద్ర. అట్లానే ఆయన ఒకసారి జలంధర్‌లో దిగారు. అక్కడికి 5 మైళ్ల దూరంలో 'పాన్సటా' అని ఆ అపూర్వసహోదరుల గ్రామం. అప్పుడు కర్నైయిల్ సింగ్‌కూడా శెలవుపై గ్రామంలోనే ఉండవచ్చునని రామచంద్ర ఊహ. జొన్నచేలల్లో, మొక్కజొన్న చేల మధ్యనడచి రామచంద్ర పాన్సటా చేరారు. కర్నల్‌సింగ్ ఇంటికోసం వాకబు చేస్తుంటే అతడే కనపడ్డాడు. ఆనందంగా ఇంటికి తీసుకొని వెళ్ళాడు. ఆ అపూర్వసహోదరుల తల్లి దగ్గర సొంత కొడుకుకన్నా చనువు సంపాదించాడు రామచంద్ర. రెండురోజుల్లోనే 'ఏం చేసిపెట్టమంటావురా, తీపిపిండివంటనాయనా' అని కూడా రామచంద్ర నామె ముద్దుచేసింది. ఇంతలో ఎవరో పెద్దమనిషి ఇంటికి రాగా కర్నైయిల్ సింగ్ ఆయన్ను రామచంద్రకు నా తండ్రి అని పరిచయం

చేశాడు. కాసేపుండి ఆపెద్దమనిషి వెళ్ళిపోయినాడు. అప్పుడిక కర్నైయిల్‌సింగ్ తల్లి ఒకటేయేడుపు. ఎందుకమ్మా అని రామచంద్ర బుజ్జగించాడు. ఆ వచ్చినతడు తన పెద్దమరిది అనీ, ఫతేసింగ్ తండ్రి చనిపోయిన తర్వాత బంధువుల బలవంతం వల్ల ఇతణ్ణి మారుమనువు చేసుకున్నానని, ఫతేసింగ్‌కు కష్టం కలిగి ఇంట్లోంచి వెళ్ళిపోయి సైన్యంలో చేరాడనీ పదిహేనేళ్ళుగా అతడినుంచి ఒక్క ఉత్తరం ముక్క లేదని ఆమె కుమిలిపోయింది. 'నాయనా ఇప్పుడు మీ ఇద్దరివల్ల వాడి సంగతి తెలిసింది' అన్నదా మాతృమూర్తి. పంజాబీలలో, రాజ్‌పుత్‌లలో ఇలాటి సంప్రదాయం ఇంకా ఉందని తెలుసుకోగలిగాను అంటారు రామచంద్ర. తేజ్‌సింగ్ అనే ఇంకో సిక్కు సిపాయి మిత్రుడు ఏడాదిపైగా సైన్యంలో తనతో పాటే ఉన్నాడు. అతడొకసారి 'మొన్ననాకు కొడుకుపుట్టాడ'ంటే చాలా విస్తుపోయి రామచంద్ర 'నీవు ఇక్కడే ఏడాది నుంచి ఉన్నావుకదా' అని అడిగారట అతణ్ణి. అతడన్నాడట! 'మా తమ్ముడున్నాడుకదా' మా ఇంట్లోఅని. కాబట్టి కొన్ని కులాలలో కొన్ని తెగలలో ఇటువంటి పద్ధతి ఇంకా ఉంది అనుకున్నారుట రామచంద్ర. వివేకానంద స్వామికి కూడా ఒకసారి ఎవరో టిబెట్‌లో ఇంకా బహుభర్తృత్వం ఉందని చెప్పగా, అన్యాయం, అధర్మం అన్నారుట. కాని అది అక్కడి ఆచారం అన్నారట ఆ చెప్పినవారు. ఈ విధంగా రామచంద్ర వివిధజాతుల జన జీవనకుటుంబ వ్యవస్థల ఆచారవ్యవహారాలు తెలుసుకోవాలని ఆసక్తి చూపారు.

రామచంద్ర లాహోర్ లో ఉన్నప్పుడు అక్కడ అఖిల భారత చరిత్ర వేత్తల సమావేశం జరిగింది. తెలుగు నాడు నుంచి మారేమండ రామారావు, రాళ్ళ బండి సుబ్బారావులు ఆ సమావేశాలకు హాజరైనారట. ఆ సమావేశం ముగిసిన తర్వాత ఆచార్య మారేమండ రామారావు 'చారిత్రకులు చీకటికోణాలు కూడా పరిశోధించాలి' అని తనను వేశ్య వాటికకు తీసుకొని పోయినారని రాశారు రామచంద్ర. అయితే వాళ్ళు కేవలం రెండు గంటలసేపు వివిధ వాడలు తిరిగి వచ్చారుట.

ఇట్లానే గోరఖ్‌పూర్‌లో ఒక మిత్రుడు బలవంతాన, నిర్బంధంగా వేశ్యాగృహాలకు తీసుకొనిపోయినాడని, అతడికి మంచి మాటలు చెప్పి పాపకార్యంనుంచి విముక్తుణ్ణి

చేశానని రామచంద్ర స్వీయ చరిత్రలో రాశారు. మరి అతడితో ఈయన అప్రదేశాలకు వెళ్ళకపోతేనేం? అన్న ప్రశ్న రావచ్చు. మానవజీవన ప్రవృత్తుల గవేషణమే అని దీనికి సమాధానం. రామచంద్ర ఎంత నిర్మలాంతః కరణం కలవారంటే పరస్త్రీలతో సంపర్కం తాను ఆశించకపోవడానికి కారణం ధర్మభీతి కన్నా, పాపభీతి కన్నా, సుఖరోగాలు, పరువు నష్టం (ఎవరికైనా తెలిస్తే) అని నిష్కల్మషంగా రాసుకున్నారు. ఇలా ఎవరు రాసుకోగలుగుతారు? రామచంద్ర అంతఃకరణ పావిత్ర్యం, రుజువర్తనం కలవారు కాబట్టే రాసుకోగలిగారు.

ఇంకో సంగతి రాశారు రామచంద్ర స్వీయ చరిత్రలో. లాహోర్‌లో పురానీ అనార్కలీ అనే ప్రాంతంలో ఆయన ఒకరింట్లో మేడ మీద గదిలో అద్దెకుండేవారు. ఒక ఏడాదిగడిచిందో లేదో ఆ ఇంటి యజమాని మరణించాడు. అప్పుడిక జరిగిన శవయాత్ర, అంత్యక్రియలు భయద విస్మయకరంగా ఉన్నాయని రామచంద్ర రాశారు. వాటన్నిటినీ అంత ఉత్కంఠతో పరిశీలించాల్సిన అవసరం ఈయన కేముంది? సమాజ ప్రవృత్తుల అనుశీలన ఆసక్తి కాకపోతే! పంజాబీగా పుట్టి, మరణించటం మహాపాపం అని వ్యాఖ్యానించారు రామచంద్ర. మరణించిన వ్యక్తి శవాన్ని చూడటానికి వచ్చిన బంధువుల ఏడ్పులు అతిభయంకరం. ఏడ్చేవారు లేకపోతే కూలిచ్చి అయినా ఏడిపిస్తారు! అని రాశారు రామచంద్ర. శవయాత్రను అనుసరించారుట రామచంద్ర. పితృమేధమంత్రాలు దేశమంతా సమానమే అని గమనించారుట. నిజానికి పితృమేధ మంత్రాలు ఈయనకు అప్పటికి పరిచయం ఉండాల్సిన అక్కర ఏ మాత్రం లేదు. ఎప్పుడో ఎక్కడో ఎందుకో గమనించాడు. బహుశా పుస్తకాలలో చదివి వుండవచ్చునాయన. అదీ ఆయనగవేషణ శీలం. స్త్రీలైతే అంతిమ యాత్రలో గుండెలు బాదుకుంటూ, ముఖం కొట్టుకొంటూ, పోయిన వాడికోసం మృత్యుగీతాలు పాడుకుంటూ ఏడుస్తారుట. ఇదంతా రామచంద్ర పరిశీలించాల్సిన అక్కర ఆయనకేముంది! ఆయన గవేషణ శీలం ఇది. ఇంటి యజమాని కూతురు సుమిత్ర. ఆమెను ఇంటి దగ్గర యాదృచ్ఛికంగా ఆ సాయంకాలం చూసి దయ్యాన్ని చూసినంత భయపడ్డానన్నారు రామచంద్ర. ఆమె వక్షస్థలం రక్తసిక్తంగా, ఆమె ధరించిన ఉడుపుల నుంచి కనపడిందట.

పెదవులు, ముక్కులు నజ్జునజ్జుగా కన్పించాయట. ఏమిటీ ఘోరం ఇంత విడ్డూరంగా ఏడవాలా? అని అంటే ఆమె దగ్గరగా వచ్చి ఆయన నోరు తనచేతితో మూసి 'అన్నా ఏం చేయమంటావు? ఇది ఇక్కడి రివాజు'అని చెప్పిందంట. ("ప్రా!కీకర్ణే, ఏత్థే ఏరివాజ్!) 'నీ రివాజు చల్లగుండ! నీవుకోలుకోవటానికి నెలకూడా చాలదన్నారుట రామచంద్ర.

ఈ మోనోగ్రాఫ్ రచయితతో ఒక సారి రామచంద్ర ఒక ఆసక్తికరమైన విషయం చెప్పారు. ఒకసారి ఆయన గుర్రం బండిలో ఎక్కడికోపోతుండగా చోదకుడు గుర్రాన్ని ఒక మోటు తిట్టు (బూతు) తిట్టాడుట. అయ్యో! ఈ తిట్టు తెలుగు వారికి కూడా పరిచితమేనని ఈయన సంతోషపడ్డాడుట. ఈ సంతోషం ఎందుకయ్యా అంటే ప్రాకృత బంధుత్వం రెండు భాషలకూ ఉందని అట.

ఒకసారి ఏదో ప్రసంగంలో వెల్లుల్లి (లశునం) తినడం ఒంటికి మంచిది, తినాలి అన్నారు రామచంద్ర. ఎందుకు? అంటే షిర్డీ సాయిబాబాకూడా అదే చెప్పలేదా అన్నారు. మీకెట్లా తెలిసిందీ సంగతి అంటే షిర్డీ సాయిబాబా కూడా అదే చెప్పలేదా అన్నారు. మీకెట్లా తెలిసిందీసంగతి అంటే షిర్డీలో వెల్లుల్లిబాగా వాడుకచేస్తారన్నారు. ఎప్పుడో అత్తవారి ఊరు సురపురం వెళ్లినప్పుడో, అజంతా ఎల్లోరా గుహలు దర్శించినప్పుడో రామచంద్ర గుల్బర్గా వైపు చేరినప్పుడు షిర్డీ వెళ్ళి ఉంటారు. అక్కడి దేవస్థాన సత్రంలో భోజనం చేసి ఉంటారు. ఆయన చేతస్సు ఎప్పుడూ ఏదో తెలుసుకోవాలని సమాహితంగా ఉండేది. రామచంద్ర మద్రాసులోని గుజరాత్ హోటల్‌లో పనిచేయడం, తిరువళ్ళక్కేణిలోని రామవిలాస్ హోటల్‌లో ఉద్యోగం చేయడం ఎందుకు? అది ఆయన వ్యక్తిత్వంలోని అభిరుచి వైచిత్రి. తానేమైనా హోటల్ వ్యాపారం చేయాలని ఆయన ఎన్నడూ అనుకోలేదు. కలప వ్యాపారం లాభదాయకమంటే మిత్రుడి మొహమాటానికి, నిర్బంధానికి కట్టుపడి అతడికోసం నిరీక్షిస్తూ నెలరోజులు నిరాహారంగా నిరీక్షించాడాయన గంగాతీరంలో, ధర్మసత్రపుగదిలో. తన మిత్రుడి కోసం తిరుపతిలో చదువు కుంటున్నప్పుడే కామవర్ధక లేపనాలు తయారుచేసి ఇచ్చారాయన.



# 14. బృహదారణ్య సంచార ప్రవృత్తి

'**బృ**హదారణ్య కమ్' అనే తమ వ్యాస సంపుటిని ప్రచురిస్తూ తమ సాహిత్య కృషి ఎటువంటిదో స్ఫురింప జేశారు రామచంద్ర. 'మన పూర్వులు అరణ్యాలలోనే మనుగడసాగిస్తూ నిత్య సత్యాలను దర్శించారు. ఆ సత్యాలను పొదివికొన్నవి ఆరణ్యాకాలైనాయి. వేడినీ వెలుగునూ వెలార్చిన అరణులూ ఆరణ్యాకాలే. అంటే ఆయన అభిప్రాయం పూర్వం మన ఋషులు, తత్త్వవేత్తలు, తపస్వులు అరణ్యాలలోనే తమ తత్త్వచింతనం, సత్యదర్శనంచేశారని చెప్పటం. అలనాడు యజ్ఞయాగాదులకు కావలసిన అగ్నిని అనుసంధానంచేసినవి అరణ్యాలే అని. ఇందువల్ల రామచంద్ర తమ సాహిత్య కృషి, సామాజిక చింతన, ఋషి వాటికలలో తత్త్వదర్శులు సాగించినంత నిర్మమంగా, నిర్మలంగా తపస్వితతో సాగించారని భావిస్తున్నారని అనుకోవాలి.

ఈ సంపుటం గూర్చే ఆయనింకా ఇట్లా అభిప్రాయపడ్డారు. ఈ వ్యాస సంకలనంలో రకరకాల పండ్ల చెట్లూ, పూలచెట్లు దర్శనమిస్తాయన్నారు. అగమ్యమైన ముళ్ళ దారులూ ఉన్నాయన్నారు. నాగరికులెరుగని అడవి పండ్లున్నాయన్నారు. అట్లానే రకరకాల పూలున్నాయన్నారు.

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో శ్రీశైల మాహాత్మ్యాన్ని వర్ణిస్తూ అక్కడి పండ్ల చెట్లు కనీవినీ ఎరుగనివి ఎన్నిటినో వర్ణించాడు. ఆ పర్వత సలిల

ధారల అమృతరుచులను ఎంతగానో పొగిడాడు. ఆ రోజుల్లో సోమనాథుడి వ్యుత్పన్నత ఎంతటిదో, ఈ రోజుల్లో ఈ రామచంద్ర వివిధ శాస్త్ర, మనోజ్ఞ కళల పరిజ్ఞాన సంపదకూడా అంతటిదని అనిపిస్తుంది. సంగీతం, సాహిత్యం, సంస్కృతి, మతం, దేనిని గూర్చి చెప్పినా ఎన్నెన్నో విషయాలనో సమన్వయం చేయగలరు రామచంద్ర. ఆయన గొప్ప భావుకుడు. కళాత్మక హృదయంగలవారు.

వివిధ శాస్త్రాల, వివిధ కళల విజ్ఞానాన్ని మక్కువతో సంతరించుకోవడం, గ్రహించటం, సంగ్రహించటం, అనేది ఒక గొప్పప్రజ్ఞ. దానిని తెలుసుకోగోరే వారికి చెప్పటం అంత కన్న గొప్పప్రతిభ. అసలు ఇన్ని విషయాలలో, ఇన్ని శాస్త్రాలలో, అభిరుచి ఉండటం, అధ్యయన శీలత కలిగి ఉండటం, సౌజన్యంతో, అణకువతో తనకు తెలిసిన విషయాలు ఇతరులకు చెప్పగల్గడం, భావుకతతో రాయగలగడం, చదివింపచేయగలగడం రామచంద్ర సాహిత్య వ్యక్తిత్వంలో అత్యంత విశిష్టమైన విషయం.

నిజంగా సాంద్రారణ్యంలో దారులు వెతుక్కోవడంకష్టమే. దారిచేసుకొని వెళ్ళాలి. అయితే రామచంద్ర విజ్ఞానం గహనమైందికాదు. ఆ విషయం చదివే వారికి పూర్తిగా తెలిసినా తెలియకపోయినా చదివే అందరికీ తెలిసేట్లు, ఆహ్లాదం కలిగేట్లు చెబుతారు. దీనికి కారణం ఆయన బహువేత్తగావడం. ఆయనకు సంగీతంలోనూ ఎంత అభిరుచి, ఎంతటి పరిశ్రమ ఉన్నాయో ఆ సందర్భాలు ఆయన వివరించినపుడు ఆశ్చర్యం వేస్తుంది.

"గ్రామైకరాత్రంగా దేశమంతా తిరిగాను. చాలా వరకు ప్రతి రాష్ట్రం లోను వేసే నాటకాలు సంస్కృత నాటకాలు, నృత్యకలాపాలు చూశాను. బెంగాలీల "ఒనాఘ్రెతొంపుస్పొంకిసోలాయొ" విని చెవులు మూసుకున్నాను. ఉత్తరప్రదేశ్ వారు చప్పుయ్, చేపా ఈబాణీలలో చదివే సంస్కృత నాటక శ్లోకాలు విని తులసీదాసుకు, ఆయన ఆరాధ్య దైవమైన జానకీ జానికీ నమస్కారం పెట్టాను. శ్లోకం కంటే రాగానికే ప్రాధాన్యమిచ్చే తమిళుల తీరుకు తల ఊపడం మానుకున్నాను. ఫారసీగజల్ గజల్ లాగా, శేర్ లాగా చదివే పంజాబీల పద్ధతి విని పరుగుతీశాను. చిన్ననాడు విన్న యడవల్లి వారి పురుషకంఠంలోని పస

వినిపించలేదు". అని పద్యాలకు రాగాల నిర్దేశం అనే వ్యాసంలో రామచంద్ర రాశారు. 1930 ప్రాంతాలలో నెల్లూరులో శాకుంతల నాటిక ప్రదర్శన చూడటానికి రామచంద్ర వెళ్ళారు. సంస్కృత కళాశాల విద్యార్థిగా అప్పుడక్కడ చదువుతున్నారు రామచంద్ర. దుష్యంతుడిగా యడవల్లి సూర్యనారాయణగారనే ప్రసిద్ధ నటుడు నటిస్తాడని విని విద్యార్థుల కాళ్ళు నిలవలేదు. శాకుంతలం పాఠం చెప్పుకుంటారు కదా! సంగీత శాస్త్రానికి, నాట్యశాస్త్రానికి అనుగుణంగా యడవల్లి వారు బహుశ్రావ్యంగా శ్లోకాలు చదివి, ఆశ్లోకం పూర్తికాగానే శాకుంతలాంధ్రీకరణం తెలుగు పద్యాలు కూడా చదువుతారట. ఈ యీరాగాలలో ఈ పద్యాలు, శ్లోకాలు చదవాలని వీరికెట్లా తెలిసింది అని రామచంద్రకు ఆశ్చర్యం కలిగిందట. ఆయన ప్రజ్ఞకు,ప్రతిభకు ముగ్ధులైపోయినారుట. అప్పుడు రామచంద్ర వయసు 20 సం.ల లోపే. శాకుంతలానికి వ్యాఖ్యానాలు రచించిన సుప్రసిద్ధ వ్యాఖ్యాత లెవరైనా ఆయాశ్లోకాలకు రాగనిర్దేశం చేశారేమోనని ఆవ్యాఖ్యానాలు పరిశీలించారుట రామచంద్ర. రాఘవభట్టు, వైఖానసశ్రీనివాసాచార్యుడు, కాటయవేముడు మొదలైనవారు శాకుంతలానికి రచించిన వ్యాఖ్యానాలన్నీ చూశారు రామచంద్ర ఉత్కంఠతో. కాని ఆయా వ్యాఖ్యాతలు అర్థాలు, భావాలు చెప్పారే కాని రాగ నిర్దేశం చెయ్యలేదు. అంతటితో రామచంద్ర ఊరుకోక కాళిదాసునాటికలు విక్రమోర్వశీయం, కూడా పోనీ ఫలాని శ్లోకానికి ఫలాని నిర్దేశం దొరుకుతుందేమోనని చూశారు. శ్రీహర్షుడినాగానందం,ప్రియదర్శిక వ్యాఖ్యానాలు చదివారు. పోనీ సంస్కృతసాహిత్యాన్ని వదిలేద్దాం. తెలుగు యక్షగానాలలో ఆయా పాటలకు రాగ నిర్దేశం ఉందా అని శోధించారుట. రుద్రకవి సుగ్రీవవిజయం సంపూర్ణ యక్షగానమన్నారు కాబట్టి అది తెలుగు నాటకానికి పూర్వరూపమన్నారు, కాబట్టి దాన్ని పరిశీలించారు. అక్కడక్కడ తాళనిర్దేశమేకాని రాగబోధం కనపడలేదు. తరువాత ఎవరో పండితుడు చెప్పారుట రామచంద్రకు, రాగం రమణి, తాళం కాలపురుషుడు, స్వేచ్ఛగా సంచరించదలచే రాగాన్ని కట్టుదిట్టంగా కట్టివేసేది తాళం, కనుక తాళం ప్రధానం కాని రాగం కాదు అని వివరించారుట. ఒక పాటను ఏరాగంలో నన్నా పాడుకోవచ్చు, తాళం మాత్రం చాలా వరకు మారదు

అన్నారుట ఆ పండితుడు. రామచంద్ర ఈ జిజ్ఞాసతో సంగీత శాస్త్రం అధ్యయనం చేశారు. ఆయా రాగాలు పాడవలసిన ఋతువులు, వాటి స్వరూప స్వభావాలు, కాలదేశాలు సంగీత శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. ప్రధానరాగాలు 32. ఇందులో పురుషరాగాలున్నాయి. స్త్రీరాగాలున్నాయి అని శివతత్వరత్నాకరమనే సంగీత గ్రంథం నుంచి తెలుసుకున్నారు రామచంద్ర. దీని రచయిత అయిన బసవరాజు ఈ యీరాగాలు ఏయే సమయాలలో (ఏయే యామాలలో) పాడాలో చెప్పారుట. అప్పుడే అవి రక్తి కడతాయని చెప్పారుట. 'రాగవిబోధం' అనే సంగీత శాస్త్రం రచించిన సోమనాథుడు ఉత్తమ, మధ్యమ, రాగాలు నిర్ణయించి ఆ రాగాలు పాడాల్సిన వేళలు ఉదయం, పగలు, సాయంత్రం, రాత్రి అని నిర్ణయించాడుట.

ఇక సంగీత సమయసార రచయిత పార్శ్వ దేవుడు ఏయే రసోత్కర్షకు ఏయే రాగాలు పాడాలో నిబంధించారుట. సంగీత దర్పణ కారుడైన చతుర దామోదరసూరి రాగాలు పాడటంలో ఫలాని సమయం నుంచి ఫలాని సమయం అని కొంత వెసులుబాటు కలిగించాడుట. సంగీత పారిజాతంలో ఆహోబలుడు ఉదయం పాడాల్సిన రాగాలు, ద్వితీయప్రహరోత్తరంలో పాడవలసినరాగాలు, తృతీయ ప్రహరోత్తరంలో పాడవలసినవీ పేర్కొని, నీలాంబరి, ముఖారి, భైరవి, లలిత, మేఘనాదం, ఆనందభైరవి, సావేరి రాగాలు, "సర్వదాచసుఖప్రదా" అన్నాడని రామచంద్ర యీ వ్యాసంలో రాశారు.

పచ్చకప్పురపు తిరువెంగళనాథుడు కూడా (క్రీ.శ. 1540 కాలం ) వేళలెరిగి యాయా స్వరములేర్పరచి పాడాలని నిర్దేశించారని రామచంద్ర సమర్థన. సంగీత దర్పణ కర్త రాజుగారు కోరితే ఏ సమయంలో నైనా పాడాలని హెచ్చరిక చేశాడుట. శివతత్త్వ రత్నాకరమనే సంగీత శాస్త్ర రచయిత బసవరాజు వివాహసమయాలలో, దేవతోత్సవస్తుతులలో ఏ రాగమైనా ఇష్టం వచ్చినట్లు పాడవచ్చునని అనుజ్ఞ ఇచ్చాడుట. ఇంత సంగీత శాస్త్రం ఆకళింపు చేసుకున్న రామచంద్ర వసుచరిత్రలో భట్టుమూర్తి సంగీత పాండిత్యాన్ని వివరించకుండా ఊరుకుంటారా? అసలీ జిజ్ఞాస, ఈ తత్త్వ విచారం, ఈ పరిశ్రమఅంతా ఎందుకు కలిగిందంటే ఆ రాత్రి యడవల్లి సూర్యనారాయణగారు శాకుంతలం చతుర్థాంకంలో 'కింశీతలైః ' అని కన్నడ

రాగంలో ఎత్తుకున్నారనీ, అది మహామధురాతి మధురంగా నిర్వహించారనీ అది తుర్యయామగేయరాగమనీ అదీ ఆయన సంగీత ప్రజ్ఞ అనీ ఆయనకు నటనలో, సంగీతంలో శిక్షణ ఇచ్చిన గురువులు ధన్యులనీ రామచంద్ర కైవారంచేశారు.

ఇంత సంగీత శాస్త్ర జ్ఞానం ఆయన సముపార్జించారు కాబట్టే త్యాగరాజ స్వామిని గూర్చి, దాలిపర్తి పిచ్చిహరిగూర్చి, ద్వారం వెంకటస్వామినాయుడి గూర్చి, ఎం.ఎస్.సుబ్బలక్ష్మిని గూర్చి, ఉస్తాద్ బడేగులాం అలీఖాన్ గూర్చి, షేక్ చినమౌలాసాహెబ్‌గూర్చి రాసిన వ్యాసాలలో రామచంద్ర సంగీత శాస్త్రం విద్వత్త అంతా కనపడుతుంది.

అట్లానే తెలుగు వారి చిత్ర కళను గూర్చి రాస్తూ వరదా వెంకటరత్నం గారిప్రతిభను వివరిస్తూ ఎన్నెన్నో అపూర్వమైన చిత్ర కళారహస్యాలు వివరించారు రామచంద్ర. దేవీప్రసాదరాయ్ శిల్ప కళాప్రతిభను వివరిస్తూ, లలిత కళల ప్రభావం మానవాళిపై ఎలా పనిచేస్తుందో ఎంతో ఆలోచనామృతంగా వివరించారు. రాయ్ చౌదరి రంగుల చిత్రాలు, పోతబొమ్మలు ఎంతటి విశిష్ట కళాఖండాలో, వాటి రామణీయకమేమిటో కూడా వివరించారు రామచంద్ర.

సాహిత్య పరిశ్రమ చేసినవారు వ్యాకరణమో, ఛందమో, అలంకారమో, ఔచిత్యమో, ఆయారచనల సంబంధిగా వివరిస్తూ ఆయా కావ్యనాటక రసచర్చా వైదుష్యాన్ని చూపవచ్చు. కాని ప్రపంచంలో నే ఉన్నతోన్నత మైన హిమాలయ శిఖర ఆరోహణంలోని ఒడుపులను గూర్చి, క్లేశాలను గూర్చి వివరించగలరా? సోషలిజాన్ని గూర్చి చెప్పగలరా? రంగస్థలప్రదర్శనల మెళుకువలు తెలియగల రా? ఆధునిక రాజనీతిజ్ఞత కేవలం సాహిత్య పండితులకు అర్థమవుతుందా? సృజన ప్రతిభ, పాండిత్య ఆర్జవం, బహుముఖప్రజ్ఞాశాలిత వారికి పట్టుబడతాయా? ఆయుర్వేద విజ్ఞాన దీధితులు చూపగలరా?

సంస్కృత వాఙ్మయంలో చెఱకు, బెల్లం, చక్కెరలప్రశస్తి ఏమిటో చెప్పగలరా? చెఱకుప్రసక్తి కౌశిక సూత్రంలో, ఆశ్వలాయన గృహ్య సూత్రంలో, మనుస్మృతిలో ఉందని చూపగలరా? భారత, భాగవతాలలో, కౌటిల్యీయార్థశాస్త్రంలో బెల్లం, చక్కెరల ప్రసక్తి ఎత్తి చూపగలరా? బెల్లంపైన, చక్కరపైనా ఎన్ని సామెతలున్నాయో

చెప్పగలరా? తెలుగు, కన్నడ, తమిళ, మలయాళాలలో పంచదారను ఏమంటారో ఆపేరు ఎట్లా వచ్చిందో వివరించగలరా? శర్కర నుంచే షుగర్ వచ్చిందని భావించగలరా? సంస్కృత వాఙ్మయంలో, ప్రాకృత వాఙ్మయంలో గోదావరి నది సౌందర్య విభవాన్ని గూర్చి తెలియచేయగలరా?

పత్రికా రచయితలు తేనె టీగల వంటి వారని చెప్పారు రామచంద్ర 'వారు వెరపెరుగని తమ వృత్తిలో సేకరించిన మధువుతో పెరవారికి విందుచేస్తారు. పత్రికారచయితగా నేను మధువును చాలా సేకరించాను' అన్నారు రామచంద్ర.

'అంగుళం అనే మాటకు అర్థమేమిటి? అని సాయణభాష్యం, శ్రీరంగనాథ బ్రహ్మతంత్ర పరకాల దేశికుల పురుషసూక్తభాష్యం, దయానంద సరస్వతి వేదభాష్యం పరిశీలించారు. నిరుక్తం పరీక్షించారు. చివరకు ఇంగ్లీషులోని 'ఏంగిల్' అనే పదానికి ఉన్న విస్తృతార్థమే సంస్కృతంలోని అంగుళమనే మాటకు అన్వయిస్తుందని నిర్ధారించుకున్నారు రామచంద్ర. ఈ విషయమై ఇట్లా అన్నారు వారు. 'వైదిక పదాల విషయంలోగాని, లౌకిక సంబంధపదాల మూలస్వరూపంలోగాని సందేహం ఏర్పడి నప్పుడు సాధుత్వాసాధుత్వ విచికిత్స ఏర్పడినప్పుడు సంస్కృత సజాతీయ భాషలు చాల సహాయకారులవుతాయి'. అంటే ఫ్రెంచి, ఇంగ్లీషు, లాటిన్ పదాలను పరిశీలించాలని రామచంద్ర ఆకాంక్ష. ఇంతటి జిజ్ఞాస ఎవరికుంటుంది?

కనుకనే రామచంద్రది బృహదారణ్యక సంచార ప్రవృత్తి అనడం. అరణ్యాలు విజ్ఞాన సంకేతాలు, ఆరణ్యకాలు విజ్ఞాన ప్రతీకలైతే రామచంద్ర రచనలు విజ్ఞాన విలసితాలు, విజ్ఞాన దాయకాలు అనడం ఎంతో సమంజసం.

**తిరుమల రామచంద్ర చెప్పిన అపూర్వమైన విషయాలు కొన్ని:**

"శృంగార నైషధ వ్యాఖ్యలో వేదం వెంకట్రాయ శాస్త్రిగారు 'నూటిడి' అనే ప్రయోగం అర్థం తెలియక, అది లేఖక ప్రమాదమనుకొని 'నూబిడి'అని సవరించారు. కాని 'నూటిడి' అనేదే సాధుపాఠం. నువ్వులు దంచి చేసిన తీపి పదార్థమని దీని అర్థం. ఇడిఅంటే పిండి, పిండిగొట్టడమని తమిళ, కన్నడాలలో అర్థం. కాబట్టి 'నువు ఇడి' నూటిడి' అయింది. వ్యాకరణం ఇక్కడ పనికి రాదు. శ్రీనాథుడంతటి

వాగ్గేయకారుడైన పదకవితాపితామహుడు అన్నమాచార్యుల వారు కూడా ఈ పదం ఇదే అర్థంలో ప్రయోగించాడు.

నాటికరచన, ప్రదర్శన అతిప్రాచీనమైన ప్రక్రియ. రెండువేల ఏళ్ళకిందటే తెలుగు వారికి తెలుసు. గాథాసప్తశతిలో దీనికి ఆకరాలున్నాయి.

కేతన రచించిన ఆంధ్రభాషాభూషణమనే వ్యాకరణం కన్నడంలో నాగవర్మ కేతనకు 1500 సం.ల ముందే రచించిన 'కర్ణాటక భాషా భూషణా'న్ని అన్ని విధాల అనుసరించికూర్చింది. నాగవర్మ వేంగీ ప్రాంతంవాడు. రాజకీయ కల్లోలాలకారణం వల్ల కర్ణాటక ప్రాంతానికి వలసపోయినాడు.

పొగాకును సంస్కృతంలో 'కలంజం' అంటారని మహామహా విద్వాంసులు, నైఘంటికులు, రాశారు. శబ్దార్థచింతామణి, వాచస్పత్యం అనే పరమప్రామాణిక సంస్కృత నిఘంటువులుకూడా ఇదే అర్థమిచ్చాయి. మోనియర్ విలియం సంస్కృత నిఘంటువులోనూ, బృహత్ హిందీకోశంలోనూ ఇదే అర్థం ఉంది. కలంజమంటే పొగాకు అని వీరందరూ ఎలా భ్రాంతి పడ్డారో ఆశ్చర్య కరమే, కలంజమంటే గంజాయి. గంజాయి నమలడం, పొగతాగడం మనకు అతి ప్రాచీనకాలంనుంచే ఉంది. బుద్ధుడి కాలానికే ఉంది. వినయపిటకంలో ఈ విషయం ఉంది. ఔషధంగా గంజాయి పీల్చ వచ్చు నని బుద్ధుడు అనుమతించాడు.

"రచయితలు నేడు వ్యుత్పత్తికి ప్రయత్నించకనే సరాసరి రచనలకు పూనుకొనడం వల్ల అపక్వమైన భాషాభావాలు పలికించి నవ్వుల పాలవుతున్నారు. కాబట్టి వ్యుత్పత్తి అత్యవసరం. కావ్యకర్మలో మనస్సును ఏకాగ్రం చేసినప్పుడే గొప్ప రచన వస్తుందని శ్యామదేవుడనే గొప్ప సాహిత్య లాక్షణిక వేత్త అంటాడు. "సారస్వత మనేది మహారహస్యం. అది విద్వాంసులకే గోచర మవుతుంది. నిపుణతతో సేవించనిదే తెలియదు. ఆ రహస్యసిద్ధికి పరమోపాయం మనస్సమాధే అన్నారు పెద్దలు". అభ్యాసం ముఖ్యమని మంగళాచార్యుడంటాడు"అభ్యాసమంటే ఎడతెగకుండా పరిశ్రమించడం. అభ్యాసమనేది అంతటా ఉపయోగపడి నిరతిశయమైన కౌశలం కలిగిస్తుంది. సమాధి అనేది ఆభ్యంతర ప్రయత్నం. అభ్యాసమనేది బాహ్యప్రయత్నం. ఇవి రెండూ రచయితశక్తిని ఉద్బోధింపజేస్తాయి.

ఈ శక్తి కావ్యహేతువని నా అభిప్రాయం" అంటారు రామచంద్ర.

"బహుజ్ఞత ఉత్పత్తి" అన్నారు ఆచార్యులు.

సంస్కృత ప్రత్యయాలతోనూ ఉపసర్గలతోనూ ఇతర భాషాశబ్దాలు వేషం మార్చుకొని సంస్కృతలో లీనమైనాయని తంత్రవార్తికకారుడు కుమారిల భట్టు వాక్యాలే నిదర్శనం.

కంచిలోను, నాగలాపురంలోను, రామగిరిలోను బల్లుల శిల్పాలు, వాటికి పూజలు చూడగా ఇది అతిప్రాచీనమైన సరీసృపపూజా చిహ్నంగా కనిపిస్తుంది. సరీసృపపూజలో ఒక్క నాగపూజే మనకు దేశమంతటా మిగిలింది. సరీసృపాలు అతిప్రాచీనమైన ప్రాణులు. రాక్షస సరీసృపాలు (డైనోసార్స్) పూర్వం ఉండేవని, వాటి అస్థిపంజరాలు శిలలయి పోయి దొరికాయని పురాతత్త్వవేత్తలు అంటున్నారు. ఆ భయంకర సరీసృపాలు తమకేమీ హానిచేయకుండా పూజించే ఆచారం పూర్వం ఉండి ఉంటుంది. దాని అవశేషమే బల్లుల శిల్పాలని, శిల్పాలలో మకరలతాకల్పనలు, మకరతోరణాలు మొదలైన వని నేను భావిస్తున్నాను.

నాగలాపురంలోని వేదనారాయణస్వామి సుధామూర్తి అంటే సున్నపురాయి విగ్రహం. జలకమాడితే కరిగి పోతాడు. కాబట్టి ఆయనకు తైలాభిషేకమే కాని జలాభిషేకం లేదు.

శ్రీ సునీతి కుమార్ చటర్జీ అన్నట్టు పాలీ భాషలో శాసనాలు వేయించిన ఖారవేలుని పేరు తెనుగే. కారు+వేల్ = నల్లటిబల్లెం కలవాడు.

ఈ పై వివరించిన అభిప్రాయాలన్నీ రామచంద్ర ఉపజ్ఞాన్వితంగా ఆయా విషయాలు, ఆయా సందర్భాలలో వివరిస్తునప్పుడు చెప్పినవి. ఇందువల్ల ఆయన అపార సాహితీ పరిశ్రమ తెలుస్తున్నది. శాస్త్ర విషయాలలో, లోక కావ్యాద్యవేక్షణలో ఆయన ప్రతిభ నిరుపమానమని నిరూపణ అవుతున్నది.



# 15. దేశాటనం, పండిత మిత్రతా చ .....

**20**వ శతాబ్దపు తెలుగు సాహిత్య పరులలో ఎవ్వరూ రామచంద్ర చూసినంత దేశం చూడలేదు. భారతదేశ వివిధ భాషలగూర్చి తెలుసుకోలేదు. తమ సమకాలీన ఇతర పండితులను కవులను కలుసుకోలేదు. చారిత్రక ప్రదేశాలు సందర్శించలేదు. కళలూ, శాస్త్రాలూ అధ్యయనం చేయలేదు. ఆయనచదివి నన్ని తాళపత్రగ్రంథాలూ, ముద్రితాలూ చదవలేదు. ఆయన చేసినన్ని పుస్తక సమీక్షలు చేయలేదు.

అదీ రామచంద్ర విశిష్టత, విలక్షణత, ప్రత్యేకత.

దేశమంతా తిరిగి చూస్తే దృక్పథం విశాలమవుతుంది. ప్రజ్ఞ విస్తృతి పొందుతుంది. ప్రతిభ నిశిత మవుతుంది. ఎన్నెన్నో విషయాలు తెలుస్తాయి.

రామచంద్ర శ్రీవైష్ణవ కుటుంబంలో జన్మించారు. కాబట్టే చిన్నతనంలోనే సమాశ్రయణం పొందారు. కాబట్టి పెద్దలను సేవించుకోవడం ఆయనకు బాగా ఒంట బట్టింది. సమాశ్రయణ సంబంధంగా తాతగారు చెప్పిన ఒక వృత్తాంతం కూడా స్వీయచరిత్రలో ఆయన ప్రసక్తం చేశారు. తిరుమలనంబి (శ్రీవేంకటేశ్వర స్వామి నిత్యపూజా నిర్వాహకులు) స్వయంగా తీర్థకలశం తీసుకొని తీర్థం ఇవ్వడానికి శ్రీమద్రామానుజుల వద్దకు వచ్చారుట. భగవద్రామానుజుల మేనమామే తిరుమలనంబి. అప్పుడు శ్రీరామానుజులవారు వినయంగా "తీర్థం ఇవ్వడానికి మీరురావాలా? ఎవరినైనా పిల్లవాడితో పంపకపోయినారా" అన్నారుట. అప్పుడు శ్రీశైల పూర్ణులు (తిరుమలనంబి) నేను కూడా అలానే భావించానుకాని, నా

కన్నా పిల్లవాడు ఎవరూ కనపడలేదు" అని చెప్పారుట.

హంపీలో ముచ్చుకుంట శేషాచార్యుల వారివద్దచదువు కునేటప్పుడు రామచంద్ర 8 సం.ల బాలుడే, అయినప్పటికీ గురువుగారిని ఎంతగానో శుశ్రూషించారు. తుంగభద్రనుంచి ఉదయం కాకముందే నీళ్ళు తేవడం, నీరు కాగబెట్టి గురువుగారికి వేడినీళ్ళు అందించడం ఇత్యాదిగా. రామచంద్ర జీవితంలో ప్రవేశించిన మొట్టమొదటి మహాపండితుడు శేషాచార్యులవారే. తరువాత రామచంద్ర ఆనెగొందిలో రెండేళ్ళు చదువుకున్నారు. అక్కడ ఆనెగొంది సంస్థాన పండితులైన అంబాళం వెంబరు రామాచార్యుల వారివద్ద చదివారు. వీరి బట్టలు కూడా ఉతికే వాడినని రామచంద్ర రాసుకున్నారు.

ఆ తరువాత 11సం.ల వయసున ఆయన తిరుపతి సంస్కృత కళాశాలకు చదువుకోవడానికి వచ్చారు. అక్కడ ఏడేళ్ళు చదివారు. తిరుపతి సంస్కృత కళాశాలలోని ఆచార్య వర్గాన్ని గూర్చి అత్యంత భక్తిప్రపత్తులతో పేరు పేరున రామచంద్ర స్వీయ చరిత్రలో స్మరించుకున్నారు. వారి విద్వత్త, వారిధార్మికశీలం, శిష్యవాత్సల్యం, ఎంతగానో పొగిడారు రామచంద్ర. ఆయనంటారు 'మనుస్మృతి, గౌతమ ధర్మసూత్రాలు, గురుశిష్య సంబంధాన్ని గూర్చి ఎంతగానో చెప్పాయి. ఆవిషయాలన్నీ 'మాగురువులను చూసే చెప్పారా? ఆ స్మృతికారుల'ని అతివేలంగా ప్రస్తుతించారు రామచంద్ర తమగురువులను. 'వారు మాతో ప్రవర్తించిన తీరుచాలు. వారి వైయక్తిక జీవితం పరమపవిత్రం అని చెప్పడానికి. వారి వాత్సల్యం ఎంతటి దుష్టచిత్తుణ్ణి అయినా శిష్టుణ్ణి చేసేది. వారిబోధన విధానం ఎంత మూర్ఖుణ్ణయినా ప్రబుద్ధుణ్ణి చేసేది' అని అతిశయంగా పొగిడారు తమగురువులను రామచంద్ర. దీనివల్ల రామచంద్ర వినయ వివేకాలు చిన్ననాటి నుంచి ఎంతగా వికసించాయో తెలుసుకోవచ్చు. ఇటువంటి గురువుల దగ్గర చదువుకున్న వారంతా రామచంద్ర లాంటి అరుదైన వ్యక్తిత్వం కలవారైనారా? లేదు కదా! కపిస్థలం కృష్ణమాచార్యుల వారు, వెంకాస్వామిరావు అంటూ వారు గొప్పదేశభక్తులని, జాతీయ వాదులనీ రామచంద్ర నొక్కి చెప్పారు. దీనివల్లప్రభావశీలమైన వయస్సునుంచే రామచంద్ర ఏవిధంగా జాతీయోద్యమం పట్ల ఆకర్షితుడైనదీ తెలుసుకోవచ్చు.

రామచంద్ర తమ గురువులందరినీ పేరుపేరున పేర్కొని వారి వైశిష్ట్యం వివరించారు స్వీయజీవనోదంతాలలో. నెల్లూరు సంస్కృత కళాశాలలోనూ, ఆ తర్వాత మద్రాసు వేద సంస్కృత కళాశాలలోనూ చదువుతున్నప్పుడు కూడా ఆయా అధ్యాపకుల పాండిత్యాన్ని ప్రస్తుతించారు రామచంద్ర.

అదొక సంధికాలం. ఆ తరువాత అటువంటి పండితులు ఒకటి రెండు తరాలలో కనుమరుగైనారు. కిందటి శతాబ్ది (20.వ) ప్రథమ పాదందాకా దేశంలో ఇంకా సంస్కృత విద్వత్తకు గొప్ప గుర్తింపు ఉండేది. నామమాత్రంగా నైనా మహారాజులుండి చిన్నవి పెద్దవి సంస్థానాలు ఉండేవి. అంతేకాక ఇంగ్లీషు పట్ల అనభిముఖ్యం ఉండేది సంఘంలో, ముఖ్యంగా పండితవర్గంలో. కిందటి శతాబ్ది ఒకటి, రెండు దశకాలలో కూడా కాశీ, నవద్వీపం, దర్భంగా మొదలైన చోట్ల సంస్కృత విద్య, శాస్త్రాలు, దర్శనాలు ఆదరంగా చెప్పే ఆచార్యులు, చదువుకొనే శిష్యులు ఉండేవారు. అందువల్ల అటువంటి వారిని చూసినప్పుడు దేశంలో గొప్ప మెప్పు ఉండేది. అటుతర్వాత సమాజంలో విద్యాధిక వర్గంలో ఇంగ్లీషుకు గౌరవం, ప్రాధాన్యం హెచ్చడం వల్ల సంస్కృత పాండిత్యం తన పురాప్రాభవాన్ని కోల్పోయింది. ఇందుకొక ఉదాహరణం రామచంద్ర స్వీయ జీవితోదంతంలో ఆయన ప్రస్తావించిన దానిని బట్టే తెలుస్తుంది. రామచంద్ర రాశారు. "నాకు లాహోర్‌లో భట్టాచార్య అనే పండితుడు పరిచయమయ్యాడు. సంస్కృత పరీక్షలెన్నో కడతేరాడు. కాని ఉద్యోగం లేక లాహోర్‌లో పెద్ద సంఖ్యలో ఉన్న వంగీయుల ఇళ్ళలో పౌరోహిత్యం చేసేవాడు. అతనిని వాళ్ళు కులీనాతి కులీన బ్రాహ్మణుడంటూ గౌరవించేవారు. తను వైఖానస సూత్రం వాడినని, తమపూర్వులు ఆంధ్రదేశంనుంచి వంగదేశానికి వలసవచ్చారని ఆయన అనేవాడు".

గొప్ప పండితులంటే రామచంద్రకు ఎంతోగౌరవం. ఎంతో ఆకర్షణ. కాశీవిద్యాలయం నుంచి మహామహోపాధ్యాయ చిన్న స్వామిశాస్త్రి గారు లాహోర్ ఓరియంటల్ కాలేజి ఆహ్వానంపై ఒకసారి లాహోర్ రాగా ఆయన ఉపన్యాసానికి రామచంద్ర వెళ్ళారు. చిన్నస్వామి శాస్త్రిగారు వివిధ యజ్ఞాలను గూర్చి సంస్కృతంలోనే ప్రసంగిస్తూ 'వేదమంత్రాలు చదువుతూ వివరిస్తూంటే ఆర్యసమాజ

నాయకులు ఉప్పొంగిపోయి జేజేలు కొట్టారనీ, వ్యక్తిత్వమంటే అదీ' అనిపించింది నాకు అని రామచంద్ర రాశారు.

లాహోర్‌లోని ఓరియంటల్ కాలేజీ ప్రిన్సిపాల్ మాధవశాస్త్రి భండారీ మహాశయుణ్ణి గూర్చి తనలాహోర్ అనుభవాలలో రామచంద్ర ఎంతగానో సంస్తుతించారు. 'భండారీజీ గర్భాష్టమంలో (8 ఏళ్ళు నిండకుండా) ఉపనీతులై పన్నెండేళ్ళు వ్యాకరణ శాస్త్రం, తర్వాత పదిసంవత్సరాలు న్యాయమీమాంస శాస్త్రాలు అధ్యయనం చేసి 30వ ఏట గృహస్థాశ్రమంలో ప్రవేశించి యోగాయుర్వేదాలు అధ్యయనం చేసిన మహావిద్వాంసుడు. విద్యకు తగిన శీలం, బంగారుమైచాయతో పొడుగ్గా పలచగా మరాఠీటోపీతో గోఖలేలాగా ఉండేవారు' అని తనస్మృతి పథంలో భండారీజీని నిలుపుకుని పూజించారు రామచంద్ర. ఉరుదూ, పారసీ, అరబీశాఖ అధ్యక్షులు, ఆక్స్‌ఫర్డ్ విద్వాంసుడూ అయిన డా. ఖురేషీకి మాధవశాస్త్రి గారంటే ఎంతపూజ్యభావమో, ఖురేషి గారింట వివాహం జరిగినప్పుడు ప్రత్యేకించి మాధవశాస్త్రి గారు కోరినట్లే పరమ శిష్టాచారంగా వారికోసం భోజన పదార్థాలు తయారు చేయించి 'మై ధన్య హోగయా, మేరా పరివార్‌ధన్య హోగయా' అంటూ శాస్త్రిగారికి పదే పదే డా. ఖురేషి విన్నవించుకున్నాడని రామచంద్ర చెప్పారు. లాహోర్‌లో సుమారు 10 మంది గొప్ప పండితులతో తమకు పరిచయం కలిగినట్లు రామచంద్ర రాసుకున్నారు. డా. రఘువీరగూర్చి రామచంద్ర స్వీయచరిత్రలో ఒకప్రకరణమే రాశారు.

డా. రఘువీర తనతోకలసి రామచంద్రను ప్రపంచ భాషా నిఘంటునిర్మాణంలో పనిచేయవలసిందని అర్థించినా, తనకా అదృష్టం లేక పోయిందని ఎంతో సంతాప కరంగా రాసుకున్నారు రామచంద్ర. లాహోర్‌లో గొప్ప హిందీ రచయితలందరూ తనకు పరిచయమైనారనీ, వాళ్ళతో తాను సాహిత్య విషయాలు చర్చించే వాడిననీ రాసుకున్నారు థామచంద్ర.

కాన్పూర్ డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికలో స్వల్పకాలం తాను వార్తా సంగ్రాహకుడిగా పనిచేసినప్పుడు మహాపండితరాహుల్ సాంకృత్యాయన్ ప్రసంగాన్ని పత్రిక కోసం సంగ్రాహం చేసినట్లు రాసుకున్నారు రామచంద్ర. అటు తర్వాత కాన్పూర్ లోనే

ఒక విద్వద్గోష్ఠి జరిగింది. ఈ విద్వత్సభకు కూడా రాహుల్ సాంకృత్యాయన్ వచ్చారు. లాహోర్ ఓరియంటల్ కాలేజి సంస్కృతాచార్యులు డా. లక్ష్మణ్ స్వరూప్ వచ్చారు. వాళ్ళిద్దరితో తనకు బాగా పరిచయం ఉంది కాబట్టి వాళ్ళు సాహిత్య విషయాలేవోతెచ్చి 'రామకృష్ణకవిగారిని ఎరుగుదురా?' అని రామచంద్రను అడిగారుట రాహుల్‌జీ. ఎందుకడుగుతున్నారాయనను గూర్చి అని ఉత్సుకతతో రామచంద్ర అడిగితే ఆయన ఎంత ధన్యుడు. మహాత్ముడు. ఆయన జీవిత సార్థక్యానికి ఒక కుందమాల నాటకం ప్రకాశితం చేయడం చాలుకదా అన్నారుట రాహుల్‌జీ. మరి భరతుని 'నాట్యశాస్త్రం'సంగతి ఏమంటారు? అని లక్ష్మణస్వరూప్ ప్రశంసించారుట.

ఈ విధంగా అంతగొప్ప విద్వాంసులు, భారతదేశంలోనే అగ్రగణ్యులు మానవల్లి వారిని శ్లాఘిస్తుంటే ఆ మహానుభావుణ్ణి స్వయంగా తెలుసుండి, ఆయన దగ్గర పనిచేసిన నాకు ఒక అతిమానుషానందానుభూతి కలిగి నోటమాటరాలేదని రామచంద్ర రాసుకున్నారు. ఆయనతో పనిచేశానని రామచంద్ర చెప్పగా వాళ్ళిద్దరూ మానవల్లివారిని చూసినంతగా సంతోషపడ్డారని కూడా రామచంద్ర రాశారు స్వీయ చరిత్రలో.

రామచంద్ర తనకు బాల్య కౌమార దశలలో చదువు చెప్పిన గురువుల వల్లనే కాక, తాను జీవితంలో తొలిసారిగా ప్రభావితులైంది మానవల్లి వారి వల్లనే. 13 సం.ల వయస్సుననే మానవల్లి వారితో రామచంద్రకు పరిచయం కలిగింది. తాళపత్ర గ్రంథాలు చూసి రాయగల వ్రాయసకాడు కావాలని వారు ఎవరితోనో ప్రస్తావించగా అది విని రామచంద్ర వారిని దర్శించటానికి వెళ్ళారు. వారేదో పని చెప్పారుటకాని ఎక్కువ భాగం మానవల్లివారి వైదుష్యం, పరిశోధన, జ్ఞాపక శక్తి, నిస్సంగత్వం తననెంతో ఆకట్టుకున్నాయని రామచంద్ర రాశారు. అటు తరువాత మద్రాసులో రామచంద్ర వారికి సహాయులుగా కూడా తాళపత్ర గ్రంథ పరిష్కరణలో కొద్ది నెలలు పనిచేశారు. వైదుష్యంలో, తన పని ఏదో తాను చేసుకొని పోవడంలో, పేరుప్రతిష్ఠల కోసం ప్రాకులాడకపోవడంలో, విద్యా వినయ సౌశీల్యాలలో మానవల్లి వారు తనకు ఆదర్శమని రామచంద్ర తన

సన్నిహితుల వద్ద అంటూ ఉండేవారు. మానవల్లి వారు ఒక వాఙ్మయశిఖరమని ఒక పెద్ద వ్యాసం కూడా రాశారు రామచంద్ర. మానవల్లి వారి అంత్యకాలంలో వీరింట ఉంచుకొని ఆతిథ్య గౌరవం కూడా నెరపినట్లు రామచంద్ర స్వీయ చరిత్రలో రాసుకున్నారు. మానవల్లి వారి తరువాత రామచంద్రను ప్రభావితం చేసిన కవి, పండితుడు, వ్యాఖ్యాత, పరిష్కర్త, పరిశోధకులు వేటూరి ప్రభాకర శాస్త్రి. అముద్రితకావ్యప్రకటన పరిష్కరణలో, సరిఅయిన పాఠ నిర్ణయంలో ప్రభాకరశాస్త్రిగారి ఒరవడి రామచంద్రపై ఉంది. ప్రభాకర శాస్త్రి గారి దగ్గర పుస్తకం పట్టి తానేదీ చదవకపోయినా వారి ప్రియ శిష్యుణ్ణి అని రామచంద్ర రాసుకున్నారు. 1954లో రామచంద్ర పరిశోధన పత్రిక నడిపినప్పుడు వేటూరి వారి గూర్చి ఒక ప్రత్యేకసంచిక రూపొందించి ప్రభాకరుల బహుముఖ ప్రజ్ఞను లోకానికి వెల్లడించారు రామచంద్ర.

మల్లంపల్లి వారితో, కోరాడరామకృష్ణయ్యగారితో, నేలటూరి వెంకటరమణయ్య గారితో, నిడుదవోలు వెంకటరావు గారితో రామచంద్రకు సన్నిహిత సాహిత్య పరిచయం ఉండేది. చిలుకూరి నారాయణరావు గారితో, రాళ్ళపల్లి అనతకృష్ణశర్మ గారితో, పుట్టపర్తి నారాయణాచార్యుల వారితో మరింత సాహిత్య వ్యాసంగం ఉండేది. వీరందరిని గూర్చి రామచంద్ర చాలా సందర్భాలలో రాశారు. కోరాడ రామకృష్ణయ్యగారి శతజయంతి సంచికలో రామకృష్ణయ్యగారి సాహిత్య జీవితం ఇంచుమించు ఒక చిన్న పుస్తక పరిమాణంలో సంధానించారు రామచంద్ర.

అడవి బాపిరాజు గారి దగ్గర రామచంద్ర పనిచేశారు. బాపిరాజుగారి గూర్చి, బాపిరాజుగారి మీజాన్ పత్రికలో వారితో కలిసి పని చేయడం గూర్చి, బాపిరాజుగారు తనను ఒక నవలలో పాత్ర సృష్టికి ఉపయోగించుకోవడం గూర్చి రామచంద్ర చాలా సందర్భాలలో రాశారు.

సురవరంప్రతాపరెడ్డి గారు కూడా రామచంద్రను ప్రభావితం చేసినవారే. 'మహబూబ్‌నగర్‌మండలం సాహిత్య మణిదీపాలు ' అనే పేరిట రామచంద్ర రాసిన వ్యాసం గడిచిన రెండు మూడు తరాల ఆ మండలపు గొప్ప పండితులను గూర్చి అత్యంతాసక్తికరమైన విషయాలను చెపుతుంది. రామచంద్ర చనిపోవటానికి

పదేళ్ళముందు ఈ ప్రశస్తమైన వ్యాసంరాశారు. గద్వాల, వనపర్తి మొదలైన సంస్థానాలలో గొప్ప పండితుల కృషి, వాదవివాదాలు, మహాప్రతిభ అక్షరం చేశారీ వ్యాసంలో రామచంద్ర. 'ఈ పాలమూరు (మహబూబ్‌నగర్) జిల్లాను తలచుకొన్నప్పుడల్లా నేను పొంగిపోతుంటాను. నాకు వైయక్తికమైన సంబంధముంది. నా మిత్రుల తండ్రులు, తాతలు విద్వత్కవులయిన వారు నాకు దీనితో ఆత్మీయత కలిగించారు. ఈ జిల్లాలోని సంస్థానాలు, సంస్థానాల పండిత వంశాలు, ఈ ప్రాంతానికేకాక యావదాంధ్రదేశానికి, భారతదేశానికి కూడా తెచ్చిన కీర్తి సామాన్యమైనది కాదు' అన్నారు రామచంద్ర. కాశీపండితులలో అత్యంతకీర్తి నార్జించిన శివకుమార్ పండిట్‌జీ వద్ద చదువుకున్న నరసింగయ్య శాస్త్రిగారిని స్వయంగా దర్శించారు రామచంద్ర. వారి చమత్కార సంభాషణలు, కథలు ఈ వ్యాసంలో తెలియజేశారు.

రామచంద్రకు కన్నడ పండితులతోనూ, తమిళ సాహిత్య వేత్తలతోనూ పరిచయాలున్నాయి. తమిళంనుంచి, కన్నడం నుంచి రామచంద్ర ఎన్నో గ్రంథాలు అనువదించారు. రామచంద్ర తమ ముప్పైఏళ్ళ జీవితగాథ 'హంపీనుంచి హరప్పా' అనే పేరుతో రాసిన ఆత్మకథను ముగిస్తూ, 'ఎవడు దేశాలు తిరుగుతాడో, ఎవడు పండితులకు సేవచేస్తాడో, వారి బుద్ధి నీటిలో పడిన నూనెచుక్కలాగా విస్తరిస్తుంది. నాలో ఇది ఎంతవరకు నిజం అని ఆలోచించు కుంటూనడుస్తున్నాను. నూరేళ్ళు ఇలా నడక తప్పదేమోననిపించింది' అని ముగించారు. నడకను తెలిపే 'గతి' ధాతువుకు సంస్కృతంలో జ్ఞానమని కూడా అర్థమున్నదట. నిరంతర జ్ఞాన సముపార్జన పరాయణుడిగానే జీవించారు రామచంద్ర. ఆయన ఆర్జించిన జ్ఞానం వారి రచనలన్నిటా 'తైలబిందురివాంభసి' (నీటిలో పడిన తైలబిందువు) లాగా విస్తరిస్తూ కాంతులీనుతూనే ఉంటుంది.



# 16. పత్రికా రచయితగా, పరిశోధకుడిగా

రెండో ప్రపంచ యుద్ధకాలంలో రామచంద్ర భారతదేశ వాయవ్య సరిహద్దున చమన్‌లో సైన్యంలో హవల్దార్ క్లర్క్‌గా పనిచేయడం,ఆయనకు కోర్టు మార్షల్ విధించడంతో ఆయన సైన్యం నుంచి తప్పుకొని ఉత్తర ప్రదేశ్‌లోనే ఉండి చిన్న చిన్న ఉద్యోగాల కోసం వెతుక్కున్నారు. ఒక బట్టల మిల్లులో పనిచేశారు. తరువాత ఒక పుస్తకాలషాపులో ఆ పుస్తకాలు చుట్టూపక్కల ప్రాంతాలలో అమ్మకాల అజమాయిషీ చూసే ఉద్యోగం చేశారు. ఆ తరువాత కాన్పూర్ నుంచే పద్మపత్ సింఘానియా అని గొప్ప సంపన్నుడు స్థాపించిన 'డెయిలీ టెలిగ్రాఫ్'లో మూడు నాలుగు నెలలు పనిచేశారు. అక్కడే అలానే కాలు నిలదొక్కుకుని ఉంటే ఎట్లా ఉండేదో అని తమ గతకాలపు స్మృతులలో వారు స్వగతప్రశ్న వేసుకున్నారు. ఇంగ్లీషు జర్నలిజంలోనే వారు ఉండి ఉంటే తెలుగువారికి, తెలుగునాడుకు వారింత సన్నిహితులై ఉండేవారు కారు. ఆయన లౌకికజీవితం, జీవనభద్రత, పేరు ప్రతిష్ఠలు ఇంతకన్న పెంపొంది ఉంటే ఉండవచ్చు.

ఏమైతేనేం డెయిలీ టెలిగ్రాఫ్‌లో పనిచేస్తున్న ఆ స్వల్ప వ్యవధిలోనే ఆయనకు పత్రికా రచన వృత్తి నచ్చింది. దానినే ఆయన జీవికోపయోగవృత్తిగా స్వీకరించి స్థిరపడాలని కోరుకున్నారు. తన నిర్ణయాన్ని అప్పటికి అనంతపురంలో స్థిరావాసం ఏర్పరచుకొన్న తండ్రిగారికి తెలుపగా, తండ్రిగారు కుమారుడు తమకు

దగ్గరగాఉండాలనే కోరికతో, ఇంగ్లీషు జర్నలిజం పెద్ద సముద్రం వంటిదనీ, తెలుగు పత్రికా రంగంలో ప్రవేశిస్తే బాగుంటుందనీ సలహా ఇచ్చారు. తండ్రి గారితో సంప్రదించి ఆయనకు నచ్చచెప్పాలని రామచంద్ర ఇంటికి వచ్చారు. అప్పటికి రామచంద్ర ఇల్లాలు కాపురానికి కూడా వచ్చింది. అందువల్ల కుటుంబ బంధమే దృఢమై మళ్ళీ ఆయన కాన్పూర్ వెళ్ళలేక పోయినారు. మద్రాసు పోయి ఏదైనా పత్రికలో ప్రయత్నించవలసిందని తండ్రిగారు సలహా చెప్పినా అత్తవారి ఊరు సురపురం వెళ్ళి నిర్ణయించుకోవచ్చుననీ, వాళ్ళకు దగ్గరగా ఉండడం కూడా వాంఛితమనీ రామచంద్ర హైదరాబాదు వచ్చారు.

హైదారాబాదులో అప్పట్లో గులాం మహమ్మద్ కలకత్తా వాలా అనే ఆయన 'మీజాన్' అనే పేరుతో ఇంగ్లీషు, ఉర్దూ, తెలుగు భాషల్లో దినపత్రిక ప్రారంభించాడు. తెలుగు దినపత్రికకు సుప్రసిద్ధకవి, నవలారచయిత, దేశభక్తుడు, జాతీయోద్యమ ప్రముఖుడు అడవిబాపిరాజు సంపాదకులు. పత్రిక విధాన నిర్ణయాల విషయంలో బాపిరాజుకు పూర్తి స్వాతంత్ర్యం ఉన్నట్లు కనపడుతుంది. ఇంగ్లీషులో వెలువడే ఈ పత్రిక నిజాం నవాబును పూర్తిగా సమర్థించగా, ఉర్దూ పత్రిక కాసీంరజ్వీని, రజాకార్లను సమర్థించేదట. అయితే తెలుగు పత్రిక కాశీం రజ్వీ దురంతాలను, రజాకార్ల దుండగాలను తీవ్రంగా విమర్శించేదని రామచంద్ర రాశారు. ఈ పత్రికలో పనిచేస్తున్న రాంభట్ల కృష్ణమూర్తి ఒకసారి మీజాన్‌లో నిజాం నవాబ్‌ను ఉరితీయాలని రాశాడట. రజాకార్ల దౌర్జన్యాలు, స్త్రీల మానభంగాలు, హత్యలు ఫొటోలతో సహా ఈ పత్రిక ప్రకటించిందని రామచంద్ర రాశారు. సరోజినినాయుడు కుమార్తె తరువాత బొంబాయి రాష్ట్రానికి గవర్నరు పదవినిర్వహించిన పద్మజానాయుడు అప్పట్లో తెలంగాణాలో రజాకార్లు చేసిన కిరాతకాలను, రాక్షసకృత్యాలను, స్వయంగా పర్యటించి బాధితులగోడు విని పెద్ద నివేదికను రూపొందించిందనీ, దానిని మీజాన్ పత్రికలో బాపిరాజు ప్రచురించారనీ దాంతో నిజాం పట్ల వ్యతిరేకత, ఆ సంస్థాన పరిపాలకుడి పట్ల తీవ్ర నిరసన, ఆయన్ను సమర్థిస్తున్న వారిలో తీవ్ర సంక్షోభమూ తలెత్తాయని రామచంద్ర రాశారు. కాబట్టి తెలుగు పత్రికారంగంలో రామచంద్ర ప్రవేశించిన

తొలి సన్నివేశాలలోనే ఆయనలో సత్యనిరతి, నిర్భీకత, వృత్తిపట్ల అంకితభావం, నిజాయితీ ఆదర్శంగా కుదురుకున్నాయి. "బాపిరాజుగారు తనదగ్గర పనిచేసేవాళ్ళకు సంపూర్ణంగా స్వేచ్ఛనిచ్చారు. నాకు ఫైలాలజీ, సాంఘికశాస్త్రం, చరిత్ర ఇష్టం. నేను రోజూ ఒక కాలం వ్రాసేవాడిని. అన్నారు రామచంద్ర బాపిరాజుకు నివాళినర్పిస్తూ. బాపిరాజు గారిని గూర్చి రామచంద్రకు చాలా మెప్పు. సాహిత్య, భాషాపరిశోధనలలో మానవల్లివారిని ఆదర్శంగా ఎంచుకున్నట్లే పత్రికారంగంలో బాపిరాజుగారిని రామచంద్ర ఆదర్శంగా చేసుకున్నట్లు కన్పిస్తుంది. బాపిరాజు గూర్చి రామచంద్ర ఈవిధంగా నివాళించారు. "బాపిరాజు గారు నిజమైన సత్యాగ్రహి. నిజమైన గాంధీ అనుయాయి. నిజమైన మానవుడు. ఆత్మగుణాల పుట్ట. సమకాలీన రచయితలలో లేని గుణం - సహనం ఆయనలో తొణికిసలాడేది" అని. 'భాషా శైలికూడా విషయానుగుణ్యంగా బాపిరాజుగారి రచనల వల్లే ఆయన దగ్గర పనిచేసే వాళ్ళకు అలవడ్డాయి' అని కూడా రామచంద్ర రాశారు.

ఆళ్ళ పిచ్చయ్య అనే చప్రాసీ ఒకరోజు తన జీవితానుభవాలు 'చప్రాసీ ఆత్మ కథ' అనే పేరుతో తెచ్చి మీజాన్ పత్రికలో ఇచ్చాడు. సంపాదకవర్గంలో అదిఎవరు చూశారో కాని చేతిరాత గజిబిజిగా, వాక్యరచనప్రాథమికంగా ఉందని భావించి చిత్తుకాగితాల బుట్టలోగిరాటు వేశారు.

పత్రికాకార్యలయానికి రాగానే ఉదయం చెత్త బుట్టచూడటం రామచంద్ర అలవాటుట. పొరపాటున ఏవైనా రచనలు, సమీక్షకోసం వచ్చిన రచనలు, వార్తలు మొదలైనవి చిత్తుకాగితాల బుట్టలో చేరాయేమోనని ఒకసారి ఆయన చూస్తారుట. ఒకరోజున రామచంద్రకు బొత్తిలాగా ఒక కాగితాల కట్టకనిపించింది. ఉత్సుకతతో ఏమిటా అని పరిశీలించారు. చప్రాసీఆత్మకథ అనేరచన. ఉండబట్టలేక దానిని ఆయన చదివారు. చేతిరాత గజిబిజిగా ఉండడం, వాక్యాలలో అస్పష్టత తప్ప విషయం ఆయనకు అత్యంత ఆసక్తికరం అనిపించింది. అటువంటి మంచిరచన చెత్త బుట్టలోకి పోయి నందుకు రామచంద్రకు ఆవేశోద్వేగాలు కలిగాయి. కలత చెందారు. బాపిరాజుగారు కార్యాలయానికి రాగానే వెళ్ళి వారికి ఫిర్యాదు చేశారు. బాపిరాజుగారు కూడా దానిని తీసుకుని చదివారు. ఆయన కూడా రామచంద్రతో

ఏకీభవించారు. పూర్తిగా స్వరూపం మార్చకుండా అక్షరదోషాలు మాత్రం దిద్ది ప్రచురించండి అని బాపిరాజుగారు రామచంద్రను కోరారు. ఆ రచన మీజాన్‌లో అచ్చైంది. రచయిత మొక్కజొన్నపొత్తులు తెచ్చి బాపిరాజు గారికీ ఆయన సంపాదకవర్గానికి నజరానా చెల్లించుకుంటే ఒక్కటి మాత్రం ఆ రచయితను సంతోషపెట్టటానికి బహూకరణగా స్వీకరించి తక్కిన వాటికి ఖరీదు ఇచ్చారుట బాపిరాజు. ఆయన అంతటి మనస్వి అంటారు రామచంద్ర.

నైజాంనవాబు మొండితనం వల్ల, దురాశవల్ల, అహంకారంవల్ల, మత క్రౌర్యశక్తులకు లొంగిపోయినందువల్ల దేశ స్వాతంత్ర్యం సంపాదించిన తర్వాత హైదరాబాదు రాష్ట్రంలో సంక్షోభం చెలరేగింది. నైజాం నవాబు స్వతంత్ర భారతంలో చేరకుండా స్వతంత్రం ప్రకటించుకున్నాడు. దాంతో హైదరాబాదు సామాజిక ఉద్రిక్తతల నిలయమైంది. తెలుగు మీజాన్‌కు అత్యధిక జనాదరణ, ప్రాచుర్యం ఉన్నా పత్రిక ఆగిపోయింది. మీజాన్‌లో పనిచేస్తున్నప్పుడు రామచంద్ర తన సైనిక జీవితానుభవాలు, సిపాయిల కథలురాశానని ఒక వ్యాసంలో చెప్పుకున్నారు. రామచంద్ర స్వీయ చరిత్ర ఆయన మీజాన్‌లో పనిచేసే ఘట్టందాకా రాయలేదు. ఏదైనా పత్రికలో పనిచూసుకుందామని హైదరాబాదు చేరడం వరకే ఆయన జీవిత గాథ ఆగిపోయింది. ఆ తర్వాత జీవిత వృత్తాంతం రాస్తూ ఉండగానే ఆయన చనిపోయారు. రామచంద్ర జీవితంలో 30 ఏళ్ళ జీవిత వృత్తాంతం మాత్రమే ఆయన స్వీయ జీవితానుభవాలుగా రాసుకున్నారు.

మీజాన్‌లో రామచంద్ర సహోద్యోగులైన శ్రీనివాస చక్రవర్తి, రాంభట్ల కృష్ణమూర్తి, బొమ్మకంటి సుబ్బారావు ప్రభృతులు తరవాత పత్రికారంగంలో చాలాపేరు తెచ్చుకున్నారు. మీజాన్ పత్రిక ఆగిపోవడంతో అప్పట్లో తెలుగు పత్రికల ప్రధాన ప్రచురణస్థానమైన మద్రాసు చేరుకున్నారు రామచంద్ర. అదృష్టవశాత్తు ఆయనకు ఆంధ్రప్రభలో స్థానం దొరికింది. ఆంధ్రప్రభ దినపత్రికలో రామచంద్ర 12 సం.లు పనిచేశారు. ఆంధ్ర ప్రభ చిత్తూరు ఎడిషన్‌లో కూడా వారు పనిచేశారు. ఆ తర్వాత విజయవాడ ఎడిషన్‌లోకి వచ్చారు. నార్ల వెంకటేశ్వరరావు వీరిని చాలా అభిమానించేవారు. నీలంరాజు వెంకటశేషయ్యగారు

ఆంధ్రప్రభ సంపాదకులైన తర్వాత వారి అభిమానమూ పొందారు.

పత్రికలో గంటకు ఒక కాలం అత్యవసరంగా ఏ విషయం గూర్చి అయినా రాయాలని నార్లవారు రామచంద్రను ఉత్తేజపరచేవారుట. ఆ విధంగానే రామచంద్ర సంఘం, సాహిత్యం, సంస్కృతి, పురాచరిత్ర, దేవాలయవాస్తు శిల్ప విజ్ఞానం మొదలైన విషయాలన్నీ ఆసక్తికరంగా తాను పనిచేసిన పత్రికలలో రాసేవారు. స్వాతంత్ర్యోద్యమ సమయంలోనూ, ఆంధ్రరాష్ట్రం, ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావ సమయంలోనూ రామచంద్ర ఆంధ్రప్రభ లోనే ఉన్నారు. ఆంధ్రప్రభలో ఆయన ఒక పుష్కర కాలం పనిచేశారు. అటుతరువాత 1959, 60ప్రాంతంలో ఆంధ్ర పత్రికలో చేరారు. ఆంధ్రపత్రికలోకూడా ఇంచుమించు ఒక పుష్కరకాలం పనిచేశారు రామచంద్ర. ఆంధ్రప్రభలోనూ ఆంధ్రపత్రికలోనూ పనిచేస్తున్నప్పుడు ఆ పత్రికల వారపత్రికలలోనూ రామచంద్ర ప్రత్యేక శీర్షికలు నిర్వహించారు. మరపురాని మనీషి, తెలుగు వెలుగు శీర్షికలు ఇటు వంటివే. నుడి-నానుడి అనే శీర్షికను కూడా ఆంధ్ర ప్రభలో ఉన్నప్పుడే వారు నిర్వహించారు.

ఆంధ్ర పత్రిక సంస్థలో పనిచేస్తున్నప్పుడు తెలుగు వారి సాహిత్య పెన్నిధానమైన భారతి పత్రికకు కొంతకాలం వారు సంపాదకత్వం నిర్వహించారు. ఆంధ్రపత్రిక వారు ప్రతి సంవత్సరం ప్రచురించే ఉగాది సంచికలు నిర్వహించారు. భారతిలో 'సాహితీసుగతుని స్వగతం' అని సాహిత్య విషయ సంబంధి అయిన అత్యంత ఆసక్తికరమైన శీర్షిక నిర్వహించారు.

1971 చివర లోనే రామచంద్ర హైదరాబాదు వచ్చేశారు. హైదరాబాదులో 'బిర్లా ఇన్‌స్టిట్యూట్' అనే పురాభారతీయ విజ్ఞాన పరిశోధన సంస్థ అప్పట్లోనే నెలకొన్నది. బహుశా ఆ సంస్థలో పనిచేయాలనే ఆసక్తితో రామచంద్ర హైదరాబాదు చేరి ఉంటారు. అప్పటి కింకా వారికి షష్టిపూర్తి కూడా కాలేదు. 1972ఉగాది సంచికకూడా వారి సంపాదకత్వంలోనే వెలువడింది. ఆ సంవత్సరమే ఆంధ్రపత్రిక సంపాదకులు శివలెంక శంభుప్రసాద్ శివసాయుజ్యం పొందారు. అంతటితో వారికి ఆంధ్ర పత్రికను వదిలిపెట్టి హైదరాబాదు చేరుకోవాలనే భావం కలిగి ఉంటుంది. అయినా ఆంధ్ర పత్రికతో, దినవారపత్రికలతో ఆ పత్రికా సంస్థ తనప్రచురణలన్నిటినీ నిలిపి వేసే వరకూ ఆయన గాఢానుబంధం కొనసాగుతూనే

ఉంది. తెలుగుపత్రికా రచయితగా తన వృత్తిని హైదరాబాదులో ప్రారంభించిన రామచంద్ర మళ్ళీ హైదరాబాదులోనే పాతిక ముప్ఫై సంవత్సరాల తర్వాత తన అనుబంధం పునరుద్ధరించుకున్నారు. తీరిక వేళల్లో పత్రికలకు రాస్తూ, రేడియోప్రసంగాలు చేస్తూ, సభలూ సమావేశాలలో పాల్గొంటూ,ప్రత్యేక సంచికలను చక్కదిద్దుతూ తర్వాత 25 సంవత్సరాల కాలం రామచంద్ర హైదరాబాదు పత్రికా రంగంలో ప్రధాన వ్యక్తి అయినారు.

బిర్లా ఇన్‌స్టిట్యూట్ వారి పురావిజ్ఞాన సంస్థలో రామచంద్ర సుమారు 4సం.లు వ్రాత ప్రతుల సూచీకర్తగా పనిచేశారు. తరువాత 1975 నుంచి 79 వరకు ఆంధ్రభూమి దినపత్రికలో సంపాదకవర్గంలో పనిచేశారు. వారే సాహిత్య విభాగం నిర్వహించే వారు ఆకాలంలో. తరువాత ఒక సంవత్సరం బాలల అకాడమీ కార్యదర్శిగా పనిచేశారు. 1980 నుంచి 1997లో చనిపోయేదాకా ఏ పత్రికా సంస్థలోనూ, ప్రచురణ సంస్థలోనూ ఉద్యోగించకపోయినా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం సాయం తరగతులలో కొన్నాళ్ళు ప్రాకృతం బోధించారు.

సుమారు ఆరుదశాబ్దాలు ప్రాచీన గ్రంథనిలయాలతో, పత్రికారంగంతో సన్నిహిత సంబంధమున్న రామచంద్ర తననలభై ఏళ్ళ వయసున ఒక సాహిత్య ద్విమాసపత్రికను తామే సంపాదకత్వం వహించి నిర్వహించారు. ఆ పత్రిక పేరు పరిశోధన. సృజనాత్మక సాహిత్యానికికాక కేవలం పరిశోధనకే అంకితమైన పత్రిక ఇది. ఇంకొక విశేషం ఏమంటే కొన్ని విశేషవిషయప్రత్యేక సంచికలు ప్రకటించిందీ పత్రిక. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి గూర్చీ, ధర్మవరం కృష్ణమాచార్యుల వారి గూర్చీ, పాల్కురికి సోమనాథుడు, బుద్ధుడు, గురజాడ అప్పారావులప్రత్యేక సంచికలు ప్రచురించింది.

1954 ఏప్రిల్‌లో ప్రారంభమైన పరిశోధన పత్రిక పూర్తిగా మూడుసంవత్సరాలు కూడా వెలువడి నట్లు కనపడదు. అంటే 18 సంచికలు పూర్తి చేసినట్లు లేదు. కథలు, కవిత్వమూ ప్రచురించలేదీ పత్రిక, దేశిరచనలు, సాహిత్య మీమాంస, తెలుగు తోబుట్టువులూ, పురాతత్త్వం, కవిహృదయం, ఛందస్సు, అలంకారం, అముద్రిత రచనలు, చరిత్ర కెక్కని చరితార్థులు అనే విషయాలకే ప్రాధాన్యమిచ్చి పత్రిక నడిపినట్లు రాశారు రామచంద్ర. ఆంధ్రప్రదేశ్ విశాల రాష్ట్రం త్వరలోనే

ఏర్పడుతున్నది, తెలుగువారంతా ఏకమవుతారు, కొత్త విశ్వవిద్యాలయాలు రాబోతున్నాయి. తెలుగుకు ఇదివరలో ఎప్పుడూ కనీవినీ ఎరుగని ప్రాధాన్యం ఏర్పడబోతున్నదని ఆయన ఆశించి ఉంటారు. ఇటువంటి సాహిత్య ప్రాధాన్యం కలపత్రిక, నూతన విమర్శరీతులను, పరిశోధక పద్ధతులను తెలుగువారికి పరిచయం చేసిన పత్రిక ఇంకొకటి ఒక శతాబ్ది కాలంలోనేలేదు. అయినా అనేక కారణాల వల్ల ఆ పత్రిక నిలబడలేదు.

1975వ సంవత్సరం ప్రపంచ తెలుగు సభలు జరిగాయి. ఆ సందర్భంగా గొప్ప ప్రత్యేక సంచిక వెలువడింది. ఆ సంచిక రూపుదిద్దిన వారిలో రామచంద్ర ప్రముఖులు. అట్లానే వారు బాలల ఆకాడమీ కార్యదర్శిగా ఉన్నప్పుడు తెలుగులో బాలసాహిత్యానికి సంబంధించిన ఒక విశిష్టసంచిక వచ్చింది. ఈ పత్రికలోకూడా రామచంద్ర తన పరిశోధన ప్రవణతను చూపించారు.

సాహిత్య, సమాజ, సంస్కృతుల వికాసాన్ని గూర్చి వెయ్యికిపైగా రామచంద్ర రచనలు చేసి ఉంటారు. అన్ని రచనలలోను వారి పరిశోధన ప్రతిభ, రచనా సారళ్యం, మౌలిక జిజ్ఞాస,విషయవివేచన కనపడుతూనే ఉంటాయి. 



# 17. రామచంద్ర రచనలు

తిరుమల రామచంద్ర రచించిన పుస్తకాలప్రస్తావన రాగానే వెంటనే గుర్తు వచ్చేవి కొన్ని ఉన్నాయి. తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించి అవి విలక్షణమైనవి. ప్రత్యేకమైనవి. ఇటువంటి గ్రంథాలు పది పదిహేను దాకాఉన్నాయి.

అవి మనలిపి – పుట్టుపూర్వోత్తరాలు,సాహితీసుగతుని స్వగతం, గాథాసప్తశతిలో తెలుగు పదాలు, హిందువుల పండగలు, తెలుగు పత్రికల సాహిత్యసేవవంటివి. సంస్కృత, ప్రాకృతాలనుంచి తెలుగులోకి అనువదించినవి కూడా ఆయన పుస్తకాలు ప్రత్యేకమైనవే. క్షేమేంద్రుడి అవదాన కల్పలత, లలిత విస్తరం ఇటువంటివి. ఇంకా రామచంద్ర గారు వివిధ పత్రికలలోవ్రాసిన వ్యాసాలు వారి వయసు మళ్ళిన కాలంలో మూడు సంకలనాలుగా ప్రచురితమైనాయి. రామచంద్రకు తమ రచనలన్నీ పుస్తకరూపంలో రావాలని ఎంతో అభిలాష ఉండేది. ఎంతో కుతూహలం ఉండేది. పుస్తకాలు, పుస్తకాలు, ఇంకా ఇంకా నావి రావాలని ఆయన అంటూ ఉండేవారు. ఇదివరలో పత్రికలలో అన్నీ అచ్చైనవేకదా పుస్తకరూపంలో అన్నీ రావాలంటేఅవి ఎన్నో సంపుటాలవుతవికదా, సాధ్యమా అంటే ఆయన సమాధానపడేవారు కాదు! అందులో తాము ఎక్కువగా ఇష్టపడే వాటినైనా పుస్తకాలుగా కూర్చాలని ఆయన కెంతో కోరికగా ఉండేది. ఆయన జీవితకాలంలో వారిగ్రంథాలు ఏ మూడు నాలుగో తప్ప ద్వితీయముద్రణ

పొందలేదు. విద్యాసంస్థలలో, విశ్వవిద్యాలయాలలో పాఠ్యాలుగా రామచంద్ర పుస్తకాలు ఆదృతమైనట్లుగా కూడా కనపడదు. అటువంటి లౌక్యాలు ఆయనకు తెలియవు. సాహితీ సుగతుని స్వగతం, గాథాసప్తశతిలో తెలుగు పదాలు, ప్రాకృత వాఙ్మయంలో రామకథ, మనలిపి పుట్టుపూర్వోత్తరాలు మొదలైనగ్రంథాలు కళాశాలలలో, విశ్వవిద్యాలయాలలో సమాదృతమై ఉంటే విద్యార్థులు ఇతోధిక జ్ఞాన సముపార్జితులై ఉండేవారు. తమసాహిత్యం, సంస్కృతి, పరిశోధనల పట్ల ఆకృష్టులై ఉండేవారు. ఉత్తమాభిరుచి నిర్దేశం కూడా వారికి కలిగి ఉండేది. రామచంద్ర గ్రంథాల సంక్షిప్తపరిచయం వల్ల వాటి విశిష్టత ఏమిటో తెలుసుకోవచ్చు.

**1. మనలిపి -పుట్టు పూర్వోత్తరాలు:** మొదటిసారి ప్రకటితమైన 40, 50 సంవత్సరాల తర్వాత ఇది ద్వితీయ ముద్రణం పొందింది. 1950లోనే ఇది తొలిసారి ప్రకటితం. శాసన పరిశోధనలో అసదృశమైన కృషిచేసిన మల్లంపల్లి సోమశేఖరశర్మ గారికి యీ పుస్తకం అంకితం. భారతీయ భాషలన్నింటిలోనే ఇటువంటి పుస్తకం అప్పటికి వెలువడలేదు. భారతదేశంలో శతాబ్దాలతరబడి లిపి ఏవిధంగా పరిణమించిందో, ముఖ్యంగా దక్షిణ దేశంలో క్రీస్తు పూర్వం నుంచి నేటి దాకా రెండు వేల సంవత్సరాలలో అక్షరాకృతులలో ఎటువంటి మార్పులొచ్చాయో, సుగమంగా సచిత్రంగా ఈగ్రంథంలో తెలియజేశారు రామచంద్ర. శాసనాల ఆధారంతో ఆయాకాలాలలో జనుల వాగ్వ్యహారంలోని ధ్వనులను అక్షరసంకేతాలుగా నిరూపించి వాటివ్రాత విధానం ఎట్లా ఉండేదో నిరూపించారు. భారతదేశంలో సకల భాషాలిపులకు బ్రాహ్మీలిపియే మాతృకతా కొన్ని మార్పులకు లోనైందనీ, ఈ దక్షిణ బ్రాహ్మీలిపినుంచే తమిళ మలయాళ తెలుగు కన్నడ లిపులు పుట్టాయని నిరూపించారు రామచంద్ర. రెండువేల ఏళ్ళ కిందట యీ ద్రావిడ భాషల మూల లిపి ఎట్లా ఉండేదో వివరించారు. క్రమానుగతంగా ఎట్లామారిపోయి ఇప్పుడీ రూపం సంతరించుకున్నదో చెప్పారు. కన్నడ తెలుగులిపులు ఏ కాలం దాకా ఏకలిపిగా ఉండేవో ఏకాలంలో విడిపోయాయో వివరించారు. ఆంధ్రదేశాన్ని ఆయాకాలాలలో పరిపాలించిన చోళులు, చాళుక్యులు, శాలంకాయనులు, విష్ణుకుండినులకాలం నుంచి కృష్ణరాయల

కాలానికే యేమార్పులు సంభవించాయో తెలిపారు. ఆయాకాలాలలో తెలుగు లిపికి ఏ పేర్లుండేవో తెలియచేశారు. ప్రత్యేకమైన అభిరుచి, శ్రద్ధాసక్తులు, శిక్షణ విజ్ఞానం ఉంటేకాని ఈ గ్రంథంలోని విషయం ఆసక్తికరమనిపించకపోయినా సాధారణ జిజ్ఞాసువులకు కూడా అర్థమయ్యేట్లు విషయవివేచనం చేశారు రామచంద్ర.

**2. గాథా సప్తశతిలో తెలుగు పదాలు :** రామచంద్రకు గాథాసప్తశతి అన్నా, ప్రాకృత సాహిత్య మన్నా చాలా అభిమానం. గాథాసప్త శతిని సంకలనం చేసి అందులోకొన్ని గాథలు స్వయంగా తానూ రచించిన హాలచక్రవర్తి తెలుగువాడనీ, సప్తశతిలోనిగాథలు తెలుగు దేశంలోజరిగినవనీ రామచంద్ర అభిమతం, అభినివేశమున్నూ. తెలుగువారి పల్లెసీమలు, కర్షకజీవనం, పండగలు పబ్బాలు, పంటలు, శృంగార జీవితం, కుటుంబ సౌభాగ్యం , మర్యాదలూ మప్పితాలూ గాథాసప్తశతిలోప్రతిబింబిస్తూ ఉంటాయని రామచంద్ర విశ్లేషణ. తనకు 22 ఏళ్ళ వయసున శ్రీవేటూరిప్రభాకరశాస్త్రిగారితో పనిచేస్తుండగా శాస్త్రిగారు ఏదో ప్రసంగవశాన గాథాసప్తశతిలో చాలా తెలుగు పదాలుండే అవకాశం ఉంది అన్నారుట. అది తమకు చాలా స్ఫూర్తిని, ప్రేరణను కలగజేసిందన్నారు రామచంద్ర. గాథాసప్తశతిలో తెలుగు పదాలనే ఈ పుస్తకం మొదటిసారిగా 1978లో ప్రచురితమైంది. తరువాత మళ్ళీ ఆంధ్రప్రదేశ్ పురాతత్వ శాఖ వారు అచ్చువేశారు. 'గాథాసప్తశతిలో తెలుగుపదాలు' అనే వ్యాసం ఈ సంపుటిలోని మొదటి వ్యాసం. ఇందులో రామచంద్రకూర్చిన వ్యాసాలు 25 సం.లలో ఆయన అధ్యయన ఫలితాలు, అంటే ఆయన ఎంతగాథాభినివేశంతో గాథాసప్తశతిని పరిశోధిస్తూ వచ్చారో తెలుసుకోవచ్చు. గాథాసప్తశతిలోని తెలుగు పదాలు (1948 భారతి, మే) సప్తశతిలో నగానట్ర (1959 భారతి, ఫిబ్రవరి) సప్తశతిలో నాట్యనాటక రీతులు (1957 నాట్యకళ, డిసెంబరు) సప్తశతిలో గ్రామజీవన సౌందర్యం (బుద్ధజయంతి సంచిక, 1954) సప్తశతి - కాళిదాసు అనుకరణ (ఆంధ్రపత్రిక ఉగాది సంచిక 1975) ప్రాకృతసాహిత్యంలో సామాన్య మానవుడు (భారతి, 1974) వ్యాసాలు రామచంద్ర ఈ సంపుటిలోచేర్చారు.

ఇందులో 150 మూలగాథలను ప్రాకృతంలోనివి ఇచ్చి వాటి అర్థతాత్పర్యాలు పరమరమణీయంగా కూర్చారు. రామచంద్ర ప్రాకృత సాహితీ పాండిత్యం, పరిశోధన ఆశ్చర్యావహంగా ఈ వ్యాసాలు వెల్లడిస్తాయి.

**3. నుడి - నానుడి :** కొన్ని తెలుగు పదాలపుట్టు పూర్వోత్తరాలు సమీక్షించేప్రశస్త రచన ఇది. తెలుగులో తూర్పు, పడమరలున్నాయికాని, దిగ్వాచకాలైన ఉత్తర దక్షిణాలు ఎందుకు లేవు? ఉండిఉండవా? ఉండి ఉంటాయి? ఉంటే అవి ఏవి? అనే జిజ్ఞాస చేశారు. ఆ ఫలితమే ఇటువంటి చాలా మాటల వ్యుత్పత్తిని గూర్చి చేసిన ఆలోచనగా పరిణమించింది. పాఠకులకు ఆలోచనను, ఉల్లాసాన్ని, విజ్ఞానాన్ని పెంపొందించే ఉద్దేశంతో ఇటువంటి మాటలను కొన్ని తీసుకొని వాటికి అట్టుపుట్టు ఆనవాళ్ళను చర్చించారు రామచంద్ర. కందులకు ఆమాట ఎందుకు వచ్చిందని రామచంద్ర జిజ్ఞాస. ఈ జిజ్ఞాస తీరడానికి ఒకరాత్రి అంతా కోరాడ రామకృష్ణయ్యగారితో, వారి నిద్రకూడా చెడగొట్టిచర్చించానని రామచంద్ర తరచూ ప్రస్తావిస్తూ ఉండేవారు. ఇటువంటి శబ్దోత్పత్తి, వ్యుత్పత్తి, గూర్చి తెలిపే పుస్తకాలు తెలుగులోనే కాదుకదా, భారతీయ భాషలలోనే లేవు. ఇదికూడా రెండుముద్రణలు పొందింది.

**4. ప్రాకృతవాఙ్మయంలో రామకథ :** రామాయణ గాథ ఎవరెన్ని సార్లు, ఎన్ని విధాల రచించినా భారతీయులకు ప్రీతిపాత్రమే. రాముడు తెలుగునాట సంచరించాడని తెలుగు వారికి మరింత ఇష్టదైవమైనాడు. రామగాథాత్మకమైన రచనలు తెలుగులో కొన్ని వేలు ఉంటాయి. తెలుగులో రామచరిత వెలువడని ప్రక్రియ లేదు. రామాయణాన్ని తెలుగులో మొదటిసారిగా రాశాడనుకుంటున్న ఎర్రాప్రగడ రామకథను గూర్చి చెబుతూ 'మానవజాతికిన్ పశుసమానత మానగ జేసె –' అని వాల్మీకి మహామునిని ప్రస్తుతించాడు. భారతం అరణ్య పర్వంలో కూడా ఎర్రాప్రగడ రామకథ రచించాడు. ఒకప్పుడు జైన, బౌద్ధాలు తెలుగునాట ప్రాచుర్యంలో ఉండేవనీ, అప్పుడు వాళ్ళు తమ మతబోధ కనుగుణంగా రామాయణ, భారతాలను తిరిగిరాసుకున్నారనీ (సంస్కృతరచనలను యథాతథంగా ప్రచారం చేయలేక) అందువల్ల ఆ జైన, బౌద్ధరామాయణగాథల ప్రభావం తెలుగులో

వచ్చిన దేశీయ ఛందః విలసిత రామాయణ గాథలలోనూ, జానపద వాఙ్మయంలోనూ, ప్రవేశించాయని రామచంద్ర ఊహిస్తున్నారు. రామాయణ ప్రభావం నుంచి జైనమతమూ, బౌద్ధ మతమూకూడా తప్పించుకోలేకపోవడం వల్లనే ఈ విధంగా చేశారని రామచంద్ర భావన. ఇది సహేతుకంగానే కనపడుతుంది. ఈ పుస్తకం మొదటిసారి 1992లోకాని అచ్చుకాలేదు. 'ప్రాకృతవాఙ్మయంలో రామకథ' అనే వ్యాసం వారు 1978లోనే భారతి మాసపత్రికలో ప్రకటించారు. ఈ వ్యాసానికి ఇంకా ప్రాకృతసాహిత్యానికి సంబంధించిన మరికొన్ని వ్యాసాలు చేర్చి రామచంద్ర ఈ సంకలనం ప్రకటించారు. వజ్జాలగ్గంలో తెలుగు పదాలు, ప్రాకృతప్రకృతి, తెలుగు ప్రాకృతాల సంబంధం, జినవల్లభుని మహావీరస్వామి స్తోత్రం, దేశినామమాలలోని తెలుగు పదాలు తక్కిన వ్యాసాలు. ఈ చివరి వ్యాసం రామచంద్ర 1959 లోనే భారతిలో ప్రకటించారు. రామచంద్ర సమస్త సాహిత్య కృషిలో ఒక పాయగా ప్రాకృత సాహిత్య వ్యాసంగాభిమానం కనపడుతూనే ఉంది.

**5. సాహితీ సుగతుని స్వగతం :** రామచంద్ర భారతి మాసపత్రికకు సంపాదకత్వం నిర్వహిస్తున్న రోజులలో ఒక ప్రత్యేక శీర్షికగా యీ వ్యాసాలు భారతిలో ప్రచురించారు. దీని పునర్ముద్రణకు వారుత్సహించిప్రచురణ యోగ్యప్రతి తయారు చేసుకున్నారు. కాని అది జరగలేదు. 'తెలుగు జాతిప్రాచీన సంగీత రూపకం బుఱ్ఱకథ' 'ఆంధ్రసాహిత్యంలో పర్యాయపదాలు' 'పద్యాలకు రాగాలనిర్దేశం' 'నువ్వులు కొట్టిన ఇడి నూటిడి' 'పాతదైనా కొత్తదారిన వచ్చిన ఏకాంకిక' 'కర్ణాటక భాషాభూషణం, కేతన అనుసరణ', 'నవకవులలో పాశ్చాత్యుల భావచిత్రణ', 'నూట, నూట ఎనిమిది, నూట పదహారు (వీటిప్రాముఖ్యం)', 'నేటి సాహిత్యవిమర్శ', 'నాయని వారిప్రణయసూక్తం', 'శివతత్వసారం పాఠాల పరిష్కరణం', 'తెలుగు నాట తొలి నాటకం క్రీడాభిరామం', 'బుద్ధుడికి ముందు కాలం నుంచే ధూమపానం', 'అమరావతి ఆదర్శంగా అందాలు దిద్దు కున్న ఆగ్నేయాసియా' వంటిప్రశస్త విషయాలున్నాయి ఈ వ్యాస సంపుటంలో. రామచంద్ర పరిశీలన, పరిశోధనాసక్తి, విషయ వివరణ ప్రవీణత ఈ వ్యాసాలలో

తలస్పర్శిగా కనపడతాయి. ఆఫ్రికా కవులను గూర్చి, ఈజిప్టు ప్రజల ఆముష్మిక చింతనను గూర్చి వేల సంవత్సరాల నాటి విశేషాలు చెప్పారు. ఈ సంపుటిలోని ఆ వ్యాసాలలో పురాచరిత్ర, తత్త్వచింతనం, సంస్కృతి వివరిస్తూనే నేటి తెలుగు కవుల కల్పనా కామనీయత గూర్చి చెప్పారు. సమకాలిక తెలుగు నవలలను సమీక్షించారు. వేదం వెంకట్రాయశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, ధర్మవరం కృష్ణమాచార్యులవంటి మహామహుల ప్రతిభను గూర్చి అపూర్వ విషయాలు తెలిపారు. ఈ సంపుటిలో అన్నమయ్య గూర్చిన అందమైన వ్యాసం ఉంది. కళలు - శాస్త్రమూ ఏది ముఖ్యం మానవ జీవిత వికాసానికి, నాగరకతకు? అనే ముఖ్యాంశం చర్చించారు. ఈ వ్యాస సంపుటి రామచంద్ర బహుముఖీన ప్రజ్ఞకు నిలువుటద్దం.

**6. హిందువుల పండగలు - పర్వములు:** రామచంద్రగారి ప్రశస్త రచన. భారతదేశంలో హిందువులు తత్రాపీ తెలుగువారూ తరతరాల నుంచీ చేసుకుంటున్న పండగలను, పర్వాలను గూర్చి రామచంద్ర ఈగ్రంథంలో వివరించారు. చతుర్వర్గ చింతామణి (హేమాద్రి) ధర్మసింధు (కాశీనాథోపాధ్యాయుడు), నిర్ణయసింధు (కమలాకరభట్టు), స్మృతికౌస్తుభం (అనంగదేవ), వ్రతచూడామణి (ప్రాచీన గ్రంథం) వంటి భారతీయ సంస్కృతికి సంబంధించిన గొప్ప గ్రంథాలు, మరెన్నో ఇంగ్లీషు గ్రంథాలు, సురవరం ప్రతాపరెడ్డి, వేలూరి శివరామశాస్త్రి వారి వంటి గొప్పగ్రంథాలు చదివి విషయ సంగ్రహణం చేశామని రామచంద్ర చెప్పుకొన్నారు. ఇందులో సుమారు 30 పండగలను గూర్చి చెప్పారు. తెలుగు పండగల పేరుతో ఈ గ్రంథానికి సంగ్రహముద్రణం మళ్ళీ 1975లో ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా వెలువడింది. ఈ గ్రంథంవల్ల భారతీయుల వేదకాల విజ్ఞానం, ఖగోళ పాండిత్యం, జనజీవన సంస్కృతి, నాగరకత తెలుస్తాయి. ఈగ్రంథాన్ని చదివి ఇక ఈ విషయంలో ఎవరికీ ఏమీ మిగలకుండా చెప్పారని విశ్వనాథ సత్యనారాయణగారు తనను మెచ్చుకున్నారని ప్రసక్తం చేస్తూ రామచంద్ర మురిసిపోతుండేవారు. ఉగాది, శ్రీరామనవమి, వినాయకచతుర్థి, దసరా, దీపావళి, సంక్రాంతి వంటి ముఖ్యమైన పండగల పుట్టుపూర్వోత్తరాలన్నీ

యీ గ్రంథంలో రామచంద్ర చెప్పారు.

**7. తెలుగు పత్రికల సాహిత్యసేవ:** తెలుగు పత్రికల పుట్టు పూర్వోత్తరాలను గూర్చి చెప్పడంలో రామచంద్ర కన్న అధికారం కల వాళ్ళు మరొకరు కనిపించరు. గడచిన నూట ఏభై సంవత్సరాల తెలుగు పత్రికల చరిత్రను వారు ఈ గ్రంథంలో చక్కగా సమీక్షించారు. 1840 ప్రాంతంలో వెలువడిన వృత్తాంతిని పత్రిక నుంచి పాఠకుల జాబులు కూడా ఉదాహరించారు. తెలుగు పత్రికల సాహిత్యసేవ మొట్టమొదటిసారి 1989లో ప్రచురితం. మళ్ళీ మూడేళ్ళలోనే ఈ పుస్తకం విపులీకృత ముద్రణంగా కూడా వచ్చింది. 19వ శతాబ్ది పూర్వార్థంలో ప్రారంభమైన తెలుగు పత్రికలు తెలుగునాట భాషా సారస్వత రాజకీయ చైతన్యం తెలుగు ప్రజలలో ఎలా కలిగిస్తూ వచ్చాయో ఆసక్తికరంగా యీ గ్రంథంలో వివరించారు రామచంద్ర. తెలుగు నాట దినపత్రిక 20వ శతాబ్దపు ప్రథమదశకంలోనే ప్రారంభమైంది. తెలుగు దిన పత్రికల తొలినాళ్ళ తీరుతెన్నులు, రాగారాగా సాంకేతిక విజ్ఞానంతో తెలుగు పత్రికలు సంతరించుకున్న రూపరేఖలు, అందచందాలు కూడా వివరించారు. ఈ పుస్తకంవల్ల సార్ధశతాబ్ది తెలుగునాట సామాజిక సాహిత్య సాంస్కృతిక పరిణామాలు ఏ విధంగా రూపుదిద్దుకుంటూ వచ్చాయో తెలుసుకోవచ్చు. ఈ నూట ఏభైఏళ్ళ తెలుగు నాట సామాజిక, సాహిత్య సేవచేసిన సుమారు 75 పత్రికలను గూర్చి ఈ గ్రంథంలో రామచంద్ర రాశారు. ఆధునిక కాలాన కొన్ని పత్రికలు ఆశించిన రాజకీయచైతన్యాన్ని కూడా వివరించారు రామచంద్ర. తెలుగులో పత్రికలు ఆరంభంకాగానే పరిపుష్టిని పొందిన ప్రక్రియ 'వ్యాసం' కాబట్టి నూరు, నూట ఇరవైసంవత్సరాలలో వ్యాసం ఏ విధంగా రూపొంది, ఎంతటి వైవిధ్యం పొందిందీ వివరించారు. తెలుగు పత్రికల గూర్చి సప్రమాణంగా వివిధ విషయ సంభరితంగా రూపొందింది ఈగ్రంథం. మూడుఏభైల కాలంలో తెలుగు నాట సంభవించిన సామాజిక పరిణామాలు, సాహిత్య వికాసం తెలుపుతుంది ఈ గ్రంథం.

**8. మూడు వాఙ్మయ శిఖరాలు:** భాషాసాహిత్య పరిశోధనరంగాలలో

తనకు ఆదర్శప్రాయులూ, గురుతుల్యులూ అయిన ముగ్గురు మహనీయుల్ని గూర్చి ఎంతో ఆసక్తి కరంగా వ్రాసిన ఆ మహనీయుల సారస్వత జీవన చిత్రణలివి. ఆ ముగ్గురు మానవల్లి రామకృష్ణ కవి, వేటూరిప్రభాకరశాస్త్రి, నిడుదవోలు వేంకటరావు గారలు. ఈ ముగ్గురు ప్రతిభాశాలురను గూర్చి ఎంతో తాదాత్మ్యంతో రాశారు రామచంద్ర. ఈ ముగ్గురుప్రజ్ఞామూర్తులతో సాహిత్య సాన్నిహిత్య పరిచయం రామచంద్రకు ఉండడం విశేషం. 1987లో ఈ పుస్తకం తొలిసారి ప్రకటితమైంది.

ఒక గొప్ప కథ చదివించినట్లూ, ఉత్కంఠ పరిపోషకమైన నవల చదివించినట్లు గొప్ప సృజనప్రతిభతో యీ జీవిత చిత్రణ వ్యాసాలు కూర్చారు రామచంద్ర. కాన్పూరులో జరిగిన ఒక విద్వద్గోష్ఠిలో రాహుల్ సాంకృత్యాయన్, లక్ష్మణ్‌స్వరూప్, పాట్నా హైకోర్టు న్యాయమూర్తులైన కె.పి.జయస్వాల్‌లు మానవల్లి వారిని ప్రస్తుతించడం తనకు దివ్యానందం కలిగించిన ఘటన అన్నారు రామచంద్ర. మానవల్లి వారు భరతుడి నాట్య శాస్త్రాన్ని, అభినవగుప్తుడి వ్యాఖ్యానంతో సహాప్రకటించడం, భరతనాట్యకోశాన్ని ప్రకటించడం, ఇందుకు వారు పడిన శ్రమ, నాట్యకోశం పరిష్కరణకోసం దేశం వివిధ ప్రాంతాల నుంచి 40 వ్రాతప్రతులు సంపాదించడం, దిఙ్నాగుడి కుందమాలను ప్రకటించడం, కవిగారు యావద్భారత కీర్తి నార్జించడం పరమోత్తేజకరంగా వర్ణించారు.

ప్రభాకరశాస్త్రిగారి దగ్గర స్వయంగా సాహిత్య పరిశ్రమ చేశారు రామచంద్ర. అట్లానే నిడుదవోలు వారిని మూడు దశాబ్దాలు అత్యంత సన్నిహితంగా ఎరుగుదురు రామచంద్ర. 20వ శతాబ్ది తెలుగు సాహిత్యంలో ఈ ముగ్గురు మహానుభావులు గొప్ప కీర్తిమంతులు. వీరిని గూర్చి చాలా గొప్ప పుస్తకం ఇది.

**9. నాగలాపురం - దాని పరిసరాలు :** ఇది 1984లో పుస్తకరూపంగా వచ్చింది. 1968లోనే ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో ధారావాహికంగా ప్రచురితం. దీనిగూర్చి పరిచయ వాక్యాల్లో రామచంద్ర ఇట్లా వ్రాశారు. 'దీనిలో నాగలాపురం పరిసరాలైన కైలాసనాథకోన, రామగిరిక్షేత్రాల చరిత్రను కూడ ప్రస్తావించాను. ఈ అపూర్వవాస్తుకళానిధులు కాలగర్భంలో కనుమరుగుకారాదనే

ఆవేదనే ఈ చరిత్ర రచనకు మూలకారణం' అన్నారు రామచంద్ర. ఇటువంటి గ్రంథం ఒక్క రామచంద్ర తప్ప మరొకరు రాయలేరు. కృష్ణదేవరాయల వారి యశస్సును మహాద్భుతంగా ఈ గ్రంథం వెల్లడిస్తుంది. 'ఇండియన్ ఏంటిక్వరీ' లోని శ్రీకృష్ణదేవరాయలవారి శాసనాలన్నీ పరిశీలించి, నాగలాపురంలోని వేదనారాయణస్వామి వారి దేవాలయం నిత్యకైంకర్యాలు గూర్చి చాలా ఆసక్తికరంగా రాశారు రామచంద్ర.

**10. అవదాన కల్పలత :** వెయ్యేళ్ల నాటి క్షేమేంద్రుడి రచనకు ఇది అనువాదం. రెండు ముద్రణలు పొందింది. గౌతమబుద్ధుని పూర్వజన్మలకు సంబంధించిన జాతకకథలివి. అవదానమంటే పూర్వజన్మ వృత్తాంతమని అర్థం. క్షేమేంద్రుడి కుమారుడైన సోమదేవుడు ఈ గ్రంథాన్ని పరిష్కరించినట్లు తెలుస్తుంది. సప్త భాగాలాయాన పూరించాడుట. సోమదేవుడి పరిచయ వాక్యాలుకూడా రామచంద్ర చేర్చారు. ఈ గ్రంథానికి శివశంకరస్వామి పీఠిక వ్రాశారు. వెయ్యేళ్ళనాటి గ్రంథమైనా రోచకమైన ఇప్పటి వ్యాహహారిక భాషాశైలిలో రామచంద్ర చాలా ఆసక్తికరంగా చదివించేట్లు ఈ బృహద్గ్రంథాన్ని 107 కథలతో (ఒకటి లభించలేదు) కూర్చారు.

**11. లలిత విస్తరం :** మహాయానబౌద్ధులు తథాగతుడి దివ్యచరిత్రను గూర్చి విరచించిన మొదటి గ్రంథం. బులుసు వెంకట రమణయ్యగారితో కలసి రామచంద్ర దీనిని తెనిగించారు. భారతీయభాషలలో ఇదే తొలిసారి వెలువడటం. సింహళంలో లభించింది ఈ గ్రంథం. దీనిని తథాగతపురాణం అని చెప్పవచ్చు. రోచకమైన శైలి. 1972 లో తొలిసారి ముద్రితం. ఇది మళ్ళీ ముద్రితంకావాలని రామచంద్ర తమకిస్తూ ప్రసంగించేవారు సన్నిహితులతో.

**12. హాలగాథలు** : హాలుడి గాథా సప్తశతినుంచి 50 కథలపైగా నేటి కథాశిల్పంతో కూర్చారు రామచంద్ర. 'గాథాసప్తశతి' భావాలను కథలుగా అల్లి ఒకవార పత్రికలోప్రచురించాను అని రామచంద్ర చెప్పారు.

ఇవిగాక రామచంద్ర దక్షిణాంధ్రవీరులు, వీరగాథలు అనే పుస్తకాలు హైస్కూలు తరగతుల వాచకపుస్తకాలుగా 1950లలో ప్రకటించారు. వివేకానంద

వాచకాలుకూర్చారు. ఆదిరాజు వీరభద్రరావు గారితో కలసి కొన్ని వాచక పుస్తకాలు రచించారు. అవి ఎంతో ఆసక్తి దాయకంగా విజ్ఞానదాయకంగా ఉన్నాయి.

ఇవికాక తమ అర్ధశతాబ్ది పత్రికా రచయిత వృత్తిలో వివిధ పత్రికలలోరాసిన వ్యాసాలు, మనవి మాటలు, అహంభోఅభివాదయే, బృహదారణ్యకం అనే సంపుటాలు 1990 నుంచి 1995 లోప్రచురించారు. ఈ మూడు సంపుటాలు వివిధ విషయ శోభితాలు. విజ్ఞాన వైవిధ్య దీప్తిమంతాలు. ఇవేకాక హరేకృష్ణ సంస్థ (ఇస్కాన్) వారికి శ్రీలప్రభుపాదుల గ్రంథాలు ఎన్నో అనువదించి ఇచ్చారు. అవన్నీ సరళ సుందరాలు. అన్నిటికన్నా ముఖ్యంగా ఆశ్చర్యకరంగా చెప్పుకోవలసింది. 'ఓటు ఎవరికి' అనేవారి కరపత్ర రచన. భారతదేశంలో ఎన్నికలలో ప్రవేశించిన సమస్త కల్మష మార్గాలను వివరిస్తూ ప్రజాస్వామిక రాజకీయ సాఫల్య వ్యవస్థకు, ప్రజలలో రావలసిన చైతన్యం, కావలసిన అవగాహన ఈ 20 పుటల కరపత్రంలో చక్కగా వివరించారు రామచంద్ర.

క్షేమేంద్రుడి బృహత్కథా మంజరిని కూడ రామచంద్ర అను వదించారు కాని అది ఇంకా గ్రంథరూపం పొందలేదు. రామచంద్ర చేసిన రచనలు సహస్రాధికాలు. అవన్నీ పుస్తకాలుగా రావాలంటే కొన్ని పదుల పుస్తకాలే కావాలి. రావాలి.





# 18. రామచంద్ర వ్యక్తిత్వం

తిరుమల రామచంద్ర ఆత్మగుణసంపన్నులు. పరమనిరాడంబరంగా తమ జీవితం గడిపారు. ధనంకోసం, పదవికోసం, హోదాకోసం ఏనాడూ పాకులాడలేదు. ప్రచారంకోసం, కీర్తి కోసం పరుగులు పెట్టలేదు. ఈషణత్రయంకన్నా కూడా విమోహకరమైన కీర్తీషణ పట్ల కూడా ఆయన ఆకర్షితుడు కాలేదు. ఎంతో సౌమ్యంగా సాధువర్తనతో ఆయన కాలం గడిపాడు.

కుటుంబంలోనూ సమాజంలోనూ గౌరవంగా ఉండడానికి మానవుడు న్యాయంగాను, నీతితోను వ్యహరించాలి అని ఒక సంస్కృత శ్లోకాన్ని స్వీయ చరిత్రలో ఉదాహరించారు రామచంద్ర. దానికి ఉదాహరణప్రాయంగా తమ జీవితాన్ని గడిపారాయన.

'సత్యం, తపస్సు, జ్ఞానం, అహింసాగుణం, విద్వాంసులను సేవించడం, ఉత్తమశీలం – ఈ గుణాలున్న వాడే విద్వాంసుడు కాని వట్టిచదువుతో విద్వాంసుడు కాడు' అని తమగురువులను ప్రశంసిస్తున్న సందర్భంగా చెప్పారు రామచంద్ర.

ఈ గుణాలు రామచంద్ర తమ జీవిత వర్తనలోపాటించారు.

ఆయన ఎప్పుడూ ఎవరి గూర్చీ నిందావాక్యం పలకలేదు. తనకన్న చిన్నవారు, చితకవారు సన్మానాలు, పదవులు, గుర్తింపులూ పొందే ప్రాగల్భ్యం ప్రదర్శిస్తున్నా

అసంతృప్తి ప్రకటించలేదు. ఈసును వ్యక్తం చేయలేదు. తానెప్పుడూ తెలుసుకోవలసిన వాడేకాని తెలిసినవాడుకాదు అన్నట్లే సాహిత్య విషయాలలో చిన్నవారిపట్లకూడా ఆయనమెలగేవారు. ఎవరైనా ఏదైనా స్వరచిత పుస్తకం రామచంద్రకు గౌరవంతో ఇస్తే వీలైనంత త్వరలో దానిని చదివి రచయితకు లేఖరాసేవారు రామచంద్ర. అభిప్రాయంకోసం, పీఠికకోసం, ఎవరైనా కోరినా కాదనక ఆయన వెంటనే ఆ పనిలో నిమగ్నులయ్యేవారు.

ఆయన మానవసంబంధాలన్నీ ఎంతో ఉదారంగా, ఆర్ద్రంగా ఉండేవి. ఒకసారి రామచంద్ర ఒక సంపన్న సాహిత్య సంస్థవారి ఆహ్వానంపై విజయవాడలో ఒక పెద్ద హోలులో మూడురోజులు బసచేసి నప్పుడు రామచంద్ర గొప్ప విద్వాంసుడనీ, సౌజన్యమూర్తి అనీ తెలుసుకొన్న ఆ హోటల్‌గది ఉపచారకుడు తన జాతక వివరాలు ఇచ్చి దాని సంగతులు చెప్పమని అర్థించగా, రామచంద్ర అక్కడ తమకు కావలసిన అపేక్షిత పుస్తక సామాగ్రి, సంబంధిత పంచాంగం లేనందువల్లనో ఏమో హైదరాబాదు వెళ్ళిన తర్వాత చూసి వివరంగా తెలియబరుస్తానని చెప్పారు. అదే విధంగా ఆ హోటల్ గది ఉపచారకుడికి ఆ వివరాలతో లేఖరాశారు.

ఇదేవిధంగా ఒకసారి తమకు అత్యంత సన్నిహిత పరిచయం లేకపోయినప్పటికీ అతడు తెలుగు పండితుడు, చిన్నవాడు అనే పరిగణనతో అతడి సంతానపు పరితాపకరస్థితిని గూర్చి, ఆ పిల్లవాడి జాతకం చూపి ఆశావహమైన పరిస్థితులు సంభవమా అని ఆ పండితుడు రామచంద్రను అడగ్గా, తన మిత్రుడు గొప్ప జ్యోతిష్కుడు హైదరాబాదులో ఉన్నాడనీ, ఆ జాతకం అతడికి చూపి సంప్రదించి తెలియచేస్తాననీ రామచంద్ర ఆ పండితుడికి చెప్పినట్లే సవివరంగా లేఖరాశారు. ఇటువంటి సంఘటనలు ఆయన సౌజన్యానికీ, సౌలభ్యానికీ తార్కాణం.

భర్తృహరి చెప్పినట్టు రామచంద్ర గొప్ప మనస్వి.

**'మనస్వీకార్యార్థీ న గణయతి దుఃఖం, నచసుఖమ్'**

ఆయన ఒక సందర్భంలో ఇట్లా ప్రస్తావించారు తమ జీవనోదంతాలలో. 'వివేకవంతుడు పరులకోసం ధనం, జీవితం వినియోగించాలి. వినాశం తప్పదు గనుక పరులకోసం త్యాగం చేయడం ఉత్తమం' అన్నారు. యథాశక్త్యానుసారం,

రామచంద్ర దీనిని పాటించారు.

దగ్గర బంధువులలో, వాళ్ళు గొప్ప శ్రీమంతులు కూడాను, ఒక తరుణి తనను మనఃస్ఫూర్తిగా వివాహం చేసుకోవలసిందని కోరినా తాడూ బొంగరం లేని తనలాంటివాణ్ణి చేసుకొని ఆమె సుఖపడదని అనునయంగా ఆమెను విరమింప చేశారు, ఆయన ఆమెను ఆ ప్రయత్నం నుంచి. అప్పట్లో ఆయనకు చదువు పూర్తి కాలేదు. స్వాతంత్ర్యోద్యమ సందర్భంగా విప్లవకారులతో కలసి వ్యవహరించాడని పోలీసులు వెన్నంటుతున్నారు. భవిష్యత్తు అగోచరం. అగమ్యగోచరం. అందువల్ల ఆమె ప్రేమను కాదన్నారు రామచంద్ర. ఈ విధంగా నూటికొక్కరు కూడ ఆలోచించలేరు. అప్పుడాయనకుఇరవైఏళ్ళ వయసు. ప్రేమ యొక్క ఔన్నత్యపరసీమ ఈ ప్రవర్తన. యౌవనోద్రేకాలు, ఉద్వేగాలను కూడ ఆయన అధిగమించాడు ఆ తారుణ్యోద్వేగ యౌవన దశలో.

తల్లి అంటే ఆయనకు బహిఃప్రాణం. ఆమె విజ్ఞతపై, వివేకంపై ఆయనకు అపారమైన లక్ష్యం. తనకే ధర్మసంకటం కలిగినా, సమస్య వచ్చినా తల్లికి రాసేవారు రామచంద్ర. ఆమె ఉత్తమోత్తమ, ఉన్నతోన్నత సంస్కారమే తనకు దారి దివ్వెగా ఉపకరించిందని స్వీయచరిత్రలో రామచంద్ర ఎన్నిసారులో స్మరించుకున్నారు.

తెలిసీ తెలియని తన చిన్ననాటి తప్పులను కూడా ఆయనెంతో ఆర్ద్రంగా స్మరించుకున్నారు. పశ్చాత్తాపం వెలిబుచ్చారు. తాను ఏడెనిమిదేళ్ళ వయసున అనాచారానికి, దొంగతనానికీ తలపడ్డాననీ, అబద్ధాలు చెప్పాననీ నొచ్చుకుంటూ రాశారు స్వీయచరిత్రలో. తండ్రిగారి మాటను గౌరవించారు. అప్పుడప్పుడే పెండ్లి చేసుకోవడం ఇష్టం లేకపోయినా తండ్రిగారి పరువు దక్కించడంకోసం ఆయనిచ్చిన టెలిగ్రాంనే సుగ్రీవాజ్ఞగా తలదాల్చి తాము అంతకుముందు కనీసం చూడకపోయినా తల్లిదండ్రులు తనకై నిర్ణయించిన వధువునే స్వీకరించారు. అలనాటి శ్రీరామచంద్రుడి ప్రవర్తననే తలపింపచేశారు తండ్రిగారి కోరికను నెరవేర్చడంలో. కాన్పూరులో ఇంగ్లీషు దినపత్రికలో పనిచేయడంకన్నా మాకు దగ్గరలో మద్రాసులో ఏదైనా పత్రికలో పనిచేసుకోవచ్చు కదా అని తండ్రిగారు సలహా ఇవ్వగానే కాన్పూరులో తనకు తృప్తికరంగానే కాలం గడుస్తున్నా, ఆంధ్రదేశానికి వచ్చి

ఉద్యోగం చూసుకున్నారు.

ఆయన సచ్ఛీలం, ఔదార్యం గొప్పవి. మిత్రులపై ఆదరాభిమానాలు అపారం వారికి. మిలటరీలో పనిచేస్తున్నప్పుడు షామహమద్, షానవాజ్‌లు వారిపట్ల చూపిన ప్రేమాభిమాన ఆదరగౌరవాలు రామచంద్ర కూడా వారిపట్ల ప్రకటించాడు. బతికి చెడ్డ అచ్చార్‌సింగ్ అనే సజ్జనుణ్ణి ఆకలిబాధనుంచి కాపాడటానికి గొప్ప మానవత్వ దృక్పథం అవలంబించారు. తనను కోర్టు మార్షల్‌కు గురిచేసినప్పుడు తప్పంతా తనదే కాబట్టి అచ్చార్‌సింగ్‌ది ఏ తప్పూ లేదు కాబట్టి అతణ్ణి అల్లరి పెట్టవద్దనీ, అవమానం పాలు చేయవద్దనీ సైనికాధికారులనర్థించాడు రామచంద్ర. ఇంతకన్న ధీరోదాత్తత ఎక్కడైనా ఉంటుందా?!

రామచంద్రది అచ్చ స్వచ్ఛమైన సరళ స్వభావం. స్నేహార్ద్రపూరితం. ఆయన చిన్న పిల్లలనెంతో ప్రేమించేవారు. సైన్యంలో హవల్దారు గుమాస్తాగా ఆయన పనిచేస్తుండగా ఆయన పనిచేస్తున్న సైనిక శిబిర ప్రాంతాన్ని కూడా యుద్ధభూమిగా ప్రకటించే అగత్యం ఏర్పడుతుందేమోనని సైనికాధికారులు ప్రత్యక్ష పోరాట సైనికులు తప్ప తక్కిన సేనా విభాగ అనుబంధ సైనికోద్యోగులకు ఒక నెల నిర్బంధంగా శెలవు ప్రకటించినప్పుడు రామచంద్ర స్వస్థలం వెళ్ళారు. అంటే పెళ్ళైన తర్వాత నాలుగు సంవత్సరాలకు ఇల్లాలును చూడటానికి వెళ్ళారు. శెలవు ముగించుకొని మళ్ళా తిరిగి వస్తుండగా కర్నైయిల్‌సింగ్ అనే సిపాయి మిత్రుణ్ణి కలుసుకోవాలనీ, అతడి జన్మ వృత్తాంతమేమిటో తెలుసుకోవాలని వాళ్ళ స్వగ్రామం వెళ్ళారు రామచంద్ర. మళ్ళీ తన సైనిక పటాల విధులలో చేరటానికి లాహోర్‌వచ్చి అక్కడ రైలు ఎక్కారు. లాహోర్ స్టేషన్‌లో తన సైనిక పటాల మిత్రులెందరో కలిశారని కూడా రామచంద్ర రాశారు.

లాహోర్ స్టేషన్‌లోనే తానెక్కిన బోగీలోనే రైల్వేలో పనిచేసే ఉన్నతోద్యోగి ఒకరు సకుటుంబంగా రామచంద్రకు తారసపడ్డారు. వారితో పరిచయం చేసుకున్నాడు రామచంద్ర. ఆయనకు జీవయాత్రలో తారసపడ్డ పథికులందరినీ పరిచయం చేసుకోవడం, వాళ్ళను తర్వాత కూడా అభిమానించడం ఎంతో ఇష్టం. ఆ రైల్వే అధికారి పేరు రామేశ్వర దయాల్‌గౌడ్ అనీ, ఆయన ఇల్లాలు పేరు

శాంత అనీ, భార్యాభర్తలు మధ్య వయస్కులనీ, వాళ్ళకిద్దరు పిల్లలనీ, వాళ్ళ పేర్లు ఓంవతీ, రాజో అనీ, వాళ్ళకు ఏడెనిమిదేళ్ళ ప్రాయం కావచ్చనీ రామచంద్ర రాస్తూ అతి విచిత్రమైన సంఘటన ఒకటి రాశారు. రామేశ్వర దయాళ్‌గౌడ్ గారు క్వెట్టాలో ఉద్యోగి. క్వెట్టాకు రైలు మర్రోజు 3 గం.లకు కాని చేరదు, ఆ రైలు అని రాస్తూ ఆ పిల్లలు తనను చూసి ఒకటే నవ్వుతుంటే చాలాసేపు అంటే నాలుగు గంటలు ఓర్చుకున్నాననీ, తల్లిదండ్రులు ఆ పిల్లలను వారిస్తూనే ఉన్నా ఆ పిల్లలు తనను ఒకరికొకరు చూపుకుంటూ ఆక్షేపంగా నవ్వుతూనే ఉంటే ఇక భరించలేక "గౌడ్ సాబ్! ఎందుకు ఆ నవ్వులు" అని అడిగాననీ అప్పుడా భార్యాభర్తలు కంగారుపడి "ఏం లేదు, మీ కాళ్ళ పారాణి బూట్ల లోపలి నుంచీ కనిపిస్తున్నది. మీ మద్రాసీ జరీ పంచెలలాంటివి ఇక్కడ ఆడవాళ్ళు కడతారు. పిల్లలు, అపార్థం చేసుకోకండి" అని ప్రాధేయపడ్డారని రామచంద్ర ఆ సంఘటన జ్ఞాపకం చేసుకున్నారు. ఈ వృత్తాంతం ఇంతటితో ముగిసిపోలేదు. అప్పుడు రామచంద్ర "హోష్! ఇంతేనా, అంటూ నా కిట్‌లో నుంచి రెండు జరీ ఉత్తరీయాలుతీసి ఆ పిల్లలకు అందించి "మున్నీయో! చున్నీ (ఓణీ)లాగ వేసుకోండి అన్నాను. వాళ్ళు సంకోచపడినా నేను బలవంతం చేశాను. వాళ్ళు నా సంగతులు కనుక్కున్నారు. నేను వారికి జిగిరీ దోస్త్ అయ్యాను. క్వెట్టాలో వారం వారం వాళ్ళింటికి వెళ్ళి వేడినీళ్ళ స్నానంచేసి భోజనంచేసి సినిమాకు వెళ్ళేవాడిని" అని రాశారు రామచంద్ర.

రైల్లో పరిచయమైన సద్యఃకాల పరిచితుల పిల్లలకు జరీ ఉత్తరీయాలు బలవంతంచేసి ఎవరైనా బహూకరిస్తారా? బలవంతంచేసి పిల్లలను ముద్దు చేస్తారా? ఇది రామచంద్ర పరమ సుకుమార ఆర్ద్ర ఔదార్య ప్రవృత్తి కాదా?

జలంధర్‌లో మాయ బంగారు నగల తయారీ సంస్థలో నెలరోజులు పనిచేసినప్పుడు ఆంధ్రదేశం నుంచి నగల నిమిత్తం, కామసుఖసంవర్ధక ఔషధాల పేరిట మోసపు సరుకునిమిత్తం వచ్చిన ఉత్తరాలను ఆయన చదివినప్పుడు ఆయన చాలా ఖేదం చెందినట్లు స్వీయచరిత్రలో రాశారు. "తెలుగువారి అమాయకత్వం, నగలపైన వ్యామోహం, కామప్రవృత్తి, తాయెత్తులపై వెర్రి నమ్మకం, ఒకటేమిటి, సకల వికార వైపరీత్యాలు తెలిసేవి. స్వాతంత్ర్యోద్యమంలోనేకాదు; సకల

అభ్యుదయోద్యమాలలోను పురోగాములుగా ఉన్న తెలుగువారు ఇంత పతితులయి పోయారా? ఇంతటి దయనీయ స్థితికి చేరుకున్నారా? బాగుపడే అవకాశం ఉందా? అని నా మనస్సు కుంగిపోయేది" – అని స్వీయచరిత్రలో బాధపడ్డారు రామచంద్ర.

మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో పనిచేస్తున్నప్పుడు 'ప్రతిఫలాపేక్ష లేకుండా చాలామందికి పనిచేసిపెట్టా'నని రాశారు రామచంద్ర. 'ప్రతిఫలం కోరడం, ఆ వ్యక్తి ఇస్తానని ఎగగొట్టడం, దానితో కష్టపడడం ఎందుకని?! ప్రతిఫలాపేక్ష లేకనే పనిచేసేవాడిని' అని చెప్పుకున్నారు రామచంద్ర. 'శాస్త్రిగారి మాటతో నలుగురైదుగురికి అలా నకలుచేసి (వ్రాతప్రతులు) పెట్టడం, వాళ్ళు ఎగవేయడం (డబ్బు) శాస్త్రిగారు తమ మాటపోయిందని కష్టపడటం జరిగింది' అని రామచంద్ర ఆ కాలపు సంగతులు స్వీయచరిత్రలో చెప్పారు. సీతారామయ్య అనే వారు విజయనగరం కళాశాలలో చరిత్రాధ్యాపకులుగా పనిచేసేవారు. (కళింగ) గాంగ వంశరాజులపై పరిశోధనచేస్తూ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారానికి వచ్చారుట. అక్కడ గాంగవంశావళి అనే సంస్కృత గ్రంథం ఉందట. ఆ సంస్కృత గ్రంథానికి నకలూ, అనువాదం కూడా కావాలని ఆయన వచ్చి వేటూరి ప్రభాకర శాస్త్రిగారిని అర్థించారుట. ఇంత డబ్బవుతుందని శాస్త్రిగారు ఆయనకు తెలిపారుట. నిబంధనల ప్రకారమైతే ముందుగానే డబ్బు చెల్లించాలి. కాని వ్రాతకోతలెందుకు? ఇచ్చేస్తాను వెంటనే వ్రాయించి పెట్టండి అని శాస్త్రిగారిని ప్రార్థించారుట ఆ పెద్ద మనిషి. శాస్త్రిగారి సలహాపై ఆ పుస్తకమంతా నకలుచేసి, దాని అనువాదం కూడా కూర్చి సీతారామయ్యగారి కందజేశారట రామచంద్ర. దాని సాయంతో తన పరిశోధన ముగించి, రామచంద్ర అనువాదాన్ని అనుబంధంగా (తనే రాసినట్లు?) కూడా ప్రచురించాడుట సీతారామయ్య. 'డబ్బు పంపలేదు సరిగదా. ఉత్తరం ముక్కయినా వ్రాయలేదు. అప్పుడు కార్డు ముక్క అర్ధణా!' అని వ్యాఖ్యానించారు రామచంద్ర స్వీయచరిత్రలో.

అట్లానే ప్రతివాద భయంకరాచార్యుల వారనే వారు తిరుపతి నుంచి వచ్చారట. ఆయుర్వేదంలో ఆయనకు చాలా అభిరుచి అట. ఆయన వచ్చి శాస్త్రిగారి

నాశ్రయించి నిత్యనాథసిద్ధుడి రసరత్నాకరంలోని ఒక ఖండాన్ని నకలు చేయించుకొని, దాని అనువాదం కూడా రాయించుకొని డబ్బు ఎగగొట్టినట్లు రామచంద్ర రాశారు. ఆ తర్వాత ఎప్పుడైనా నవ్వుతూ, ఆ సీతారామయ్య, ప్రతివాద భయంకరాచారి ఎక్కడైనా కనపడ్డారుటోయ్‌నీకు అని మేలమాడేవారు శాస్త్రిగారు అని రాసుకున్నారు రామచంద్ర. స్వీయచరిత్రలో ఒక సన్నివేశం ఇట్లా రాశారు రామచంద్ర. లాహోర్‌లో పరిచయమైన రఘునాథసింగ్ కాన్పూర్‌లో కన్పించి మనం నేపాల్ వెళ్ళి కలప వ్యాపారంలోకి దిగి లక్షలు సంపాదిద్దామని ఆకాశహర్మ్యాలు నిర్మించగా నమ్మాను అంటూ రామచంద్ర స్వీయచరిత్రలో ఇట్లా రాశారు. "నేను ఎవరితోనన్నా స్నేహం చేస్తాను. ఎదుటివారు మోసం చేశారూ, నాకు పోయేదేమీ లేదని నా విశ్వాసం. ఉపకారం జరిగిందా సరే"నంటూ చెపుతూ 'బృహస్పతి నీతిసూత్రం మాత్రం, మంచివాడని రుజువైందాకా ఎవరినీ నమ్మవద్దంటుందికాని, ఆ సూత్రం పట్లనే నాకు నమ్మకం లేద'న్నారు రామచంద్ర. ప్రతివాడూ మంచివాడని రుజువు కావడానికి ఏండ్లూ పూండ్లూ పడతాయి. మనకు మనశ్శాంతి ఉండదు. కనుక నమ్మడం మంచిదంటారు రామచంద్ర.

ఈ విషయాన్నే ఆయన తన ఒక వ్యాస సంపుటికి పరిచయ వివరణ రాస్తూ – అది కొందరు ప్రతిభావంతుల జీవిత రేఖాచిత్రణ చేసినపుస్తకం – 'మానవుడు మంచిచెడ్డల కలయిక – మంచిని చూడడం అలవరచుకొంటే, మనకు ఎంతో హాయి. చెడు చూచి మన మనసును చెడుపుకోవడం ఎందుకు? ఈ దృష్టితో వృత్తిధర్మంగా నేను కలుసుకొన్న సామాన్యుల, అసామాన్యుల స్వరూప స్వభావాల లేఖినీ చిత్రాలివి' అని రాశారు రామచంద్ర ఆ పుస్తకం గూర్చి.

ఒక వ్యక్తిలో 49 పాళ్ళు అవాంఛనీయ ప్రవృత్తి 51 పాళ్ళు మంచితనం ఉన్నా ఆ వ్యక్తిని మంచివాడిగా ఎంచుకుంటాను అన్నారు రామచంద్ర వేరొక సందర్భంలో. రామచంద్ర ఎప్పుడూ ఎవరి గురించి పరుషంగానూ, నకారాత్మకంగానూ ఒక్కమాటా పలికేవారు కాదు. ఎంత చిన్న వయసు వారిలోనూ ప్రతిభాలేశం కన్పించినా అబ్బురంగా హర్షించేవారు. అటువంటి వారిని ప్రోత్సహించేవారు.

ఆయనది ఒక వింతైన, విచిత్రమైన అరుదైన వ్యక్తిత్వం. మద్రాసు రామవిలాస్

హోటల్‌లోనూ, ఇంకొక గుజరాతీ హోటల్‌లోనూ పిండి రుబ్బడం మొదలైన హోటల్ పరిచారికత్వం నిర్వహించానని చెప్పుకున్నారు. మిత్రుల ఇళ్ళలో, అభిమానుల ఇళ్ళలో మహిళలతో ఎంతో కలుపుగోలుగా, చనువుగా, వాత్సల్యంతో ఆయన ప్రవర్తించేవారు. వాళ్ళలో ఏ కొంచెం గృహనిర్వహణ చాతుర్యం, పిల్లల పెంపకంలో నేర్పు, చదువుపట్ల ఆసక్తి ఉంటే అటువంటి మహిళలను ఎంతగానో మెచ్చుకునేవారు.

ఆయన ఎవరిగూర్చి ఎప్పుడూ ఎక్కడా ఒక్క లోపం ఎంచలేదు. అదిసరే ఆయన గురించి ఎక్కడా ఎప్పుడూ ఒక్క ఆక్షేపణ వినపడలేదు.





# 19. మరపురాని మనీషి - తెలుగు వెలుగు

'మరపురాని మనీషి' అనే పేరుతో వచ్చిన రచనా సంపుటి రామచంద్ర తెలుగునాట వివిధ రంగాలలో మనీషులైన, మహాప్రతిభాశీలురైన వ్యక్తులతో ఇంటర్వ్యూలు జరిపి వారి సమగ్రమూర్తిమంతాన్ని నిరూపించిన జీవిత లేఖినీ చిత్రాలు. ఈ రచన విపులమైనది కాదు. ఆయా వ్యక్తుల జీవిత కాల కృషికి సంబంధించి 'అద్దమందు కొండవంటి' రచన. వారి ప్రత్యేక విశిష్ట ప్రతిభ సూత్రప్రాయంగా చెప్పినటువంటిది. ఇటువంటి మహనీయులు 30 మందిని గూర్చి రామచంద్ర స్వయంగా వెళ్ళి వారితో గోష్ఠి జరిపి ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో నిర్వహించిన శీర్షికారచన యీ సంపుటిగా వెలువడింది. 40 సం.ల కిందట అంటే రామచంద్రకు 50 సం.ల వయసున ఒక వృత్తి నిపుణుడైన ఫొటోగ్రాఫర్‌ను (నీలంరాజు మురళీధర్) వెంటబెట్టుకుని, ఆయనతో ఆంధ్రదేశమంతా తిరిగి ఆయా ప్రముఖ వ్యక్తులను కలుసుకొని వారితో సముఖగోష్ఠి (ఇంటర్వ్యూ) జరిపి, వారి మహనీయతను విశ్లేషించిన రచన ఇది.

ఈ 'మరపురాని మనీషీ' జీవిత రేఖాచిత్రణ సంపుటిలో కవులు, పండితులు, కళాకారులు, రంగస్థల ప్రతిభావంతులు, చరిత్రవేత్తలు, విద్యారంగ ప్రముఖులు,

శాస్త్రజ్ఞులు, సంగీతరంగ ఉత్తుంగ శిఖరాలు, తత్త్వవేత్తలు ఉన్నారు. విశేషమేమంటే ఆయా ప్రముఖ వ్యక్తుల ఆత్మీయమూర్తిమంతాన్ని ప్రకటించే ఏడెనిమిది వివిధ భంగిమల ఛాయాచిత్రాలు కూడా ఈ రచనకు అలంకృతం కావడం.

ఈ ఛాయాచిత్ర సహిత రచన ఆ వారపత్రికలో వచ్చిన తరువాత ఎవరెవరి గూర్చి రామచంద్ర యీ లేఖినీ చిత్రాలు, వారి ఆత్మీయతా మనీషతా స్ఫూర్తితో సహా ప్రకటించారో వారంతా సంతోషించారు. ఈ రచన సంగీతకృతి వలె రాగలయలతో గమకాలతో నిర్వహించారు రామచంద్ర. ఆయా ప్రముఖుల వ్యక్తిత్వాన్ని సూత్రితం చేశారు. వారి జీవితానుభవాల్ని కూడా గ్రథితం చేశారు.

కాశీకృష్ణాచార్యుల వంటి గొప్ప సంస్కృత విద్వాంసుడు, సంస్కృత భాషా ప్రచారాన్ని ఏ విధంగా తెలుగునాట ప్రబోధించారో చెప్పారు. ఆయన సంప్రదాయ నైష్ఠిక జీవితం, సంస్కృత వాఙ్మయ పరిశ్రమ, సంగీతప్రజ్ఞ, హాస్యచతురత ఈ రచనలో ఉద్దీపింపజేశారు రామచంద్ర. అప్పటికే కృష్ణాచార్య మహోదయుల వయస్సు 90 దాటింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిని ఆస్థాన కవిగా కూడా గౌరవించింది. కృష్ణాచార్యులవారి సమగ్ర సాహిత్య సాంస్కృతిక వ్యక్తిత్వం యీ రచనలో ప్రతిబింబింప చేశారు రామచంద్ర.

గుండేరావు హర్కారే అష్టభాషా విశారదుడు. అరబ్బీ, ఫారసీలలో కూడా గొప్ప కృషిచేసినవారు. ఆ భాషల్లో మత వాఙ్మయంలో కృషిచేసిన మౌల్వీలతో సమస్కంధుడు. ఆయన స్వాతంత్ర్యం రాకపూర్వం నైజాం ఇలాకాలో న్యాయశాఖలో గొప్ప పదవులు నిర్వహించినవాడు. పాణినీయ మహాభాష్యానికి (అష్టాధ్యాయికి) గడియారం వంటి ఒక సాంకేతిక యాంత్రిక సాధనం నిర్మించినవాడు. ఆయనతో రామచంద్ర ఇంటర్వ్యూ అత్యంత కుతూహలంగా సాగింది.

స్వామి శివశంకరులు (పూర్వాశ్రమంలో తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, నవ్య సాహిత్యానికి ఆచార్య స్థానం వంటివారు. ఆధునిక భారతీయ భాషలు ఆయనకెన్నో వచ్చు. పాలీ, ప్రాకృతాలలో కూడా కృషిచేసినవారు. నవ్యసాహిత్య పరిషత్తు కాయన ఆజీవ సభాపతి. కొత్తతరం కవులకు, యువ రచయితలకు స్ఫూర్తినిచ్చినవాడు. ఒకతరాన్ని ప్రభావితం చేసినవాడు. నవ్యసాహిత్య పరిషత్తు

తరఫున ప్రతిభ, సఖివంటి పత్రికలు నడిపినప్పుడు వాటి నిర్వహణ వెనుక ప్రధానస్ఫూర్తి అయినవాడు. శివశంకరస్వామిని ఇంటర్వ్యూ చేయడానికి ఒంగోలు వెళ్ళి వారింట ఒక రోజు ఉండి ఈ ఇంటర్వ్యూ నిర్వహించారు రామచంద్ర. సాహిత్య ప్రయోజనం మానవుణ్ణి ఉదాత్త భూమికలలో విహరింపచేయడమేనన్నారు శివశంకరులన్నారు రామచంద్ర.

అక్కడ నుంచి నరసారావుపేట వచ్చారు రామచంద్ర. స్వాతంత్ర్యోద్యమ కాలంలో అత్యున్నత ప్రమాణాలతో ఆసేతుహిమాచల భారతీయ పురుజ్జీవ నోద్యమానికి, జాతీయోద్యమానికి ప్రాతినిధ్యం వహించిన 'త్రివేణి' పత్రిక సంపాదకులు కోవెలన్ను రామకోటీశ్వరరావుగారితో ఇంటర్వ్యూ నిర్వహించారు రామచంద్ర. కోలవెన్ను వారి జైలు జీవితానుభవాలు, త్రివేణి నిర్వహణలో వారి ఉదాత్త ఆశయాలు, జీవితంలో వారు అవలంబించిన సౌందర్యాత్మకత, గాఢమనస్విత, త్యాగమనస్కత 'మరపురాని మనీషి' శీర్షికలో వివరించారు రామచంద్ర.

గుంటూరు వెళ్ళి కవికోకిల జాషువాతో ఇంటర్వ్యూ చేశారు. సమాజంలో కరడుకట్టుకొని పోయిన ఛాందస భావాలు, సామాజిక అసమానతలు, కులసంకుచితత్త్వం, దాంభికతలు ఏవిధంగా అధిగమించి తన కవితా జైత్రయాత్రను సాగించిందీ జాషువా వివరించారు. జాషువ కవితలోని కామనీయతను, కరుణాకాతరత్వాన్ని, ఆయన ఇతివృత్తాలలోని భావశబలతను, విశ్వజనీనతను, ఉదారాశయాలను గొప్పగా రూపుకట్టించారు రామచంద్ర.

విజయవాడలో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిని ఇంటర్వ్యూ చేశారు. వారి కవితాశక్తి, అనితరసాధ్యమైన పాండిత్యం, భావనా పటిమ, విశిష్ట రీతిపథప్రవర్తకత్వం, అనేక ప్రక్రియలలో విశ్వనాథ అసాధారణప్రజ్ఞ, ఆధునిక సాహిత్యమూర్ధన్యత, విశ్వనాథ ప్రతిభ గూర్చి ఆయననే ప్రశ్నలు వేసి రాబట్టారు. మీ సర్వరచనలలో చిరకాలం నిలిచేది ఏది అని మీరనుకుంటున్నారు? అని ప్రశ్నించారు రామచంద్ర. సమస్త సాహిత్య శక్తులు, సకల భావనా సామగ్రి వినియోగించి రచించిన శ్రీమద్రామాయణ కల్పవృక్షం చిరకాలం తెలుగువారి

కుపాదేయమవుతుందని వారన్నారు. కాని 'మధ్యాక్కరలు' గొప్ప రచన అన్నారు రామచంద్ర. విశ్వనాథ తన నవలలను ఊహ తెలియంగల లేఖకులకు సద్యః స్ఫురణంగా చెప్పి రాయించడం విషయం కూడా ప్రస్తావించారు రామచంద్ర. విశ్వనాథ వారితో రామచంద్ర వంటి ప్రజ్ఞాసంపన్నుడు ఇంటర్వ్యూ చేయడంవల్ల భావితరాల వారికి మహోపకారమైంది. విశ్వనాథ సారస్వతమూర్తిని, కవితా హృదయాన్ని చక్కగా ఆవిష్కరించారు రామచంద్ర.

నెల్లూరు వెళ్ళి దీపాల పిచ్చయ్య శాస్త్రిగారిని ఇంటర్వ్యూ చేశారు రామచంద్ర. దీపాలవారు పద వాక్య ప్రమాణ పారీణ ప్రజ్ఞాశాలి. వేదంవారితోనే సాహిత్య పోరాటాలు నిర్వహించినవారు. చాటు పద్యాలు సేకరించినవారు. ఉత్తమ శ్రేణి కవిత్వం చెప్పినవారు. నిఘంటుజ్ఞుడు. సాహితీ సభలలో సమ్మోహకంగా ప్రసంగించ గలవాడు. జాషువాతో కలసి జంట కవిత్వం చెప్పాలని ఉబలాటపడినా జంటపేరు కుదరక, నామసామంజస్యం సంతనకాక విరమించుకున్నవాడు పిచ్చయ్యశాస్త్రిగారు. ఈ విషయాలన్నీ రామచంద్ర ప్రకాశితం చేయకపోతే ఎన్నో సంగతులు ఆధునిక తెలుగు సాహిత్యం కాలగర్భంలో కలసిపోయి ఉండేవి.

రాష్ట్రకవి, తెలుగునాట గాంధీజీ ఆస్థానకవి, జాతీయోద్యమ సాహిత్యస్ఫూర్తి ప్రదాత, తెలుగులెంక తుమ్మల సీతారామమూర్తి గారితో బాపట్ల దగ్గర అప్పికట్ల వెళ్ళి ఇంటర్వ్యూ నిర్వహించారు రామచంద్ర. ఆయన కవితానుభవాలు అక్షరీకరించారు. ఆయన పలుకుబడిలోని సొగసు భాష్యీకరించారు. పరిగపంట, రాష్ట్రగానము, ఆత్మకథ మొదలైన తుమ్మలవారి రచనల మేలిమిని, ఆయన హాలికతను, నిరాడంబరతను, మధురకవితాశైలిని ఈ ఇంటర్వ్యూ ద్వారా ఆవిష్కరించారు రామచంద్ర.

ఆధునిక తెలుగు కవితలో తనదైన విశిష్టమైన ముద్రను, విలక్షణరీతిని ప్రస్ఫుటం చేసిన నాయని సుబ్బారావు గారిని తర్వాత ఇంటర్వ్యూ చేశారు రామచంద్ర. భావకవిత్వంలో నాయని వారి స్థానం ఏమిటో, కులపాలిక ప్రణయం తాత్త్వికత ఏమిటో, నాయనివారి పదబంధాలలో గీతిమార్దవ పుష్కలత ఏమిటో వివరించారు రామచంద్ర. వేయిపడగల నవలలో కిరీటి ప్రణయయాత్రే సౌభద్రుని ప్రణయ

యాత్రగా రూపొందిన వైనం ఈ ఇంటర్వ్యూ ద్వారా అనుసంధానించారు రామచంద్ర. నాయనివారి కవిత్వంలోని ఆర్ద్రభావ సౌకుమార్యాన్ని, దాంపత్య ప్రణయ శృంగార శుచిరుజ్జ్వలతను, నాయని వారి ఆత్మీయతను ఆవిష్కరించారు.

బాపట్ల వెళ్ళి కనుపర్తి వరలక్ష్మమ్మగారిని ఇంటర్వ్యూ చేశారు. జాతీయోద్యమ కాలంలో ఆమె కస్తూరిబా బాలికా పాఠశాల నిర్వహించారు. మహిళలలో సామాజిక చైతన్యం కోసం ప్రబోధించారు. కథలు రాశారు. ఆమె రాసిన శారద లేఖలు ప్రసిద్ధి పొందాయి. ఆనాటి నిర్మాణాత్మక కృషినామె వివరించారు. అట్లానే హైదరాబాదులో ఇల్లిందల సరస్వతీదేవి గారిని రామచంద్ర ఇంటర్వ్యూ చేశారు. స్వాతంత్ర్యం రాకముందు హైదరాబాదు సంస్థానంలో మహిళల స్థితిగతులామె వివరించారు. స్వయంకృషితో ఆమె ఉన్నత విద్య నేర్చి రచయిత్రి అయినారు. ఆనాటి ఉన్నత, మధ్య తరగతి వర్గాల సామాజిక జీవితం, స్త్రీ చైతన్యం కోసం హైదరాబాదులో జరిగిన కృషి, తన రచనా వ్యాసంగంలో లభించిన ప్రోత్సాహం గూర్చి ఆమె చెప్పారు. స్వాతంత్ర్యం రాకపూర్వం హైదరాబాదు సాంఘిక వాతావరణంతో పరిచయం ఉన్న రామచంద్ర ఆమె సామాజిక నేపథ్యాన్ని హృద్యంగా యీ ఇంటర్వ్యూ ద్వారా వివరించారు.

కవులను, పండితులనేకాక అద్దంకి శ్రీరామమూర్తి, పులిపాక వెంకటేశ్వర్లు, బందా కనకలింగేశ్వరరావు వంటి ఆనాటి ప్రసిద్ధ రంగస్థల మూర్తిమంతులను, మాడపాటి హనుమంతరావుగారి వంటి వెనుకటి తరం ఆంధ్రమహాసభ జాతీయోద్యమ నాయకులను రామచంద్ర ఇంటర్వ్యూ చేశారు. ఈ ఇంటర్వ్యూల ద్వారా ఆధునిక ఆంధ్రదేశ నాటక వికాస చరిత్రను రచించారు. తిరుపతిలో రాళ్ళపల్లి వారితో ఇంటర్వ్యూ కూడా ఈ శీర్షికకే.

ఈ మరపురాని మనీషి శీర్షిక ఆ రోజుల్లో అంటే 40 సం.ల కిందట చాలా ప్రాచుర్యం సంపాదించుకొంది. ప్రతి ప్రముఖ వ్యక్తి తాలూకు అంతస్సత్వ ప్రతిఫలన ఛాయాచిత్రాలు, వివిధ భంగిమలవి ఏడెనిమిదిదాక ఈ ఇంటర్వ్యూకి సంబంధించినవి ఈ శీర్షికలో ప్రచురించడం విశేషం.

ఇటువంటిదే ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో 'తెలుగువెలుగులు' అనే

శీర్షికను రామచంద్ర నిర్వహించారు. అయితే 'మరపురాని మనీషి' శీర్షికకన్నా ఆంధ్రపత్రిక శీర్షిక పరిధి చిన్నది. ఆంధ్రపత్రికలో కేవలం రేఖాచిత్రాల వంటి వ్యక్తిత్వ నిరూపణ చిత్రణ చేశారు. కొంతవరకు కార్టూన్ చిత్రణ స్వభావం కూడా 'తెలుగు వెలుగులు' శీర్షికలో కనపడుతుంది. కొంత చమత్కారయుతంగా ఆయా ప్రముఖ వ్యక్తుల జీవన సాఫల్య ఆశయ నిర్వహణ, ఆకర్షణ వికర్షణ పరిణామాలు ఈశీర్షిక నిర్వహించింది. ఈ శీర్షికలో వచ్చిన సంఖ్య 100 మించి కనపడుతున్నది. అయితే అన్నీ రామచంద్ర రాసినవి కావు. సంపాదక వర్గంలోని ఇతరులు కూడా కొందరి ప్రముఖులు గూర్చి ఈ శీర్షికకు రాసినట్లుగా కనపడుతుంది. ఆచార్య రంగావంటి రాజకీయ ప్రముఖులను గూర్చి ఇంకొందరి గూర్చి శివలెంక శంభుప్రసాద్‌గారే ఈ శీర్షికలో రాశారన్నమాట వినపడుతుంది.

రామచంద్ర ఈ శీర్షికలో కలం కుంచెతో చిత్రించిన ప్రముఖులు వీరు.

**1. శ్రీ అంనతకృష్ణశర్మ; 2. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి; 3. శ్రీ నాయని సుబ్బారావు; 4. శ్రీ కాశీకృష్ణాచార్యులు; 5. శ్రీ కొండా వేంకటరంగారెడ్డి; 6. శ్రీ మందుముల నరసింగరావు; 7. శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య; 8. శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్; 9. శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు; 10. శ్రీ రాయప్రోలు సుబ్బారావు; 11. శ్రీ కల్లూరు సుబ్బారావు; 12. శ్రీ దాశరథి; 13. శ్రీ వేముల కూర్మయ్య; 14. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు; 15. శ్రీ రాజమన్నారు; 16. శ్రీ నిడదవోలు వేంకటరావు; 17. శ్రీ డి. రామానుజరావు; 18. శ్రీ సి.నారాయణ రెడ్డి; 19. శ్రీ బూర్గుల రామకృష్ణరావు; 20. శ్రీ ఆచంట లక్ష్మీపతి; 21. శ్రీ గుడిపాటి వెంకటచలం; 22. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ; 23. శ్రీ వరదా వెంకటరత్నం; 24. శ్రీ అనంతశయనం అయ్యంగార్; 25. శ్రీ మాడపాటి హనుమంతరావు.**

మహత్వపూర్ణమైన యీ లేఖినీ చిత్రాలు కాలక్రమానుసార వయోనిరూపకంగా ఆయన తలపెట్టలేదు. సమాచారం తనకు చేకూరే దానినిబట్టి వెంట వెంట రాసినట్లున్నది. ఇందులో మూడు నాలుగు శీర్షిక వ్యక్తుల గురించి ఆ తర్వాత నిర్వహించిన 'మరపురాని మనీషి' శీర్షికలో కూడా వీరు మళ్ళీ కొంత విపులంగా

రాశారు. రామచంద్ర శైలి, విషయ విన్యాసం తెలియటానికి కొన్ని ఉదాహరణలు చూడవచ్చు.

**1. రాళ్ళపల్లి:** పండబారుతున్న పసిడిమై తీగ. పట్టు పీతాంబరం, ఉజ్జ్వలమైన ఊర్ధ్వత్రిపుండ్రాలు. అనుష్ఠానతత్పరతతో శేషించిన ఆనందచ్ఛాయలు. ఈ మాత్రపు మాటలతో ఆయనను చూడని వారికి ఆయన ఎవరో ఊహకు రాకపోవచ్చు.

**2. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి:** అచ్చమైన తెనుగుదనం తొణికిసలాడే ముచ్చటైన పలుకుబడి, విజాతీయ వాసనా సంస్కారధోరణికి దూరమై సజాతీయతను సంతన కట్టుకున్న పాత్రలు, గోదావరీ ప్రవాహోదారంగా సాగిపోయే శిష్టవ్యావహారిక విశిష్టశైలి, అక్షరాక్షరాన గుబాళించే ఆంధ్ర సంస్కృత పాండితీ పరిమళం శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

**3. పుచ్చలపల్లి సుందరయ్య:** ఏమైనా ఎంతైనా ఆయన అలనాటి కర్ణుణ్ణి తలపింపజేస్తాడు. కర్ణుడూ పాండవేయుడే. పరశురామునంతటి ఆచార్యునివద్ద అస్త్రశస్త్రాలు అభ్యసించినవాడే. త్యాగాది గుణసంపదగలవాడే. అయితే ఏం? పరప్రత్యయనేయబుద్ధి; పెడదారి పట్టినవాడు. కమ్యూనిస్టులు అలాటివారు; వారి నాయకుడు సుందరయ్య అలాటివాడే (ఇవి సుందరయ్య మూర్తిచిత్రణలో ఎత్తుగడ వాక్యాలు కావు, ఉపసంహార వాక్యాలు. 1960 సం. నాటివి)

**4. శ్రీ శ్రీ:** ఏమైతే ఏం! జనం తన ఆశావేశా వేదనలను శ్రీశ్రీ బలమైన భాషలో పలికించే సరికి ఇతనిని తన కవిగా, మహాకవిగా మన్నన చేసింది. దీనికి కారణం ఇతనిలోని సర్వజన ప్రియమైన శక్తి. "అనర్గళం, అనితరసాధ్యం నా మార్గం అన్నాడు ఈయనే". ఎంత తీవ్ర ప్రతిపక్షి అయినా ప్రశంసించే సంవిధాన చాతుర్యం, వైవిధ్యం ఈయన స్వార్జితాలు (రామచంద్ర శ్రీశ్రీ గురించి రాసిన రచన మధ్య పేరా).

**5. పుట్టపర్తి:** అపురూపమైన ప్రతిభ, దానికి మించిన బహుభాషాపాండితి, పాండితికి తగిన బహుముఖ వ్యుత్పత్తి, వ్యుత్పత్తికి తగినధారణ, ధారణను సార్థకం చేసే నిరర్గళ వాగ్ధాటి, వాగ్ధాటిని పొంకంగా కుదిరించే సుందర వచన రచనాచాతురి. ఇన్ని ఉన్నా సులభంగా ఆవేశపడి స్పందించే హృదయంవల్ల

చిత్ర విచిత్ర పరిస్థితులలో పడి, సాహిత్యంలో అడ్డాదిడ్డిగా దారులు తొక్కారు ఈయన (మధ్య పేరా).

**6. ఆచంట లక్ష్మీపతి:** తొంభైఏళ్ళు తోసుకవస్తున్నా తొణకని దేహపాటవంతో పయిలాపచ్చీస్ పరువంతో నవనవలాడుతుంటారు శ్రీ ఆచంట లక్ష్మీపతి. అందుకే అయినవాళ్ళు ఆయనను ఆ చంటి లక్ష్మీపతి అంటారు. కానివాళ్ళు ఆ చండి లక్ష్మీపతి అంటారు. ఆయన జీవితం 'మహాలక్ష్మీ విలాసరస'మయం. సిద్ధమకరధ్వజం.

**7. గుడిపాటి వెంకటచలం:** "నేనెట్లా మరువను నిన్ను? పువ్వుల వెనుక నుంచి నీ నవ్వులు, మబ్బుల వెనుక నుంచి నీ దోబూచులు, నా కళ్ళల్లో నీ నీడలు, నా సుఖాలలో నీ స్పర్శలు, నా నిద్దట్లో నీ రహస్యాలు, ఎట్లా మరువను నిన్ను? "నేనే నువ్వు, నిన్నెట్లా విడుస్తాను? హృదయంలోనే కట్టేసుకున్నావుగా, ఎట్లా వెడతాను?' అంటే నమ్మాను నీ దొంగమాటలు. ఎక్కడ ఉన్నావు? 'నా మల్లే మోసపోయిన నిర్భాగ్యులందరూ - వాళ్ళ ఏడుపులోంచి నవ్వుతున్నారు నన్నుచూచి .... ఎవరిది తప్పు భగవాన్, నువ్వు చెప్పుపోనీ....." ఇవేవో వీరమాహేశ్వరుల సారతరభక్తి వచనాలనో, తాళ్ళపాక వారి విన్నపాలనో, రవీంద్ర కవీంద్రుని సూఫీ సిద్ధాంతతుందిలాలైన గీతామృతాంజలులనో భ్రమపడతారు కదూ! కాదు శ్రీ గుడిపాటి వెంకటచలంగారు 'భగవాన్ రమణ మహర్షిని సంబోధిస్తూ చేసిన విన్నపాలు" (చలం గూర్చిన ఎత్తుగడ).

**8. సి. నారాయణరెడ్డి:** "ఈయన వస్తువుకు లోతులు మరింత సంతరించి, ఉరుకులు తీసే ఊహలను ముకుదాడుపట్టి మురిపెంగా నడిపించి, భావాలకు వ్యాఘాతాలు దొర్లకుండా చూసుకొని పాత్రలపై వెలుగు నీడలు ప్రసారింపజేసే కవులలో పెద్దపీట వేసుకొని తన జనప్రియత్వాన్ని సుస్థిరం చేసుకుంటాడు (ముగింపు వాక్యాలివి - రచనాకాలం 1961).

**9. నిడుదవోలు వెంకటరావు:** ప్రతి పదానికీ ప్రయోగం చూపి, ప్రామాణికమయిన గొప్ప నిఘంటువును అదిన్నీ 'అనుకూల సాధన సహాయ సంపత్తి లభించిన, పదునైదు వందలు లేక రెండువేల పుటలతో "రచించి ఆంధ్ర

మహాజనులకు అందజేయగలనని ఈయన ప్రతిజ్ఞ. అలాంటి ప్రతిజ్ఞను ఈ పరిశోధన పరమేశ్వరుడు నెరవేర్చుకోగలడనడం నిస్సంశయం' (ముగింపు వాక్యాలు - ప్రచురణ 1961).

**10. దాశరథి:** ఈయన శబ్దశక్తి ఎరిగి, అది హృదయాన్ని కరిగిస్తుందనీ, కవితకు ప్రయోజనం అవసరమేకాని, సౌందర్యానికి భంగం కలగరాదని నమ్మినవాడూ, వ్యక్తిత్వం, మౌలికత వెల్లివిరిసినవాడు గనుక ఏదో లక్ష్యంతో సౌమ్యంగా రచన సాగిస్తే ఇంకా ఎన్నో అనర్ఘమణులను ఆంధ్రావళికి అందివ్వగలరు (ముగింపు వాక్యాలు).

**11. మల్లంపల్లి:** ఆంధ్రుల ప్రాచీన చరిత్రకు ప్రాణం పోసిన మహా పరిశోధకులలో ఒకరు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

రామచంద్ర రచించిన 'తెలుగు వెలుగుల' రేఖా లేఖినీ చిత్రాలు ఈ ప్రక్రియలో దానికదేసాటి. అంతా అంత బంగారం. 'మరపురాని మనీషి', 'తెలుగు వెలుగులు' వంటి అపూర్వ అద్భుత శబ్దచిత్రాలు లిఖించిన రామచంద్ర కూడా ఆ శీర్షికలలో చేరడానికి ముమ్మాటికే కాదు నూటికి నూటిపాళ్ళూ అర్హుడు.





## 20. హంపీ నుంచి హరప్పాదాక .....

**20**వ శతాబ్ది తెలుగు సాహిత్యంలో 200 దాకా స్వీయ చరిత్ర అనండి, ఆత్మకథ అనండి, జ్ఞాపకాలు, అనుభవాలనండి, స్మృతులనండి, ఈ ప్రక్రియా సంబంధి రచనలు వచ్చాయి. తెలుగులో స్వీయచరిత్ర ప్రక్రియ 20వ శతాబ్దంలో ఆవిర్భవించిందే. వీరేశలింగమే దానిని ప్రారంభించాడు.

వీరేశలింగం స్వీయచరిత్ర పూర్తిగా వెలువడే నాటికి రామచంద్ర వయసు 2 సం.లు. ఆయన ఇంకా రాఘవంపల్లి నుంచి కమలాపురం చేరలేదు.

ఇరవయ్యో శతాబ్దిలో వివిధ రంగాలలో తమ స్వీయ ప్రజ్ఞను సముజ్జ్వలితం చేసిన పెద్దల స్వీయ చరిత్రలు సమీక్షిస్తే, పరిశీలిస్తే, అధ్యయనంచేస్తే సమగ్రమైన ఈ శతాబ్ది తెలుగువారి సాంఘిక చరిత్ర, సామాజికోద్యమాలు, స్వాతంత్ర్యోద్యమ త్యాగనిరతి నిరూపితమవుతాయి.

20వ శతాబ్ది తెలుగులో వచ్చిన ఇంచుమించు 200 స్వీయ చరిత్రలలోనూ రామచంద్ర స్వీయచరిత్ర విలక్షణమైనది. విశిష్టమైనది. వీరేశలింగం, అజ్జాడ, శ్రీపాద, చిలకమర్తి, రాయసం, ప్రకాశం, కె.ఎన్.కేసరి, దరిసి చెంచయ్య, కొండా వెంకటప్పయ్య, మామిడిపూడి వేంకటరంగయ్యలు, రామచంద్రకన్న సమాజ జీవితంలో విశ్రుతులే. తమ తమ రంగాలలో విశిష్ట వ్యక్తులే. అయినా రామచంద్ర చూసినంత విశాల భారతదేశం వారు చూడలేదు. ఈయన గడపినంత వైవిధ్య

భరిత జీవితం వారు గడపలేదు. ఈయన కలుసుకున్నంత మంది వివిధ భాషా సాహిత్య పండితులను వారు కలుసుకోలేదు. రామచంద్ర తన జీవిత గాథ చెప్పినంత రమణీయంగా వారు చెప్పలేదు. రామచంద్ర రచనలో కన్పించే అందమైన శైలి, ఆత్మదఘ్నత, తాదాత్మ్యం తక్కిన వారి స్వీయచరిత్రలలో దేనిలోనూ కన్పించవు.

రామచంద్ర యీ రచనలో ఆయన ముప్ఫై సంవత్సరాల వయసు వరకు సంభవించిన జీవిత సంఘటనలే చోటుచేసుకున్నాయి. స్వీయ జీవితోదంతాలలో మూడోవంతు మాత్రమే చెప్పగలిగానని ఆయనే ప్రస్తావించాడు. ఈ పుస్తకం పూర్తిచేసిన వారెవరైనా ఆయన తన తర్వాత జీవిత ఘటనలు రాసి ఉంటే ఎంత బావుండేది? అనీ అది తీరే అవకాశం లేదనీ అసంతృప్త ఉత్సుకతకు లోనవుతారు. కనీసం ఆయన 60 సంవత్సరాల వరకు జీవిత సన్నివేశాలైనా రాసి ఉంటే బావుండేది. అదంతా ఆయన పత్రికలలో పనిచేసినకాలం. ఈ స్వీయచరిత్ర రచన భారతదేశం కొత్తగా స్వాతంత్ర్యం పొందిన కాలం. అంటే 1946, 47లతో ఆయన ఈ స్వీయ జీవిత వృత్తాంతం ఆగిపోయింది. అంటే ఆయన కప్పటికి ముప్ఫై మూడు, ముప్ఫై నాలుగు సంవత్సరాల వయసు.

ఆయన ఆంధ్రప్రభలో చేరిన తర్వాత ఆంధ్రరాష్ట్రం, ఆంధ్రప్రదేశ్‌లు ఏర్పడ్డాయి. ఆంధ్రపత్రికలో చేరిన తర్వాత చైనా దురాక్రమణం, పాకిస్తాన్‌తో యుద్ధాలు సంభవించాయి. ఆ తర్వాత దేశంలో సాధారణ ఎన్నికలు పదిసార్లదాకా జరిగాయి. రాష్ట్రాలలో, కేంద్రంలో కొత్త కొత్త రాజకీయ సమీకరణలు రూపొందాయి. తన పరిణతమైన చింతనతో, విజ్ఞతతో, పత్రికోద్యోగానుభవంతో దేశ సామాజిక, రాజకీయ, విద్యా, వైజ్ఞానిక పరిణామాలను రామచంద్ర విశ్లేషించి చెప్పగలిగి ఉండేవారు స్వీయచరిత్రలో తరువాత ఘట్టాలు రాసి ఉంటే.

రామచంద్ర స్వీయ చరిత్రకు 'హంపీ నుంచి హరప్పా దాకా' అని పేరుపెట్టడంలో ఒక భావుకత ఉంది. శతాబ్దాల, సహస్రాబ్దాల భారతీయ జన జీవిత చరిత్రపట్ల తనకు ప్రగాఢమైన ఆసక్తి అని ఈ పేరు ద్వారా ఆయన చెప్పదలచుకున్నాడు. ఈ గ్రంథం చదివినవారికిది నిరూపితమవుతుంది. కావడానికి ఈ గ్రంథం రామచంద్ర ముప్ఫైమూడు, నాలుగేళ్ళ జీవిత సన్నివేశ సమాహారంగా మాత్రమే

ఉద్దేశితమైనప్పటికీ ప్రసక్తానుప్రసక్తంగా ఆయన భారతదేశ పురాసంస్కృతి, చరిత్ర, నాగరకతలను గూర్చి కూడా చెప్పారు.

ఐదువందల ఏళ్ళ కిందటి విజయనగర సామ్రాజ్యచరిత్ర, ఐదువేల ఏళ్ళనాటి మొహంజొదొడో - హరప్పా నాగరకతల గూర్చి ఎంతో ఆసక్తి కలిగేట్లు చెప్పారు. కాబట్టి ఐదువేల ఏళ్ళ భారతదేశ చరిత్ర అనుభూతమవుతుంది ఈ గ్రంథం చదవడంవల్ల. రామచంద్ర సంస్కృత విద్వాంసులు కాబట్టి, గొప్ప భావుకులు కాబట్టి వేదోపనిషద భారతీయ సంస్కృతిపట్ల అభిమానంకల వారు కాబట్టి, మేధావికాబట్టి ఈ 61 అధ్యాయాల స్వీయ చరిత్రలో సుమారు 150 శ్లోకాలు దాహరించారు. ఈ శ్లోకాలన్నీ మానవజీవిత పరమార్థం, ఆదర్శం, కుటుంబ సంస్కారం, విద్య, వివేకం, సచ్ఛీలం, సజ్జనమైత్రి, మానవత్వపు సౌదర్య సౌందర్య బంధాలు, ధనేషణ, ప్రాపంచిక కామనలు, పరోపకారం, దయా, దాక్షిణ్యం, దానం, ధర్మం మొదలైన ప్రధానేతివృత్త ఉదంతాలకు వ్యాఖ్యాప్రాయంగా ఒకసారి నేపథ్య సంగీతంగా, ఒకసారి ఆలోచనామృతంగా హృద్యంగా పొందికగా కుదిరాయి.

నన్నయ్యగారు భారతం గూర్చి ఏమని ప్రశంసించారు? ధర్మతత్త్వజ్ఞులు, ధర్మశాస్త్రంబని, వేదాంత విదులు వేదాంతమనియు, నీతితత్త్వజ్ఞులు నీతిశాస్త్రంబని, కవివృషభులు మహాకావ్యమని సంభావిస్తారు భారతాన్ని అనలేదా? అదే విధంగా రామచంద్ర స్వీయచరిత్ర కొన్ని కథల సంపుటి, గొప్ప నవల, సమాజశాస్త్రం, సాంఘిక చరిత్ర, వచనకావ్యం, నిన్నటి ఇతిహాసంగా భావించాలి.

రామచంద్రకు తన భాషపట్ల, సాహిత్యంపట్ల, సంస్కృతిపట్ల, సంప్రదాయంపట్ల మహారాజుల పరాక్రమ ఔదార్యగుణాలపట్ల, కవి పండితుల మహా ప్రజ్ఞ, ప్రతిభలపట్ల ఎంతో మక్కువ. అది ఆయన వ్యక్తావ్యక్త చేతనలో ఎప్పుడూ ప్రబుద్ధంగానే ఉంటుంది. 1960 జూన్ నెల భారతిలో ఆయన 'నా కలలు' అని ఒక రచన చేశారు. అనాది మానవుడి నుంచి ఆధునిక మానవుడిదాకా కళలూ, సాహిత్యం, నాగరకత ఏ విధంగా మానవుడు పెంపొందించుకున్నాడో ఆయన వివరించారు. 'సాహిత్యం సమకాలీన ప్రజాజీవితానికి ప్రతిబింబమూ, భావికాలీన

లక్ష్యానికి ఆదర్శమూ అవుతుంది. మహాకవి ప్రజలమధ్యనే మసలుతూ వారికంటె ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ వారిని నవనవోషస్సును తిలకింపజేస్తాడు, తను విశ్వశ్రేయమని విశ్వసించిన దానిని జంకుగొంకులు లేక గంటవలె కంగున మ్రోయించి వినిపిస్తాడు. అట్టి కవికి వాస్తవమైన స్మారక చిహ్నం అతని కవితల వ్యాప్తే అయినా మానవుని 'వీరపూజాసక్తి' 'శాశ్వత్యానురక్తి మిన్నకుండవు' అని చెబుతూ కాళిదాసుకూ, కంబకవికీ స్మరణ చిహ్నాలు నిర్మించడం మరెందుకు? అంటారు.

అదేవిధంగా 'నన్నయకు గోదావరీ తీరాన, పాల్కురికి సోమనాథుడికి పాల్కురికిలో, కవిబ్రహ్మ తిక్కనకు పెన్నానది గట్టునా, బమ్మెర పోతనకు బమ్మెరలో, శ్రీనాథుడికి కృష్ణాతీరంలో, అన్నమయ్యకు తిరుపతిలో, కృష్ణరాయలకు పెనుగొండలో భవ్యదివ్యస్మారక హర్మ్యాలు నిర్మించాలి' అని నేను కలలు కంటూ ఉంటాను అన్నారు రామచంద్ర. దీనివల్ల తరతరాల వారు, వారికి సంబంధించిన వారు ఉత్తేజితులవుతారని రామచంద్ర విశ్వాసం.

పత్రికలలో ఆయన రచన అచ్చుకావడం ప్రారంభం అయింది 1935లో. ఆయన చివరి రచన వచ్చింది 1997లో. ఈ విధంగా రామచంద్ర 62. సం.లు రచనా వ్యాసంగంలో నిమగ్నులైనారు.

ఆయన అన్ని రచనలలోనూ మిన్న అయినది ఆయన స్వీయ చరిత్రలో ఏకదేశమైన 'హంపీ నుంచి హరప్పాదాక' గ్రంథమే. అదే ఆయన చివరి గ్రంథం. అయితే దురదృష్టవశాత్తూ ఈ రచన పుస్తక రూపంలో రావడం ఆయన చూడలేదు. ఆయన జ్ఞాపకశక్తి అపారం. తన మూడేళ్ళ వయసు నుంచి జరిగిన సంఘటనలు, సన్నివేశాలు ఆయనకు జ్ఞాపకం. ఈ విధంగా జీవితంలో 80 సం.ల వయసున కూడా చిన్ననాటి సంఘటనలన్నీ జ్ఞాపకం ఉండటం అబ్బురం. అవి నిన్న జరిగినంత స్పష్టంగా ఆయన రాశారు. ఆ సంఘటనలలో ప్రసక్తమైన సంభాషణలు, మాటలు కూడా ఆయనకు గుర్తే.

ఈ గ్రంథం రచనను గూర్చీ, ఇది పొందే ప్రాచుర్యం గురించీ ఆయనే ఇట్లా భావించారు. "రామచంద్ర విచిత్ర వ్యక్తి, వైరుధ్యాల పుట్ట, వైపరీత్యాల మెట్ట.

పాదరసాన్ని పరిహసించే పరుగు; మెరుపును మించిన చాంచల్యం.

ఇంతటి వైరుధ్యాల వైవిధ్యంలో, వైపరీత్యాల వైరూప్యంలో రచయిత కనిపిస్తాడు. విమర్శకుడు తొంగిచూస్తాడు. భాషావేత్త భాసిస్తాడు. ప్రతిదాని పుట్టుపూర్వాలు పరిశీలించే పరిశోధకుడు పలుకరిస్తాడు. కనిపించిన దాన్నంతా కలంతో కబళిద్దామనే భావుకుడు గోచరిస్తాడు. తెలిసిన దాన్నంతా చెప్పాలనే భావుకుడు గోచరిస్తాడు. తెలిసిన దాన్ని తేటమాటలతో అందించే పత్రికా రచయిత తారట్లాడుతాడు. ఉపనిషత్కాలపు స్వర్ణయుగం అవతరించాలనే దురాశాపరుడు ప్రత్యక్షమవుతాడు" అంటూ ఈ గ్రంథాన్ని మమత్వంతో ప్రశస్త ప్రసక్తం చేశాడు రామచంద్ర.

'ఇదొక దేశద్రిమ్మరి అనుభవ విశేషంగా, సత్యాన్వేషి కథనంగా, జిజ్ఞాసువు ఆవేదనగా పాఠకుల మనసుకు దగ్గరవుతుందని నా విశ్వాసం' అని ఆశించారు రామచంద్ర. రెండు సంవత్సరాలలో రెండు ముద్రణలు పాఠకులు ఆదరించారు. మూడవ ముద్రణ కూడా వచ్చింది. అందువల్ల ఆయన ఆశించింది నెరవేరింది.

ఇంకొక విశేషం. ఆధునిక తెలుగు సాహిత్యంలో రామచంద్ర సుమారు నూరు మందికిపైగా కవి పండితులతో, కళాకారులతో సన్నిహిత పరిచయాలున్నవాడు. రాజకీయ ప్రముఖులతో, దేశభక్తులతో, స్వాతంత్ర్యోద్యమ నాయకులతో ఆయనకు దగ్గరి పరిచయమూ ఉన్నది. యువ రచయితలతో కూడా ఆయన నెరపిన సాన్నిహిత్యం తక్కిన కవి పండితుల విషయంలో అరుదనే చెప్పాలి. దీనికి కారణం ఆయన తెలుగునాట అర్ధశతాబ్ది వివిధ పత్రికలలో పనిచేయడమే.

ఇరవయ్యో శతాబ్ది రచయితకు అద్వైతం నుంచి అణుస్ఫోటనం వరకు తెలిసి ఉండటం అవసరమన్నాడు ఆర్థర్ కోస్లర్ అనే గొప్ప తాత్త్విక సాహిత్యవేత్త.

దీనికి ప్రథమోదాహరణమే కాక ప్రకృష్టోదాహరణం కూడా రామచంద్ర.

ఆయన రచించిన 'హంపి నుంచి హరప్పాదాక' ఇందుకు గొప్ప తార్కాణం



# అనుబంధం

**తిరుమలరామచంద్ర జీవితంలో కొన్ని ముఖ్య ఘట్టాలు**

**జననం :** 1913 జూన్ 17వ తేదీ (ప్రమాదీచ నామ సం. జ్యేష్ఠశుద్ధ చతుర్దశి, మంగళవారం)

**తల్లి దండ్రులు :** జానకమ్మ, శేషాచార్యులు

**జననస్థలం :** రాఘవంపల్లి (అనంతపురం జిల్లా)

**ప్రాథమిక విద్య :** కమలాపురం, ఆనెగొంది (బళ్ళారిజిల్లా)

**సంస్కృత విద్యార్జన :** తిరుపతి కళాశాలలో వ్యాకరణ, సాహిత్య శిరోమణి పరీక్షల నిమిత్తం ఏడేళ్ళు చదివారు.

**జాతీయోద్యమప్రవేశం :** బళ్ళారిలో 8 సం.ల వయసుననే గాంధీజీని దర్శించారు. పినతండ్రి గారితో 10 ఏళ్ళ వయస్సు ననే కాకినాడ కాంగ్రెసుకు (1923) వెళ్ళారు. 1929-30 సం.లలో చిత్తూరు జిల్లా అంతా కాంగ్రెస్ ఉద్యమ ప్రచారం చేశారు. 14 సం.ల వయసుననే తిరుపతి పట్టణ కాంగ్రెస్ కార్యదర్శి అయినారు.

**కారాగార శిక్ష :** 1932లో తిరుచిరాపల్లిలో ఒక సం. కారాగార వాసశిక్ష అనుభవించారు. తరువాత మళ్ళీ చదువు. 1933లో నెల్లూరు సంస్కృతకళాశాలలో చదివారు.

**మద్రాసు కుట్రకేసు :** 1934-36లలో మద్రాసులో కుట్రకేసులో విచారణకు గురిఅయినారు.

**మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో కాపీయిస్టు ఉద్యోగం** : 1934-37 చివరి ఈ సంవత్సరమే మద్రాసు విశ్వవిద్యాలయంనుంచి సంస్కృతం తెలుగులలో విద్వాన్ పరీక్ష పాసైనారు.

**తంజావూర్ సరస్వతీమహల్‌లోపని** : 1937-38

**వివాహం** : 1939 మే 7, సురపురం (రాయచూరు జిల్లా, గుల్బర్గా సమీపం) ఇల్లాలు శ్రీమతి అనంతలక్ష్మి;

**సంతానం:** డా. నీరజ, డా. ఆముక్తమాల్యద, డా. శేషశాయి. డా. నీరజ ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలోనూ, ఆముక్తమాల్యద చెన్నైలో ఇండియన్ బ్యాంకులోనూ, డా. శేషశాయి తిరుచినాపల్లి నేషనల్ కాలేజిలో తత్త్వశాస్త్రాచార్యుడిగానూ పనిచేస్తున్నారు.

**లాహోర్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో ఉద్యోగం** : 1938-40: వెయ్యిదాక తాళపత్ర **గ్రంథాల సూచీకరణం.**

**సైన్యంలో హవల్దార్‌క్లర్క్ ఉద్యోగం** : 1940-1943 బెలూచిస్తాన్ క్వెట్టా, చమన్‌లలో సైనిక పటాలాలతో.

**పత్రికారంగం** : 1944లో కాన్పూరులో 'డెయిలీ టెలిగ్రాఫ్' పత్రికలో 3నెలలు; హైదరాబాద్‌లో మీజాన్ పత్రికలో 1944-47; ఆంధ్రప్రభ 1947-1959; ఆంధ్రపత్రిక 1960-1971; ఆంధ్రభూమి 1975 - 79.

**సన్మానాలు** : మహామహోపాధ్యాయ(కాశీపండిత పరిషత్) ;ప్రపంచ తెలుగుసభలు (హైదరాబాద్, కౌలాలంపూర్); పత్రకారశిరోమణి (కలకత్తా ఉదంత మార్తాండ) పరమపదం : అక్టోబర్ 12, 1997.

**రచనలు** : మనలిపి - పుట్టుపూర్వోత్తరాలు, గాథసప్తశతిలో తెలుగుపదాలు, హిందువుల పండగలు పర్వాలు, నుడి-నానుడి, తెలుగు పత్రికల సాహిత్య సేవ, క్షేమేంద్రుని అవదానకల్పలత, బృహత్కథామంజరి, ;పురాతన బౌద్ధ ఇతిహాసం లలితవిస్తరం (అనువాదాలు); నాగలాపురం - దాని పరిసరాలు; ప్రాకృత వాఙ్మయంలో రామకథ;మూడు వాఙ్మయ శిఖరాలు, బృహదారణ్యకం, మనవి మాటలు, అహంభో అభివాదయే - వ్యాస సంపుటాలు మొదలైనవి.



Nature has not blended mind so inextricably with body as to prevent it from establishing its own frontiers and controlling its own domain. It is perfectly possible to be godlike, eventhough unrecognized as such. Always keep that in mind; also remember that the needs of a happy life are very few. Mastery of dialectics or physics may have eluded you, but that is no reason to despair of achieving freedom, self respect, unselfishness, and obedience to the will of God.

Live out your days in untroubled serenity, refusing to be coerced though the whole world deafen you with its demands, and though wild beasts rend piecemeal this poor envelope of clay. In all that, nothing can prevent the mind from possessing itself in peace, from correctly assessing the event around it, and from making prompt use of the material thus offered; so that Judgement may say to the event, "this is what you are in essence, no matter how rumour paints you".

**From 'MEDITATIONS'**

**of MARCUS AURELIUS**

**(Roman Emperor of B.C. 1st Century)**



# శ్రీ తిరుమల రామచంద్ర

(1913 - 1997)

"పరులకు ఉపకారం చేసిన బ్రతుకే బ్రతుక నేవారు. ఎవరికైనా సరే ఏ చిన్న సాయమైనా చేస్తే దానివల్ల కలిగే ఆనందాన్ని గురించి తరచూ చెబుతుండేవారు. అలా ఒకరికి ఇవ్వటం 'వన్ వే ట్రాఫిక్' కాదా? అని ప్రశ్నిస్తే, ఎన్నటికీ కాదనేవారు. ఆయన మాటల్లోనే, "ఒకరికి ఉపకారం చేయటం మంచిపని. మానసికసంతోషానికి దారి. కానీ ఎప్పుడూ కూడా ఎవరి నుంచీ ఏదీ ఆశించవద్దు. అలా ఆశించటంవల్లనే కదా నిరాశ కలిగేది? దానివల్లే కదా అసంతృప్తి పెరిగేది? అందువల్ల చేయటం నీ వంతు. ఫలితాన్ని ఆశించకు. దానికి ఫలితం నీకు ఇంకెక్కడో మరెవరి ద్వారానో కలుగుతుంది. కానీ అలా కలుగుతుందని కూడా ఆశించవద్దు. 'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' అనేది గుర్తుంచుకోవాలి.నిరాశ కలిగించుకునేది మనమే. దాన్ని కలుగనీయకుండా చేసుకునే నేర్పును సంపాదించాలి." ఇటువంటి ఉదాత్తస్వభావం గల వ్యక్తి మా తండ్రిగారు కావడం మా అదృష్టం కాదా? ఎన్నో జన్మల సుకృతం కాదా?"

**- డా. తిరుమల నీరజ**



"తెలుగు సాహిత్య పరులలో తిరుమలరామచంద్ర జీవితమంత వైవిధ్య భరితమైన జీవితం ఎక్కడా చూడం. తనది వైవిధ్యభరితజీవితమే కాదు, వైరుధ్య వైచిత్రీ విలసితమైన జీవితమని కూడా ఆయనే చెప్పుకున్నారు. గడచిన రెండుమూడు శతాబ్దాలలోనే ఆయన వంటి వ్యక్తి తెలుగు సాహిత్యలోకంలో మరొకరు కన్పించరు. ఆయన గడిపినంతటి వైవిధ్య వైచిత్రీ జీవితంకూడా గడిపిన వాళ్ళెవరూలేరు. ఏవిధమైన భయాందోళనలు, ముందు జాగ్రత్తలు, ఆరాటాలు, ఆర్భాటాలూ, ప్రతీక్షలు, నిరీక్షణలూ, ఆశాభంగాలు, లేకుండానే, అథవా పట్టించుకోకుండానే ఆయన గడిపారు జీవిత మంతా. బహుశా ఆయన జీవితగాథ ఒక అత్యద్భుతమైన నవలకేమీ తీసిపోదు. అది 'స్వీయ చరిత్రాత్మక' నవల.

20వ శతాబ్దపు తెలుగు సాహిత్య పరులలో ఎవ్వరూ రామచంద్ర చూసినంత దేశం చూడలేదు. భారతదేశ వివిధ భాషలగూర్చి తెలుసుకోలేదు. తమ సమకాలీన ఇతర పండితులను కవులను కలుసుకోలేదు. చారిత్రక ప్రదేశాలు సందర్శించలేదు. కళలూ, శాస్త్రాలూ అధ్యయనం చేయలేదు. ఆయనచదివి నన్ని తాళపత్రగ్రంథాలూ, ముద్రితాలూ చదవలేదు. ఆయన చేసినన్ని పుస్తక సమీక్షలు చేయలేదు.

అదీ రామచంద్ర విశిష్టత, విలక్షణత, ప్రత్యేకత."

**- అక్కిరాజు రమాపతిరావు**